# ధర్మనందన విలాసము

( అను శృంగారరస ప్రబంధము )

—

శ్రీ కాళ్లకూరి గౌరీకాంతకవి
ప్రణీతము.

★

శ్రీ వెలిసేటి గురురాయుని కంకితము

1951

[ 2-0-0

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



గ్రంథ పోషక కర్త

శ్రీ వెలిచేటి సీతారామస్వామి దొరగారు

జననం. తేది 22-6-1884 సం॥ ఫొటో తేది 25-3-1949.

## శ్రీ వెలిసేటివారి వంశ వృక్షము






ములు:-

1 వెలిచేరు గ్రామనిర్మాత

2 బంటుపల్లిగ్రామం, మల్లికార్జునాలయం నిర్మాత

3 నడిపల్లిగ్రామం నిర్మాత

4 చిననడిపల్లిగ్రామం కట్టించెను

5 గోల్కొండ(సైన్యం)సర్ లష్కరుబాదుర్లాఖానును జయించెను

6 కృతిభర్త తండ్రి

7 కృతిభర్త నడిపల్లి వాస్తవ్యులు

8 ఈ గ్రంథ ముద్రణ కర్త, చిననడిపల్లి వాస్తవ్యులు

# సంపాదకీయము

ధర్మనందనవిలాసమను నీ మూడాశ్వాసముల ప్రబంధము శ్రీ కాళ్లకూరి గౌరీకాంతకవి క్రీ. శ. 1800 సం॥ ర ప్రాంతమున రచించి విశాఖపురిజిల్లా, నడిపల్లి గ్రామవాసియు, విజయనగర పూసపాటి గజపతుల సంస్థాన సేనానాయకులలో నొకఁడునగు శ్రీ వెలిసేటి గురురాయఁడను కమ్మదొరకు కృతినొసంగెను. తొలుదొల్త నీ యముద్రితగ్రంథవిషయము విజయనగరమహారాజాకళాశాల తెలుఁగుపండితులగు శ్రీ అడిదము రామారావుపంతులుగారు కళింగదేశచరిత్రలో పేర్కొని యందలికొన్ని పద్యముల నందుదాహరించిరి. వానిని జదివినపిమ్మట వారికివ్రాసి కృత్యాది పద్యములను మాత్రము బడసి, సంపూర్ణప్రతి లభింపకపోయినను, నేను కమ్మవారిచరిత్ర 2, 3 భాగములందు మరికొన్నిపద్యములను 1940, 42 సం॥ లలో బ్రకటించితిని. చారిత్రకోపయుక్తములగు నా పద్యములుదక్క నీ గ్రంథమింతవరకముద్రితమే.

కృతిభర్తృవంశకులలో సారస్వతాభిమానులును, సాధుసజ్జనసాంగత్యశీలురును, దానధర్మపరాయణులును, సుగుణసంపన్నులును, ఔదార్యవంతులునగు శ్రీ వెలిసేటి సీతారామస్వామిచౌదరిగారు లోకప్రఖ్యాతి దీనిని ముద్రింపించుటకై కొప్పిరి సీతారామయ్యయనువారిప్రతినిబట్టి 1899 వికారి సం॥లో గురాల లక్ష్మీనారాయణగారిచే వ్రాయబడిన యొక తాళపత్రప్రతిని సంపాదించి దానిని మరల వ్రాయించి " స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలన " మ్మను వ్యాసమూర్తిని దలంచి ప్రయత్నించుచు నింతలో నా గ్రంథములను జూచిన పిమ్మట దీనినిగూడ నన్నే ముద్రింపించుమని కోరి, దీనిని, ఎలయు ముద్రణావ్యయముతోడాటు నావద్దకు బంపిరి. వారి ప్రతులను బట్టియు, నావద్దగల యసంపూర్ణప్రతినిబట్టియు నీ గ్రంథము ముద్రింపనైనది.

శ్రీ సీతారామస్వామిదొర సారస్వతాభిమానమువల్లను, ఔదార్యవిశేషమువల్లను, కాలగర్భమున నశింపనున్న యీ పూర్వకవిరచితప్రబంధ మీ రీతి నాంధ్రలోకమున కందింపగల్గితిని. కృతికర్త, భర్తల కీర్తోధికయశస్సును జేకూర్చుచు, నీ గ్రంథమును వెలయించుచున్న శ్రీ చౌదరిగారు మిక్కిలి ప్రశంసనీయులు.

## కవి విషయము.

ఈ గ్రంథము రచియించిన కవి సుప్రసిద్ధ పండితవంశమగు కాళ్లకూరి యన్వయములోనివాఁడు. ఈతని తండ్రియగు సూరకసింహుఁడు సీతారామచరిత్రాది గ్రంథములను రచించెనఁట. పెదతండ్రియగు పేరయమనీషి రసవినోదాది కావ్యములను నిర్మించెను. వీరి వంశకర్త లక్ష్మీపతి సుభద్రాపరిణయాది కృతులం జెప్పెను. ఇవి యన్నియు సారస్వతమున నిప్పటికిని నిలచి ముద్రింపబడినవోలేవో పరిశీలింపఁ

దగియున్నది. కాళ్లకూరివారిలో నిప్పటికిని పల్వురు పండితకవులున్న విషయ మాంధ్రమహాజనులకు సువేద్యమే.

ఈ గ్రంథమంతయు శృంగారరసమున పొంగులువారుచున్నది. కొన్ని వర్ణనలు సంస్కృతసమాస భూయిష్ఠముగ నున్నవి. గద్యమందు కవి "కించిదాంధ్ర రచనా విధేయుడ"నని తెల్పుకున్నాఁడు. నిజముగా సంస్కృత రచనమందున్న పటుత్వ మితరతావుల గానరాదు. గ్రంథమందలి కథ రుక్మిణీకళ్యాణమును బోలి యుండును. ధర్మరాజు కళావతీలవివాహ మిందు వర్ణితము. ఈ ప్రబంధము మిక్కిలి రసవత్తరముగా నుండి శబ్దాలంకారములతోను, అనేకజాతీయములతోను ఆంధ్రుల సాంఘికచరిత్ర కుపయోగించు నమూల్యాభరణావ్యనేక వస్తువిశేషములతోను తెలుఁగుదన ముట్టిపడునట్లుగా ధారాశుద్ధిగల్గి విలసిల్లుచున్నది. శృంగారవర్ణనము లన్నియు బూర్వకవుల ఫక్కినే మితిమీరియున్నవనుట నిజమే యైనను, గొన్నితావుల నూతనత్వము గాన్పించును. ధర్మరాజునకు సమకాలికుఁడుగా ఋతుపర్ణుఁడనురాజు వర్ణింపఁబడుటఁ జూడఁ గవికి చారిత్రకవిషయముల ననుసరించు పూనిక గానరాదు. మహాకావ్యములోవలె నింపనేక వర్ణన లున్నవి. ఎడనెడ గొన్ని వ్యాకరణ, లక్షణదోషము లున్నను మొత్తముమీద నిందుత్తమమగు పోకడలుగలవు రసజ్ఞలోకము దీనియందలి స్వారస్యమును గ్రహించి యాంధ్రసారస్వతమున దీని నుచితస్థాన మలంకరింపఁ జేయుము గాక!

ఇందలి 1, 2 పద్యములు పూర్వగ్రంథములలో నున్నవి. కవికి వానిపై ననురాగముకొలఁది జేర్చియుండును (శారికాపికావర్ణనము) సీసపద్యములలో గొన్ని తావులను గవి నలలములను మిశ్రసమాసములను వాడియున్నాఁడు. ఇవి సారస్వతమున నపూర్వములు. దేవతాస్త్రీల యునికిని, వారికిని మహీపతులగు నరులకు గల సంబంధమును దాక్షాయణీరూపధారిణి యున్నగువారి సంభాషణాచర్యల మూలమున గవి యాయాచోట్ల వ్యక్తపరచి మూఢవిశ్వాసముల గొంతవరకు సడలించెను. మహాభారతమునందలి నలోపాఖ్యానమునగూడ దేవతలపట్ల యిట్టి వర్ణనలే కలవు. దేవతలీలోకవాసులేనని తెలియగల ఘట్టములు మన గ్రంథములం దరుదుగానున్నవి కుంతీదేవి సఖ్యము మొదలగునవి యున్నను భారతాదులలో మహిమాస్పదములుగఁ జెప్పఁబడినవి. ఇందులోగూడ కవి యుపశ్రుతిదేవతను దాక్షాయణీరూపిగా నొనర్చినాఁడు. ఐనను సురనారులు, ఖేచరులు, నాగకన్యలు మున్నగువారు హిమవత్పర్వత నివాసులుగా గవి వర్ణించి దేవతల యునికిని స్పష్టీకరించెను. శబ్దాలంకారములలో గవికిగల చాతుర్యమున కీ క్రింది పద్య ముదాహరణముగ దీసుకొనవచ్చును.

"సీ॥ అగ్రజన్ముల భంగి - నగ్రజన్ములఁ గాంచు, తనయుల భంగి పు - త్రసములఁ గను
తమ్ముల ట్లర్థిఁ జా తమ్ముల నీక్షించు, సముల యశస్సార - సములఁ జేయు

శ్రితుల లక్ష్మీసమా - శ్రితులఁగా నొనరించు, నరుల కాఱడవి కా - పరులఁజేయు
తల్లులంచు సతీమ - తల్లుల నీక్షించు, చరుల నజ్ఞాన సం - చరులఁగగను

గీ॥ నెంతపుణ్యాత్ముఁడితఁడు మహీతలమున
సత్స్వభావుండు ధర్మని - ష్ఠాగరిష్ఠుఁ
డార్యసన్నుతచరితుఁడ - వార్యధైర్యుఁ
డతులవీర్యుండు గురువరా - యాహ్వయుండు."

ఇట్టివెన్నియో గ్రంథమున గలవు సంస్కృతరచనా పటిష్టతకు ధారాశుద్ధికి యీ క్రింది పద్యము తార్కాణమగును.

"సీ॥ మందార కుందార - విందచందన చంద్ర, బంధురంబు జితాభ్ర - సింధురంబు
హీరముక్తాహార - హిమవాఃజీశ్వరుదు - గ్ధాకరంబపహ్నా - తారకంబు
శర్వపర్వత ధరా - ధూర్వత స్వర్ధేను - గోవరంబపహాత - సారసంబు
శరవర శిశిరవా - సవ తురగస్వను, శ్రీకరంబమిత సు - ధాకరంబు

గీ॥ శారదానంత పారద - శారదాభ్ర,
కారణంబమృతాంభోను - సారణంబు
సాధుజనగేయు వెలిచేటి - జగ్గరాయు
చారుతరభూరికీర్తి వి - శ్వప్రపూర్తి."

ఇట్టివి జూపమొదలిడినచో గ్రంథమంతయు జూపవలసి వచ్చును గాన నా విషయమింక పాఠకులకే వదలెదను. గ్రంథపాఠము లొకటి రెండు చోట్ల నాచే పూరింపఁబడి బ్రాకెట్లమధ్య నుంపఁబడినవి పాఠభేదము లధోభాగమున గనుపఱుప బడినవి.

## కృతిభర్తవంశము _ చారిత్రక పరిశీలన

కృతిభర్త యగు శ్రీ వెలిచేటి గురురాయనివి ఆంధ్రదేశములో ప్రసిద్ధి వహించిన కమ్మవంశము. ఈ కులోత్పత్తిని గుఱించి పూర్వకవుల రీతినే కవి యెట్లిందువ్రాసినను, తత్పూర్వశాసనములను బట్టి యిది ప్రాచీనక్షత్రియవంశములలో నొకటియై యుండి, బౌద్ధ, జైన, వీరశైవ, వీరవైష్ణవాది మతవిప్లవములలో మతా చారములను కొంతవరకు వదలిన యొకశాఖయని రుజువుపడు చున్నది. దుర్జయ చోళ, చాళుక్యాదిక్షత్రియవంశశాఖ లనేకమిందంతర్భూతమై, తుదకు వారి నివాసము పేరిట కమ్మవారుగా ప్రసిద్ధపడినట్లు రుజువైనది. (కమ్మవారిచరిత్ర 1, 2, 3 భాగ ములు చూడుఁడు) శ్రీనాథమహాకవి 14 వ శతాబ్దములో నుడివినట్లీ పావనవంశాంత ర్గతమైనదే కృతిభర్తవంశమగు వెలిచేటివంశము గూడను. వీరు కందాళగోత్రీకులు, ఈ వంశపు మూలపురుషుఁడు తిరుపతినొర. ఈయన పసిష్ఠ గోదావరీప్రాంతమున వెలిచేరను గ్రామమును క్రీ. శ. 1650 ప్రాంతములో గట్టించెను. ఈయనకు మంగాం

బికవలన మల్లికార్జునుఁ డుదయించెను. ఈ మల్లికార్జునుఁడు బంటుపల్లి యను గ్రామమును విశాఖపురిజిల్లాలో భోగపురి సీమయందలి రణస్థలిప్రాంతమున నిర్మించుటయేగాక నచట తనపేర మల్లికార్జునాలయమొకటి నిర్మించి ప్రసిద్ధి కెక్కెను. విజయనగరపు పూసపాటివారి సంస్థానమున బ్రవేశించిన వంశీకులలో నితఁడే మొదటివాఁడు. ఇతఁడు విజయనగరరాజును దర్శించి పౌరుషముచే బంటుపల్లిని గట్టించినట్లు కవి యీ గ్రంథమున వర్ణించియున్నాఁడు ఈ గ్రామము పేరునుబట్టియే నితఁడొక సేనానియని యూహింప నొప్పును. రెండవ కృష్ణరాజునకితఁడు సమకాలికుఁడు కావచ్చును. ఇతనికి కూర్మరాయ, నారప్ప, తిరుపతి దొరలను ముగ్గురు కుమాళ్లు జనించిరి. అందులో రెండవ తిరుపతిదొర నడిపల్లిగ్రామమును నిర్మించెను. ఈయనకు సీతమ్మాదేవివలన జనించిన చినకూర్మరాయ, నారప్పదొరలను వారిలో చినకూర్మరాయఁ డత్యంత ప్రతాపశాలిగను. పాదుషా సైన్యములను (గోల్కొండ ?) జయించినట్లుగ కవి నుడివి యున్నాఁడు. నారప్ప చిననడిపల్లి గ్రామమును గట్టించి పేరొందెను. రెండవ తిరుపతిదొర కచ్చమ్మదేవివల్ల పర్వత రాయఁడు, గోపన్న, జగ్గప్ప, అనంతరాయఁడను కుమాళ్లు గలిగిరి. ఇందలి పర్వత రాయుని కిర్వురు కుమాళ్లు కృష్ణరాయ, కామనరాయుఁడనువారలు — ఇందలి కామన రాయుని కుమారుఁడే మన కృతిభర్త గురురాయుఁడు — ఈయన సోదరులు పాపరాయుఁడు, జగ్గరాయుఁడులు చినకూర్మరాయని గురించి యీ క్రింది యైతిహ్యమొకటి గలదు చినకూర్మరాయనృపాలుఁడు పెదవిజయరామరాజుగారి వద్ద సేనాధిపతిగానుండి శ్రీకాకుళముకోట [లాంగుల్యనదీ ప్రాంతమును] వశపరచుకొనుటకై యచట పాలించుచుండిన బాదుర్లాఖానుమీదకు యుద్ధమున కేగెనట. ఈయనతోబాటు బొట్ల గురప్పదొరయను మరియొక కమ్మసేనానాయకుఁడుగూడ పంపఁబడెను. వీ రిర్వురును తమ సేనలతోవెళ్లి బాదుర్లాఖానుతో దారసిల్లి యుద్ధమొనర్చుటలో తమ శక్తినంతను ధారవోసినను; బాహుళ్యమైనట్టియు, యుద్ధనైపుణ్యమును గల తురుష్కసేనను జయింపలేకపోయిరి గురప్పదొర యా రణరంగమందే వీరస్వర్గమలంకరించెను. హతశేషులు చినకూర్మరాయనితోసహా మరలి వచ్చుచుండిరి. త్రోవలో రేగ యనే గ్రామమువద్ద అడిదము సూరకవిగారు పనసచెట్టెక్కి యాకులు గోసుకొనుచు, ఓడిపోయివచ్చుచున్న వీరి సైన్యమును గని యీ క్రింది పద్యము రచించెనఁట

" మెత్తనైనట్టి యరిటాకుమీదఁగాక । మింటిమీదను జెల్లునే ముంటివాడి
బీదలైనట్టి సరదార్లమీదగాక । కలది క్రొవ్వాడి బాదుర్లుఖానుమీద ॥ "

దీనికి లోలోపల పశ్చాత్తాపపడుచున్న చినకూర్మరాయనికి మరికొంతదూర మేగుసరికి యపజయవార్త విన్న వీరమాతయగు నాతనితల్లి సీతమ్మాదేవి యింటి నుండి రణతిక్కనకువలెనే పసుపు కుంకుమ లెమరు బంపెనఁట. దానికి లజ్జించి, మరలపౌరుషము దెచ్చుకొని, బాదుర్లఖానును జయించినగాని మరలిపోనని శపథ

మొనర్చి. యీ దాపుననే దేరసాము అనే గ్రామము ప్రక్కగల దండుబాటవద్ద డేరాలు వేయించుకొని, ఆరుమాసములు తనసైన్యమునకు సాముగరిడీలాదిగా యుద్ధనైపుణ్యమంతయు నేర్పించిన పిమ్మట నితఁడు మరల యుద్ధయాత్రకు బయలు వెడలి బాదుల్లఖానును జయించెనఁట.

అడిదము సూరకవియు, పెదవిజయరామగజపతియు క్రీ. శ. 1712 - 57 సం॥ ల మధ్యనున్నవారగుటవల్లను, కృతిభర్త కీయనకు మధ్య యొకతరమే యగుటను, కృతిభర్త క్రీ. శ. 1800 ప్రాంతీయుఁడగుటను, చినకూర్మరాయుఁడుగూడ క్రీ. శ. 1712 — 57 మధ్యవాఁడని చెప్పవచ్చును. గాని పెద్దాపుర సంస్థానచరిత్రమునుబట్టి చూడఁగా క్రీ శ. 1732 – 39 మధ్యను శ్రీకాకుళము పరగణాను రుస్తుంఖానను హాజీహుసేననువాఁడును, 1739 నుండి అతని కుమారుఁడగు సూరుద్దీనుసాహేబును, తర్వాత 1741 ప్రాంతమునుండి జాఫరల్లీయనువాఁడును, దర్వాత అబ్దుఖాన్ అనువాఁడును, గోల్కొండ సామంతులుగా పాలించినట్లు కనబడుచున్నది. గాని విజయనగరపు మూడవవిజయరామరాజుపేర కృతియొసంగఁబడిన కూర్మపురాణ పీఠికలో కూడ రామేశ్వరకవి తమ్మిరాజు కాలములో నొకబహదుర్లాఖానుఁడనువాఁడు శరణుపొందగా తమ్మిరాజు రక్షించినట్లు వ్రాసియున్నాడు గాని యీ తమ్మిరాజు దాదాపు క్రీ శ. 1520 ప్రాంతీయుఁడైనందున చినకూర్మరాయుఁడప్పటివాఁడు కాదు.

ఈతని గురించి యితర సారస్వతమున నేమైన యాధారము లున్నవేమో చూతము. రంగరాయచరిత్రము అను పద్యకావ్యములో దిట్టకవి, నారాయణకవి తాండ్రపాపయ్యచే నిహతుఁడైన మన విజయరామరాజు మృతికి శోకించిన బంధువుల యార్తాలాపములలో నీక్రింది విషయములను దెలిపియున్నాఁడు.

సీ॥ లీలమై జాఫర - ల్లీయు బాదుల్లాది, సర్లస్కరులగిట్టి - జయముఁగాంచి
యసురులాఖానుని యంతలేసినుబాల, నొగిఁకలేజునను గొ - ల్వుంచి మించి
కిమిలి చీకటి రాజ్యపదములు - చూబలుగొని, తమ్మిరాజులమీద - దాడిపెట్టి
యాగౌతమీ కట - కాంతరాశమూ, తలము నేకాతప - త్రముగనేలి"

ఇట్లాతని బంధువులు చెప్పుకొని దుఃఖించిరఁట. దీనినిబట్టి లోగడ నుడివిన బాదుల్లాఖానుగాక, విజయరామరాజుగారి కాలములోగూడ నొక బాదుల్లాఖాను సర్లస్కరుగా నుండినట్లు స్పష్టపడుచున్నది. అతనితోబాటు జాఫరల్లీగూడా సర్లస్కరుగా నుండెను. అసురులాఖాను మున్నగువారినిగూడ తానే సుబేదారుగాకొల్వునందుంచెనఁట. కిమిడిఁచీకటి దుర్గములను జయించెనఁట, గౌతమీనది మొదలు కటకమువరకు తానే పాలించెనఁట.

ఈపైన నుడివిన బాదుల్లాఖానుమీదకే మన చినకూర్మనృపాలుఁడు విజయరామరాజుచే యుద్ధమునకు పంపఁబడి జయము పొందెననుటకు సందియములేదు.

ఈ పెదవిజయరామరాజుగారు క్రీ. శ. 1712 సం॥ లో తమ పూర్వరాజధాని పొట్నూరును మార్చి విజయనగరమున నూతనముగా నొకకోట గట్టించెను. ఈయన నైజామువారికి నామమాత్రముగా పన్నులు యిచ్చెను వారికి లోబడియుండలేదు. శ్రీకాకుళము పరగణా విషయములో వీరికనేక యుద్ధములు గల్గుచుండెను. 1741 లో నైజాముతాలూకు జాఫరల్లీ సేనానిని జయించి యితఁడు అబ్దుల్ ఖాన్‌ను శ్రీకాకుళం హవేలీ గ్రామముల పాలించనిచ్చెను. మరల జాఫరల్లీని నైజాంనవాబువారు పంపిరి. ఈ నైజాము ప్రతినిధులకు వీరికి తరుచు కలహములుండెను. ఈ పిగాదాలలో 1752 సం॥లో గోల్కొండ సైన్యములనుగూడ నతఁడు జయించెను. (J.A.H.R.S. XIII Pts 3,4 P. 161) ఇట్టి యుద్ధములందే చినకూర్మనృపాలుఁడు పాల్గొని తన యనుపమాన శౌర్యసాహసముల బ్రదర్శించి యుండును. అందువల్లనే మనకవి యీతని వర్ణించుపట్ల —

" ముష్కరపాదుషా - లష్కరులకుమిత్తి, చెలువారునే వీరు - చేతికత్తి
పాదుషాహి వజీరు - పౌజుల తలమేకు, చెలువారునే వీరు - చేతిబాకు
గడిదేశదుర్గాధి - కరుల పెనుమారి, చెలువారునే వీరు - చేతిసూరి
యుత్కటదేశాది - యూధకల్పాంతంబు, చెలువారునే వీరు - చేతికుంతము"

అని చెప్పినాఁడు. వశీకృతులుగాని దుర్గనాయకులగు జమీందారులపైగూడ నీసేనాధిపతి చర్య గైకొనుచుండినట్లు పైపద్యమువల్ల మనము భావింపవచ్చును. 1752 లో నైజాంవారు ఫ్రెంచివారి కాప్రాంతములపై నధికారమొసంగఁగా వారు శ్రీకాకుళమును ఇబ్రహీంఖాన్‌ను పాలనలోనుంచిరి. ఈ ఫ్రెంచివారితో స్నేహపడి, వారితోజేరి, తన సేనలో 10 వేలమందిని సాయముగా బంపి 1757 లో తనకు విరోధులుగానుండిన బొబ్బిలివారిపై దండయాత్రజేసి దానిని వశపరచుకొని, చివరకు తాండ్రపాపయ్యచే నీవిజయరామరాజు నిహతుఁడగుట నాంధ్రదేశ మాబాలగోపాల మెఱిఁగిన చరిత్రాంశమే —

ఈ రాజ్యముక్రింద సత్యవరము, కాశింకోట, జల్మూరు, చికాకోలు, యిచ్ఛాపురం, టెక్కలి మున్నగు జమీందార్లు సామంతులై యేటేట పన్నులు పంపువారు. కోటలో 10 వేలపైగా సైన్యముండెడిది. జమీలలో 30 వేలసైన్యముండెను. అవసరమైనపుడీసైన్యముకూడ తోడువచ్చెడిది. ఈరీతిగా విజయనగరసైన్యము 40 వేలకు దాటియుండెను. దీనిని యీస్టిండియాకంపెనీవారుగూడ చూచి శ్లాఘించియుండిరి. కోటలోని సైన్యములను నడపుటకాకాలములో మిక్కిలి సమర్థులైన సేనాధిపతులుండినుట నిర్వివాదము. ఇట్టివారిలోనే మన పెరిచేటి కమ్మదొరలు జేరియుండిరి. సైనికులుగా సర్దారులుగా జాలమంది కమ్మవారు పనిజేయుచు వచ్చిరి. వీరిచర్యలే కొంతవరకు సూత్రప్రాయముగ కవి గ్రంథస్థమొనర్చెను. పెదవిజయరామరాజు కోరికపైననే చినకూర్మరాయుఁడు శ్రీకాకుళముకోట వశపరచుకొనుట కేగియుండును, ఈ

యిర్వర కాలములనుబట్టి యీవంశములో మిగతావారి కాలములనుగూడ కమ్మచరిత్ర లో వ్రాసినదానికి మార్పుగా నిప్పడీ క్రిందిరీతినిమవము నిర్ణయింపవచ్చును.

| క్రీ.శ. దాదాపు-మధ్య | విజయనగరరాజు | ఆకాలపు కమ్మదొర |
|---|---|---|
| ,, 16[illegible]2–87 | వెంకటపతి, ఆనందరాజు I | మల్లికార్జునదొర |
| ,, 1687–1712 | సీతారామ,ఆనందరాజుII లు | పెదకూర్మరాయ, నారప్పదొరలు |
| ,, 1712–57 | పెదవిజయరామరాజు | చినకూర్మరాయ,పర్వతరాయఁడులు |
| ,, 1757–59 | మూడవ ఆనందరాజు | కామనరాయుడు. కృష్ణరాయఁడు |
| ,, 1759–94 | రెండవ విజయరామరాజు సీతారామరాజులు | డిటో |
| ,, 1794–1915 | దాదాపు. నారాయణగజపతి. | కృతిభర్త, గురురాయఁడు |

పెదవిజయరామరాజుగారు 1757 సం॥ లో స్వర్గస్థులైనంతనే యాతని యన్న కుమారుఁడగు ఆనందరాజుగారికి ఫ్రెంచివారిక్రింద లోఁబడియుండుట కష్టములేక యాంగ్లేయులతో రాయభారమునల్పి ఫ్రెంచివారిని వెడలగొట్టుటకై యత్నించి, తాను గూడ తోడ్పడి ఫ్రెంచివారినోడించి యుండెను. 1757 లో చేబ్రోలువద్ద ఇంగ్లీషు ఫ్రెంచి యుద్ధము జరిగెను. అందానందరాజుగారు తనసైన్యముతో నింగ్లీషువారికి సాయపడెను. ఈయనయు, నింగ్లీషువారునుకలిసి తర్వాత పెద్దాపురం, రాజమండ్రి శ్యామలకోట మున్నగుకోటలు పట్టుకొనిరి. కుంమూరు, ఉండూరు (శ్యామలకోటవద్ద గలది) మొదలగుచోట్ల జరిగిన యుద్ధములలో జమీందార్లు ఫ్రెంచివారికి సాయపడి నను, ఆనందగజపతి సహాయమువల్లనే యింగ్లీషువారికి విజయము చేకూరెను. కృతి భర్త తండ్రియగు కామనరాయుఁడును, కృష్ణరాయుఁడును ఈకాలమందుండి యుద్ధ కార్యనిమగ్నులగుచుండి రనవచ్చును. అందుననే కవి వీరిని వర్ణించుచున్నాఁడు —

"క. రంభాదికామినీకుచ । కుంభమృగీమదకదంబ-గురుతక్షణదో
స్తంభాంతరులైదివిని వి । జృంభింతురుకృష్ణపీర-శేఖరుశత్రుల్॥"

అనియు —

"చ. అనుపమసత్యశౌచ విజ । యాంకుఁడు కామయయుద్ధవేదికా
దనఘుజసత్వముంకువయొ । నర్చియశోధవళాంబరస్ఫురత్
ఘనపథకాయమానము ప్ర । తాపమరాత్రికరూపమైఁదగన్
గొనియెజయేందిరన్ దిశలు । గోరికముత్తెపుసేసఁజల్లఁగన్"

అని వక్కాణించినాఁడు.

ఆనందరాజుగారు 1759లోచనిపోఁగా, నాయనభార్య చంద్రయ్యమ్మగారు తాళ్ళ పాలెంలోని తనభర్త జ్ఞాతిబృందములోని రామభద్రరాజుగారికుమారుఁడు వెంకటపతి

రాజును పెంపుగైకొని రెండవ విజయరామరాజుగా పేర్కొనెను. ఈయన చిన్నవాఁడుగ నుండఁగా యగ్రజుడును ద్వైమాత్రేయుఁడునగు సీతారామరాజుగారు పాలింపఁ దొడగిరి. ఈకాలమునకు గోల్కొండనవాబు నాయకత్వమీరాజ్యముపై నశించి, యీస్టిండియాకంపెనీవారు ప్రవేశించిరి. వారికేటేట కవుళ్ళపద్ధతిపై పన్నులు వీరు చెల్లించుచుండిరి. 1759 – 84 సం॥ లమధ్య ననేకజమీనులను కంపెనీవారు సీతారామరాజు పాలనలో నుంచిరి గాని జమీందార్ల తిరుగుబాట్లు మున్నగు చిక్కులవల్ల పన్నులు పూర్తిగారాలేదని కంపెనీవారు 1777 లో నీకోటనుగూడ పట్టుకొనిరిగాని తర్వాత వదలివేయఁబడెను. అప్పటినుండియు కంపెనీవారికిలోఁబడియే విజయనగర సంస్థానమున్నను, తగినంత సైన్యబలము 1810 వరకు ఉండెను. కూర్మపురాణ పీఠికలో యీసంస్థానమునకు లోబడియుండిన జమీలనుగురించి యిట్లున్నది.

" అవ్విధుండుర్వీతలంబు మహాధర్మంబున నేలునప్పుడు పన్నులకనుసన్నల నిచ్చువారు సద్భావుండగు జయపుర లాలాకృష్ణదేవుండును, సుతేజుండగు శృంగవరపుకోట సుతాకాశీపతిరాజును, సుమతియగు మాడుగలలింగభూపతియు, నవ్యాజుఁడగు సాలూరు సన్యాసిరాజును, ధీరులగు కోటపాలెపు ముత్తావారును, సాధుండగు కురుపాము శివరామమనోనాధుండును, విధేయుండగు ననకాపల్లి రామభద్రపాయ రాయుండును, సుకృతియగు గొలుగొండ వీరభూపతియు, ప్రతాపసాంద్రుండగు పాలకొండవిజయరామరాజేంద్రుఁడును, ధీవరయగునాంధ్రరామన్నదొరయు, నర్థిసుర మనోజుఁడగు రేగులవలస పూసపాటి విజయరామరాజును, నజేయుండగు పోరాపు పాయకరాయుఁడును, సుశౌర్యుఁడగు పాచిపెంట వీరపరాయవర్యుఁడును, నిష్టంకుండగు సంగంవలస నిశ్శంకుండును, సూన్నభోజుఁడగు చెముడులక్కిరాజును, సుప్రభావుఁడగు రాజా,రావు వెంగళరావును, గుణధారేయుఁడగు నరపమేదినీరావు వీరనరసింహరాయుఁడు" మొదలగువారు —

ఈ సామంతరాజు లద్దరివద్దను అనేకచిక్కులు కలపులుగల కాలములో పన్నులు వసూలుపరచి, కంపెనీవారికి జుమ్మా చెల్లించుటకు విజయనగరమున నెట్టి శక్తివంతములైన సైన్యములు, తదధిపతులు నుండవలెనో పాఠకులకు సులభముగా గోచరమగును. 1784 సం॥ లో సీతారామగజపతి బహుసామర్థ్యవంతమైన తన దివాన్‌గిరి పాలనను కంపెనీవారి యొత్తిడిచే వదలివేయుటవల్లను, సోదరులతో గల యభిప్రాయభేదములవల్లను విజయరామనృపాలుఁడే దర్వాత పాలన సాగించెను. వీరిపలుకుబడి కసూయజెంది వానివి తగ్గించుటకై యనేక కుట్రలు కంపెనీవారును, జమీందారులును పన్నుచుండిరి. తుట్టతుదకు 1794 సం॥ లో వీ విజయరామరాజు కంపెనీని ధిక్కరించినట్లు భావించి గొప్ప యుద్ధమొనరించిరి. ఇదియే పద్మనాభ యుద్ధము. దీనిలో వీరాగ్రేసరుఁడగు విజయరామభూపతి యాంగ్లేయుల ఫిరంగిధాకల కాగలేక తన బంధుపరివారము 310 మందితో గలిసి వీరస్వర్గమలంకరించెను. ఈయ

నను బంపుటన్యాయమని కంపెనీవారు చివరకొక తీర్మానరూపమున వెల్లడించిరి. ఈయన తర్వాత కుమారుఁడగు నారాయణగజపతి కంపెనీవారికి లోబడుటచే సంస్థానాధిపతిగాగుర్తింపఁబడి పాలనకు వచ్చెను.* ఈ నారాయణగజపతి సేనాధిపతులలో నొక్కఁడే మన కృతిభర్త గురురాయుఁడు. ఇతఁడుగూడ పైయుద్ధమునందు పాల్గొని యుండును. ఈయనకాలములో నప్పుడప్పుడు చిన్న యుద్ధము లున్నను, హెచ్చుగా గనపడవు. అందుచే నీయనకు తన పూర్వీకులకువలె గాక, కొంచెము విశ్రాంతి చిక్కినది. భాషాభిమానము తోడైనది. కవితావ్యాసంగము లారంభించెను. సమస్త పురాణాగమ పద పద్యార్థ భావసంపర్క విశద్ధుండని పేరు వడసినాడు. చివరికీ గ్రంథమునకు కృతిభర్తయైనాడు. ఈయన పైన నుడివిన పర్వతరాయునికి జగ్గమాంబ వలన జనించిన కామనరాయుని పుత్రులలో నొక్కఁడు. తల్లి వెంకమాంబ సోదరులు పాపరాయుఁడు, జగ్గరాయుఁడు ననువారు. వీరందరును అంగ, వంగ, కళింగ రాజ్యములందు ప్రసిద్ధులని, శూరాగ్రేసరులని కవి వర్ణించుటలో నతిశయోక్తి యుండదు. కృతిభర్త తండ్రిగూడ వీరాధివీరుఁడుగా జెప్పఁబడెను, కృతిభర్త ద్వాత్రింశదాయుధవిద్యాపారీణుఁడు. ఈయన గుణగణము లన్నియు గ్రంథమున విపులముగా నున్నవిగాన చర్వితచర్వణ మొనర్పను. కృతిభర్తవలెనే నారాయణ గజపతి గూడ సకలాయుధ రహస్యవేదియని, జ్యోతిష, మంత్ర, శాస్త్రరహస్యము లెఱింగినవాఁడని కూర్మపురాణమున నున్నది. ఆ కాలపు యుద్ధపరిస్థితులఁ దలంచిన వివియన్నియు స్వభావోక్తులే యనవచ్చును. 1790-91 సం॥ ల మధ్య దేశమున గొప్పక్షామము వచ్చెను. ఆ కాలములోను, దర్వాతను గృతిభర్త బంధుజనులను ఆశ్రితబృందమును బోషించి తన ఔదార్యమును బ్రకటించి యుండును. దీనిని గూడ కవి గ్రంథమున నుగ్గడించియున్నాఁడు ఈయన నడిపల్లిలో వసించుచుండెను. ఇచట నిప్పటి కీవంశీకులున్నారు.

క్రమముగా సంస్థానములందు సైన్యములను తగ్గించుటకై యాంగ్లేయకంపెనీ వారు పూనికొనిరి. 1802-10 సం॥ల మధ్య వీనిని పూర్తిగా తొలఁగించి తెల్లసైన్యములను అవసరమైనచోట్ల నిల్పిరి. నాటినుండి యీ విజయనగరసంస్థానమునందు గూడ సైన్యములు తగ్గింపఁబడెను. అందుచే నచట సైనికాధికారములు కోల్పోయిన కృతిభర్తవంశమువారు పరిపాలన కార్యములో నదృశ్యులైనను, పేరెన్నికగన్న సామంతులుగా నిప్పటి కాయా గ్రామములందు వసించుచు, వీరి పూర్వీకులకీబడిన నూరుయకరముల పైచిలుకు ఇనాంభూముల ననుభవించుచు, మరికొన్ని భూభాగముల నార్జించి ప్రసిద్ధిగ నున్నారు. ఈ వెలిసేటివంశీకులకు యరమనేడివారు, బొట్లవారు, బొడ్డువారు, గురాలవారు, నెక్కంటివారు, బొల్లింపల్లివారు, మన్నెవారు మున్నగు కమ్మవారు బంధువులైయున్నారు. ఈ వంశీకులు వీరిబంధువులు నిపుడు

* కళింగదేశచరిత్ర, కూర్మపురాణ పీఠికలాధారము.

బంటుపల్లి, వెలిశేరు, పెదనడిపల్లి, చిననడిపల్లి, కమ్మశిగడాం, దేవరాపల్లి, నంచాం, విజయనగరం మున్నగుచోట్ల నివసించుచున్నారు.

వీరి బంధువులలో మొదటియుద్ధమునందు చనిపోయిన బొట్ల గురప్పదొర కిర్వురు సతీమణు లుండిరి. అందు జిన్నభార్యయగు మహలక్ష్మిదేవి భర్తతో సహగమన మొనర్పఁగా నప్పటినుండి నామె పేర యేటేట యొకపురమును నిర్మించి యందామె కళ్యాణోత్సవము వైభవముగా జరుపుచు, బంటుపల్లి గ్రామస్థులు కళ్యాణమును, కమ్మసిగడాంవారు నిత్యపూజా పునస్కారములను, సంచాంవారు మేళతాళాదులు, వేల్పురాయి గ్రామంవారు పురనిర్మాణమును జేయుచు, నాదినములలో హరికథాకాలక్షేపాదుల సల్పుచు, నామెను దేవతగా ప్రాంతీయులందరు కొల్చుచున్నారు. ఈదేవత యరమనేడివారి వంశమున బుట్టినదై యున్నది.

కృతిభర్త యగు గురురాయఁడు భాషాభిమానియై, కవిపోషకుఁడై యుండనిచో నీ వంశచరిత్ర కాలగర్భమున నశించెడిదే. ఆతఁ డీ గ్రంథము వ్రాయించి, తనకును, దనవంశమునకును, కవికిని శాశ్వతత్వముఁ గూర్చుటయేగాక తన వంశచరిత్ర నాంధ్రలోకమునకు తెల్పి కృతార్థుఁడయ్యెననుటలో సందియము లేదు. గ్రంథముద్రణకర్తయగు శ్రీ సీతారామస్వామిదొర పైన నుడివిన చినకూర్మరాయనృపాలునికి 7 వ. పురుషాంతరమువాఁడై యుండి సప్తసంతానములలో నొకటియగు నీ కృతిని పునరుద్ధరించుట విశేషము. ఈయన వంశవివరము ప్రత్యేకముగ నున్నది. దానిని చదువుఁడు.

ఇట్లు,
సంపాదకుఁడు,
కొత్త భావయ్యచౌదరి.

సంగంజాగర్లమూడి,
4-12-1950

# ధర్మనందన విలాసము

## గ్రంథపోషక కర్త వంశావళి

**మ॥ మహిమున్వ్యాగనుశాసనుండు సృజియింపంగా గుండలీంద్రుండుర్వ్యా
మహనీయస్థితి మూలమై నిలుప శ్రీనాథుండు ప్రోవంగ మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపంగా సొంపువాటిల్లునీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునదత్త్వాగల్భ్యమూహించెదన్"**

అను నార్యోక్తి ననుసరించి సనాతన కవి తల్లజులచే సక్రమాభివృద్ధిగావింపఁబడిన భాషామతల్లికి మహాకవుల హృదయరంగము నాటకరంగము వంటిది. వారిలో పేర్కొన్న మహాకవియగు కాళ్లకూరు గౌరీకాంతామాత్యునిచే రచింపఁబడిన ధర్మ నందనవిలాసము అను శృంగారప్రబంధమును ఆనాటి సుప్రసిద్ధ కమ్మవంశాలంకారుఁడగు వెలిచేటి గురురాయని కంకిత మీయఁబడియెను. మఱియు నాకాలమున ముద్రణాదిసౌకర్యములు లేకుండుటచే నిట్టి మహాకావ్యమును నాంధ్రసోదర సోదరీమణుల కందించు భాగ్యము లభించలేదు." స్వదత్తాద్విగుణమ్ పుణ్యమ్, పరదత్తాను పాలయన్" అనునట్లు గ్రంథనిర్మాణముకంటె ద్విగుణీకృత ఫలమునిచ్చు జీర్ణోద్ధారణమునకు నేతత్కృతిపతివంశీయుఁడును, శ్రీమంతుఁడును వినయవివేకాది లక్షణసంపన్నుఁడు నగు శ్రీ వెలిచేటి సీతారామస్వామిచౌదరి యీ మహత్కార్యమునకు గంకణము గట్టుకొని చాల వ్యయప్రయాసలకులోనై నిర్వహించుట బహుశ్లాఘాపాత్రము. మరియు నీ సుగుణమణి ఈగీయఘనిమాట్కి తమ వంశీయులనెల్ల పవిత్రీకరణము సేయుటకు నిందు వంశానుబంధ వివరములు వ్రాయుటయం దతిశయోక్తి యని తజ్ఞులూహింపవలదు

మరియు విశాఖమండలస్థిత కమ్మవంశీయులలో నీ వంశ మూలపురుషుఁడగు శ్రీ తిరుపతిదొరకు, రెండవ పురుషుండగు చినకూర్మరాయని సంతతి అనగ మూల పురుషునకు నీ పోషణకర్త యెనిమిదవ పురుషుఁడు. నాఁటినుండి నేఁటివరకు నీ వంశస్థులు అగర్భశ్రీమంతులును, సత్య, దాన, ధర్మపరాయణులై యున్నారు. అందు కందాళగోత్రమున జనించిన వెలిచేటివారు, గురుసాంప్రదాయముగా ఆత్రేయస గోత్రములోనివా రగుటచే ఆర్షసాంప్రదాయము ననుసరించి కుల గోత్ర గౌరవము లందు మిగుల వన్నెకెక్కి యుండి రనుటకు వనేక తార్కాణములు గలవు. ఏమనగ

## వెలిచేటి అప్పయ్యదొర (1800 ప్రాంతం)

తిరుపతి దొరకు అయిదవ పురుషుఁడగు అప్పయ్యదొర సత్కార్యా చరణుం డును, భూరిదాన దయాపరుండునై యనేక సత్కార్యంబుల గావించి కాలధర్మము నొందెను వారి ధర్మపత్ని సీతమ్మ యను నామె. ఆమె పేరు సార్థకముల గావించు కొని భర్తగారి యనుసరణకు నేమియు భంగము రానీయకుండ నతిథి బంధు సత్కారంబులను, దాసదాసీజన పరిపోషణంబును, ఆశ్రిత గురువిద్వజ్జనాళి వందన మును వహించిపతి యసుగు జాడల తప్పని ధర్మసంసారమును నడిపించి పతికి తన ధర్మ సతీత్వ ధర్మమును ననుసరించి ఆ నాఁటి మహిళామ తల్లులకు మార్గదర్శియై ఆమె పేరున తాంబూలవల్యాది ఆరామముల నెలకొల్పెను. అవి నేఁటికాలమువరకును సుప్రసిద్ధమైయున్నవి. దేవతాగృహతటాక నిర్మాణములఁ గావించెను. మఱియు ప్రియపుత్రరత్నములగు భోజన్న, రామయ్య గారలకు ననేకవిధములగు విద్యాబుద్ధులఁ గఱపించెను. కొంతకాలమునకు వారిరువురును విజ్ఞానవంతులై గృహ, ఆరామజలాశయములనేర్పరచి, తమ పితృ గౌరవంబుల

## అపరభోజుడగు భోజన్న (1815 ప్రాంతం)

నిల్పి యశోవంతులైరి. అందున జ్యేష్ఠుఁడు భోజన్నకు మన్నెపంశ సంభూతురాలగు రాజ్యలక్ష్మిని వివాహము చేసిరి వీరలు నారాయణరాయఁడు సుందరరాయఁడు నను నిరువురు పుత్రరత్నములంగాంచిరి. వారిలో ప్రథమ పుత్రుఁడు నారాయణ రాయనికి గురాల పాపయ్య కొమరిక అమ్మాయమ్మను నామెను వివాహము చేసిరి. భోజన్న రామయ్య గారలు యిరువురు జనించిరి. మఱియు నీ భోజన్న బహు విద్యావంతుఁడై పూర్వగ్రంథములలో భారతాదిపురాణములను తాళపత్రలిఖిత ముగా జేసి భాషాసేవ గావించెను. రూపమునందును తేజమునందును సద్గుణంబు లందును భోజన్నకు భోజుండే సాటి యని యానాఁటి ప్రజాబాహుళ్యము మెచ్చు కొనిరని ప్రతీతి.

మరియు వీయనకు వాంద్రంగిగ్రామం మేదరమెట్లవారి వంశమునగల గుర వన్నగారి కొమరిత, సీతమ్మ యనునామె ధర్మపత్నిగ నయ్యెను. ఇంక నీ సీతమ్మ భోజన్నలయందు సూరిరాయఁడు. సత్యనారాయణ, అను యిరువురు పుత్రులుదయిం చిరి. పుత్రికలు 1 పాపమ్మ. 2 శాయమ్మ, 3 సుందరమ్మ. 4 కోనమ్మ. 5 మహ లక్ష్మి అనువారలు. ఇందు పాపమ్మ, గురాల సూర్యనారాయణగారి కొమరుఁడు పాపయ్య కొసంగఁబడెను. మఱియు శాయమ్మను వేల్పురాయిగ్రామ కా॥ మేదరమెట్ల లక్ష్మినరసయ్య కొమారుఁడు గురపయ్య కొసంగిరి. ఈ మేదరమెట్లవారు 15 వ-

శతాబ్దినుంచి గజపతుల కొలువులో సేనాధిపతులుగ నుండిరి. వీరికి, లక్ష్మీనరసయ్య, జగన్నాథము పుత్రులు, చిన్నమ్మాయి సుందరమ్మలుపుత్రికలు. సుందరమ్మ, పెద్దనడిపల్లి వాస్తవ్యుడు మన్నె బుచ్చయ్యగారి కామయ్యకు ధర్మపత్నిగా నయ్యెను. కోనమ్మను గురాల చిన్నగురవయ్యగారి కొమరుడు ప్రకాశరాయుడు కొనంగిరి. మహలక్ష్మియను నామె గచ్చలపలస అగ్రహారం వాస్తవ్యులు మన్నె అప్పన్నదొరగారి కుమారుడు సత్యనారాయణకు ధర్మపత్ని యయ్యెను. అందు కాయమ్మ గురవయ్యగారలకు లక్ష్మీనరసయ్య జగన్నాధము పుత్రులు. చిన్నమ్మాయి, సుందరమ్మలు పుత్రికలు. మహలక్ష్మి సత్యనారాయణలకు 1 లక్ష్మీనారాయణ, 2 చిరంజీవి, 3 భోజన్న అను పుత్రులును, 1 అనంతమ్మ 2 రాజ్యలక్ష్మియను పుత్రికలు గల్గిరి.

## గ్రామోద్యోగి రామయ్యగారు ( 1825 ప్రాంతం )

మఱియును నీ వంశమున నారాయణరాయుని కొమరుడు రామయ్య గ్రామోద్యోగమును నిర్వహించెను. అతడు నిత్యము అశ్వవాహనారూఢుడై సంచరించుచు, రూప, వైభవముల బేరెన్నిక గన్న ధీరోత్తముడు. ఈయనకు భార్యలు ముువ్వురు. అందు ప్రథమ కళత్రము గురాల సూర్యనారాయణ కొమరిత బంగారమ్మకు సీతమ్మ రాజమ్మ అను కుమారికలు గలిగిరి. ఇందు సీతమ్మ కోష్టగ్రామవాసి మన్నెరామయ్యగారి పుత్రుడు సీతాపతి కీయబడెను.

ఈమెకు రామయ్య అను పుత్రుడు గలడు. ఈయనకు బంటుపల్లి వాస్తవ్యులు వెలిచేటి కూర్మన్నగారి వంశములో సూరప్ప కొమార్తె చిట్టెమ్మను పెండ్లిచేసిరి. ఆయనకు 1 సీతాలక్ష్మి యను కుమార్తె 2 సీతాపతి యను కొడుకు గలరు. రాజమ్మను గురాల లక్ష్మీపతి కు॥ లక్ష్మీనారాయణ కిచ్చిరి. వీరికి నారాయణమ్మ యను పుత్రిక గలదు.

మఱియు గ్రామోద్యోగము గావించిన రామయ్యగారి ద్వితీయ కళత్రము గచ్చలపలస వాస్తవ్యులు గురాల వెంకన్న కొమార్తె బంగారమ్మయై యుండెను. తృతీయ కళత్రము పశ్చిమ గో॥ జిల్లా ఆచంట వాస్తవ్యులు చిలుకూరి వీరాసామి, గారి కొమరిత సూరమ్మ యను నామెయై యుండెను. వీరికి నారాయణరాయుడు. అమ్మాయమ్మ సావిత్రి యనువారు బిడ్డలు. వారిలో యిరువురు పుత్రికలు గురాల అప్పారావు చౌదరికి నొసంగబడెను.

మఱియు పైభోజన్న కు॥ సుందరరాయనికి కమ్మవారిసిగడాం వాస్తవ్యులు మన్నెవంశమున జన్మించిన సుందరయ్యమ్మను ధర్మపత్నిగా నొసంగిరి. వీరలకు ప్రభాకరరాయుడు పుత్రుడు పుత్రికలు అచ్చమ్మ చిన లక్షుమమ్మ యనువారు. అందు

ప్రభాకరరాయునకు. గచ్చలపల్ల అగ్రహారం వాస్తవ్యులు గురాల వెంకన్న పుత్రిక సుందరమ్మనిచ్చిరి. వారికి సుందరరాయుడు, వరహాలు, నీలకంఠము అను పుత్రులును అన్నపూర్ణ, వజ్రలక్ష్మియను పుత్రికలునుగలరు. అందు సుందరరాయనికి వేల్పు రాయివాస్తవ్యులు మేదరమెట్ల ఆదినారాయణగారిపుత్రిక భాగ్యలక్ష్మియొసంగఁబడెను. వరహాలునకు చిననడిపల్లి పె॥ నడిపల్లిగ్రామోద్యోగి గచ్చలవలస అగ్రహారం కా॥ మన్నేశీతారామస్వామికొమార్తె లక్ష్మీకాంతమ్మనిచ్చిరి. వీరికి బంగార్రాయుడు అను కొమారుఁడు కలఁడు. నీలకంఠమునకు మేదరమెట్ల అప్పలస్వామిపుత్రిక చంద్రావతి నిచ్చిరి వీరికి ప్రకాశరరాయఁడు పుత్రిక వెంకటలక్ష్మియు కలిగెను.

మఱియు పైని జెప్పిన ప్రభాకరరాయని పుత్రికలు అన్నపూర్ణ, వజ్రలక్ష్మలను వారిలో అన్నపూర్ణను గురాల రామయ్య కు॥ సుందరరాయున కిచ్చిరి. వీరలకు 1 వెంకటనారాయణమూర్తి, 2 రామచంద్రుఁడు. 3 వసంతుఁడు పుత్రులు. 1 అమ్మాజీ 2 లక్ష్మీనరసమ్మ యను పుత్రికలు కల్గిరి.

పై వజ్రలక్ష్మిని బంటుపల్లి కా॥ మన్నె అప్పన్న కు॥ నారాయణమూర్తికిచ్చిరి. వీరికి పుత్రులు, 1 బాబుజీరావు, 2 వరహాలు, పుత్రికలు 1 బాలరత్న 2 విశాలాక్షి గలరు.

## గ్రంథ పోషణకర్త తాత — ప్రకాశరాయుసగారు

( జననము 1839 — మరణము 1914 )

మఱియు మూలపురుషుఁడు తిరుపతిరాయకు అఖపపురుషుఁడు భోజన్న కనిష్ఠ సోదరుఁడగు, రామయ్యకు మేదరమెట్ల వంశస్థుఁడు సీతారామయ్య తోఁబుట్టువు బంగారమ్మ నొసంగిరి. ఆ బంగారమ్మ రామయ్యలయందు ఏకైక పుత్రరత్నమును, వంశవర్ధనుఁడునైన ప్రకాశరాయుఁడను కుమారుఁ డుదయించెను. వీరి తోఁబుట్టువులు. సీతమ్మ. కోనమ్మ. మహాలక్ష్మలు. వీరిలో సీతమ్మ గురాల సూర్యనారాయణ కొసంగిరి. కోనమ్మను గురాల గురవయ్యకు నిచ్చిరి. మహాలక్ష్మి గురాల లక్ష్మీపతి కొసంగఁ బడియెను. మఱియు వీరి కగ్రజుఁడు ప్రకాశరాయఁడు కుల, రూప, సౌంద ర్యముల మిన్నయై అనవరత సత్య ధర్మపరాయణత్వమున దైవ బ్రాహ్మణభక్తియు యదృచ్ఛాలాభమున నిరంతరము కృషి ధర్మవ్యాపారమున బహుజనాంగీకృత, దాన ధర్మనిరతుఁడై మహత్తరపుణ్యకార్యములు జరిపి, నిరతాన్నదాన పాసీయాది వసతుల నేర్పరచియు బ్రహ్మప్రతిష్ఠాది సప్తసంతాన గరిష్ఠుఁడై సుందర మందిరారామ నిర్మాణములందును సంతత విద్వజ్జనగోష్ఠియును గలిగి రారాజుసాంగత్యములచే సతత వాహనయానమున సంచారము చేయుచు తాను ధర్మమనుసరించి తదితరుల నాచరింపఁజేయుచు, భూలోకస్వర్గమనం దన గృహస్థాశ్రమమున నష్టయిశ్వర్య సిద్ధులబొంది, ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థసిద్ధివడసి తనతోడి



శ్రీ వెలిచేటి ప్రకాశరాయుఁడు ధొర గారు

జననం: 1839. :: అస్తమయం: 1914.

ఛాయవలె సర్వధర్మములను వడసిన లక్ష్మాంబతో బాల్య, యౌవన, కౌమార వార్ధక్యములు గడపి, డెబ్బదియైదేండ్లు మించి పరమాయువుతో నిహపరములయందు ధన్యత్వమును వడసెను.

మఱియు వీరిధర్మపత్నియైన శ్రీ లక్ష్మాంబ మేదరమెట్ల సీతారామయ్యగారి పుత్రీరత్నము. ఈమెసోదరీలు, 1 మహాలక్ష్మి. 2 అచ్చమాంబ, సోదరులు 1 కూర్మన్న 2 ప్రకాశం అనువారు. వీరలతల్లి గురాల రామయ్యగారికొమరిత చిట్టిమాంబయను నామె. యిందు అచ్చమాంబ పెంద్రంగివాస్తవ్యులు యరమనేడి రామమూర్తికి నొసంగఁబడియెను. వీరలకు కుమారులు 1 నారాయణ 2 సీతారామయ్య 3 అప్పలరామమూర్తి 4 సత్యనారాయణ అనువారు. కొమరితలు 1 గున్నమ్మ 2 చిన్నమ్మాయి 3 అప్పలమ్మ అనువారు.

ఇఁక లక్ష్మాంబ ప్రకాశరాయఁడు అను పుణ్యదంపతుల పూర్వ పుణ్య వ్రత తపోమహిమయనునట్లు పురుషార్థములవలె నలువురు పుత్రరత్నములును, పుత్రికాద్వయమునుకలిగిరి. అందు పుత్రరత్నము 1 అప్పలనరసింహస్వామి 2 సీతారామస్వామి 3 రామయ్య 4 సుందరరాయుడు అనువారు. పుత్రికలు 1 బంగారమ్మ 2 రామలక్ష్మి అనువారు. వీరలలో పుత్రిక బంగారమ్మ గురాల భాస్కరరాయునకును, రామలక్ష్మి గురాల కూర్మన్నకు, ధర్మపత్నులుగా నొసంగఁబడిరి.

## అప్పలనృసింహస్వామిగారు 1914 – 42

మఱియు నా అప్పలనృసింహస్వామి తండ్రి యనంతరము పితృపితామహ గౌరవప్రతిష్ఠల ననుసరించి, కార్యధురత్వము గల్గి దుష్టశిక్షణయు, శిష్టరక్షణయును, నాత్మధనముగా వ్యవహరించి, సమస్తభోగభాగ్యమహిమాన్వితులై యుండిరి. వీరి తండ్రి పూర్వులకు చిననడిపల్లిలో పాతలోగిండ్లు యినాం జిరాయితీ భూములు నూఱు యకరములు గలవు. అందున రామయ్య సుందరరాయులు పెద్దవారైనను యీ అప్పలనరసింహస్వామి తండ్రి ప్రకాశరాయుఁడు కుటుంబయజమానిగ వ్యవహరించి, అందు సంగోరు వాటాను గ్రహించి, తన ప్రాగల్భ్యమునను స్వకీయ పరాక్రమునను వారి అవసానకాలమునకు భూమిని దేవరాపల్లి అగ్రహారములోను చిన్ననడిపల్లి లోను గొల్లలములగాం, బూదపేట గ్రామములలో 250 యకరముల జిరాయితి యీనాం భూములు, చిననడిపల్లిలో క్రొత్తలోగిలి సంపాదనముచేసి 1914 సం॥ లో కాలధర్మము నొందిరి. పిమ్మట అప్పలనృసింహస్వామిగారు వ్యవహారమునకు వచ్చి దేవరాపల్లి అగ్రహారమున 150 యకరములు సంపాదించి, గొప్పలోగిలికట్టి తటాక కూప నిర్మాణముల గావించెను.

మఱియు చిననడిపల్లి గొల్లలములగాం, తిరుపతిపాలెం, తాళ్లవలస, మధురశీర్లపాలెం, వేల్పురాయి, పేరప గ్రామములలో జిరాయితీ యినాంభూములు 350

యకరములు సంపాదించి, తన కుటుంబమునకును, తన సోదరుఁడు రామయ్యగారి కుటుంబమునకును సమస్త ఐశ్వర్యములకు వెలితిలేని గోహిరణ్య, పశ్వాది, గృహోపకరణశయన యానాది వివిధమార్గములందు తన పెద్దకుమారుని చేయూతగ జేకొని యితఁడభివృద్ధి గాంచెను. తన జీవితమున నెదురించినవారిని గర్వమడం చుచు, శరణాగతుల గాపాడుచు, సతత సత్కార్యనిమగ్నులై కాశీ మొదలుగాగల పుణ్యతీర్థసందర్శనచేసి, దశవిధదానముల గావించి తన జీవితమును సార్థకముచేసి తమ తండ్రివలెనే డెబ్బదిమైదేండ్ల పరమాయుర్దాయమున క్రీ. శ. 1942 సం॥ రం జనవరి 2 వ- తేదీని శ్రీరామనామపారాయణ జేయుచు తన స్వజనములతో తత్వ శాస్త్రము జెప్పుచు, గోభూహిరణ్యాది దానములుచేసి అనాయాసమున జ్ఞానమరణ మున స్వర్గమలంకరించెను.

మఱియు వీరి ధర్మపత్ని గురాల సూర్యనారాయణ కొమరిత, చిట్టెమాంబ జ్ఞానసంసారము ననుభవించి పరిహిత కార్యములయందు దైవార్చనమునందును, సాధుపోషణయు, దీనసంరక్షణయుగల్గి సమస్త పతివ్రతా ధర్మముల అలతివారల కుపదేశించి, తాను వంశమునకును, ఆనాటి యువతీమణులకును, బంధు బృందముల కును, తలకట్టుగా మెలంగి, అత్తమామల యాజ్ఞానువర్తియై పూర్వ సాంప్రదాయ ముగా సచ్చరిత్రముకల్గి ముగ్గురు కొమారులను, ముగ్గురు కొమరితలను వడసి, సుమంగళవతియై సతత అష్టయిశ్వర్య భోగభాగ్యముల ననుభవించి, తన బంధు మిత్ర స్వపరివారసమక్షమున శ్రీరామనామస్మరణయుక్తమగు మనస్సుతో పుణ్య స్త్రీ స్వర్గమలంకరించెను.

## గ్రంథపోషణకర్త చరిత్ర – వెలిసేటి సీతారామస్వామిగారు

(జననము 1894)

ఆ పుత్రరత్నములలో సీతారామస్వామి ప్రథమగణ్యుఁడు, ద్వితీయుఁడు బంగారురాయఁడు, తృతీయుఁడు సూర్యప్రకాశనారాయణరాయఁడు అనువారు. మాణి క్యాంబ, లక్ష్మీనరసమ్మ, సీతాలక్ష్మియనువారు పుత్రికారత్నములు. అందు మాణి క్యాంబ సీతాలక్ష్మమ్మలు గురాల వెంకన్నగారి కు॥ లక్ష్మీనారాయణగారికి ధర్మపత్ను లుగానొసఁగబడిరి. అందు సీతాలక్ష్మమ్మకు వెంకటరమణాంబయను పుత్రికయు, వెంకట బంగారురాయుఁడు అను పుత్రుడును గల్గిరి. మధ్యమురాలగు లక్ష్మీనరసమ్మ గురాల భాస్కరరాయని కు॥ ప్రకాశరాయునకీయబడెను. ఇట్లుండ నీయప్పలనృసింహ స్వామి జ్యేష్ఠపుత్రరత్నము సీతారామస్వామి క్రీ॥ శ॥ 1894 సం॥ జూన్ 22 వ తేది సరియగు శ్రీజయనామసం॥ ర జ్యేష్ఠ బ ౪ శుక్రవార ధనిష్ఠానక్షత్ర కుంభలగ్నమున జన్మించెను. జన్మాదిగా బహుళభాగ్యభోగములలో నోలలాడుచు, తనకుటుంబమునకు ఉత్తరోత్తరాభివృద్ధిగ భూగృహ ఆరామసౌకర్యములు ధన ధాన్య పశు లోహ సమృద్ధియు అష్టయిశ్వర్య సంపదలుకల్గి యుభయవంశవర్ధనత్వమున నీ సీతారామ

స్వామి వెలయుచు బాల్యమునుండియు శ్రీ రామచంద్ర ధ్యానపరాయణత్వమున లోక సంగ్రహ విద్యల నభ్యసించి, మాతా పితృ గురు శుశ్రూషలచే ధన్యుఁడై స్వజన పోషణయు, ఆర్యజనాదరమును, సాధుసజ్జన గురు పితృ దేవతాభివాదమును సంపాదించి, ప్రకృత పరాకృత విద్యను లౌకికస్వాతంత్ర్యజ్ఞతకల్గి, బంధు మిత్ర స్నేహానుభూతిభావమున, విజ్ఞానవివరమున లోకవర్తనమును కర్మాచరణ, సత్యస్వభావమును కలిగి, కృషిచే సర్వధర్మపరాయణత్వమున జీవయాత్రనడిపింపఁబూని క్రీ. శ. 1926 సం॥ రమున జనవరి నెలలో శ్రీ చికవూరి నారాయణదావాజీ గురుస్వాముల యొద్ద సమాశ్రయుడై తన జన్మను పవిత్రీకరణము గావించుకొనుచు, ఏ తద్ధర్మము ననుసరించి మహాపురుషులను దివ్యస్థలములను కాంక్షించి శ్రీశైల, కాశీ, జగన్నాథ, రామేశ్వరాది పుణ్యతీర్థముల మెట్టి, ఏతత్స్థలమాహాత్మ్యముల గ్రహించెను. మఱియు తత్సమయమందు తిరుపతి గోగర్భాశ్రమమందు శ్రీ మలయాళస్వాములవారిని 1926 సం॥ రము మార్చి నెలలో దర్శించి, పూజించి వారి సమస్త గ్రంథములను, వారి వ్యాసాశ్రమ " యథార్థభారతీ పత్రికా " గ్రహణంబును గావించి అపారహాముల యందు వారి గ్రంథ ప్రతిపాదిత విషయములచే జీవితసమాచరణముసేయుచు వారినే బోధగురువులుగా ధ్యానించు చున్నారు.

ఇట్లు పిత్రార్జిత ధనభూగృహాదుల ననుసరించి వానిని స్వకీయాభివృద్ధిలోనుంచి దేశకాలపాత్రానుసారముగ సంభవించిన గాంధీయుగపురుషతత్వ సూత్రములు మనమున విమర్శించి, తన పూర్వార్జితజ్ఞానమునకు దోహదములైన, శాంతదయాసత్య శౌచముల మార్గములను అహింస, సత్యభూతదయాశుత్వ, హరిజనసేవాదుల ననుసరించి కృషిమూలముగ కర్మిదేహము నడిపించుచు, గురాల కూర్మన్నగారి పుత్రీరత్నమగు సూర్య బంగారమ్మ యను సుశీలావతి పవిత్రగుణవతిని పితామహుని నిర్ణయము మేరకు గ్రహించి, ప్రాకృతసంసారమును ఆర్షధర్మమార్గముగ నడిపించుచు. తన భర్త అనుసరించు విషయములనే స్వధర్మముగను భర్తతోడిదే లోకమని సంచరించు నీ పుణ్యవతితో జీవయాత్ర గడపు చున్నారు.

తదనంతర మీ గుణమణి ద్వైతీయ సంపద్గుణములచే విలసిల్లుచు, మాతా పితృ గౌరవప్రపత్తులను పురస్కరించుకొని దశదిశలను తన కీర్తులను ప్రతిపాదించి తన సదుపదేశములచే మానవలోకము నారాధించుచు. సంతోషింపఁజేయుచు, శాంత, సత్య, జీవకారుణ్యముల ప్రధానాంగముగా గ్రహించి తమ వంశములవారి యౌన్నత్యములను దలంచుచు, స్వగ్రామమగు చిన్ననడిపల్లిలో గాపురము స్థిరపరుచుకొనెను. కృతిపతివంశ మూలపురుషుఁడు తిరుపతివారకు ఆయిదవ పూరుషుఁడగు అప్పయ్య గారు చిన్ననడిపల్లి గ్రామమున శంకుస్థాపనముచేసి లోగిండ్లు కట్టించి దాసీదాసపరివారవర్గమును నెలకొల్పెను. శ్రీ ప్రతిష్ఠ దాదాపు రెండువందల యేండ్లగునవి ప్రతీతి. మఱియు నా గ్రామము సమస్త సౌఖ్యములకు నాలవాలమై, తృణ, కాష్ఠ,

జల సమృద్ధిగలదై విరాజిల్లు చుండెను. తద్గ్రామ పరిసరమున తూర్పుగ చిన్ని పర్వతములు, సెలయేళ్లు, సుందరవనములు, పవితటాకంబుల విహంగ మారుతము లతో మహర్షి తపోయోగ్యమై నేటికిని వెలయుచున్న దీ చిన్ననడిపల్లె.

గ్రంథపోషణకర్త యగు సీతారామస్వామికి త్రిమూర్తులవలె ముగ్గురు పుత్రులను, పుత్రికాద్వయమును పరమాత్ముఁడు ప్రసాదించెను. అం దగ్రజుఁడుగా తేది ( 8–6–1921 ) దుర్మతి సం॥ర జ్యేష్ఠ శు ౨ బుధవారం జగన్నాథరావును, (2) తే 28–12–1928, సరియగు విభవనామ సం॥ర మార్గశిర శు ౧౦ లు స్థిరవారం అశ్వినీనక్షత్ర మిధున లగ్నమందు అప్పల గోపాలరావును, 20–1–1939 తేదీ సరియగు బహుధాన్యనామ సం॥ రం పుష్య బ ౩౦ లు శుక్రవారం ఉ॥ షా॥ నక్షత్ర మున రామచంద్రరావును జన్మించిరి.

పుత్రికలలో:–

తే. క్రోధననామ సం॥ర మార్గశిర శు ౧౩ లు బుధవారం అలివేలుమంగాంబికయును తే. శ్రీముఖనామ సం॥ర ఆషాఢ బ ౧౩ లు గురువారం లక్ష్మీబాయమ్మయును జన్మించిరి. అందు ప్రథమ పుత్రరత్నమునకు పశ్చిమగోదావరిమండలస్థల, ఆచంట గ్రామ వాస్తవ్యులు శ్రీ చిలుకూరి వెంకట్రాయులుగారి ద్వితీయ పుత్రిక ముత్యాలక్ష్మమ్మను వివాహము చేసిరి వీరలకు తే. 1941 తారణనామ సం॥ ర చైత్ర శు ౯ లు జానకీరామ్‌ను, తే 29–10–1948 సర్వధారినామ సం॥ర ఆశ్వీజ బ ౧౧ లు శుక్ర వారం ఉపేంద్రరాములను పుత్రరత్నములు కలిగిరి.

పుత్రికలలో అలివేలుమంగాంబను గురాల భాస్కరరాయ ద్వితీయ పత్నీ మంగాంబ దత్తపుత్రుఁడు శ్రీరామమూర్తికి నిచ్చి వివాహము చేసిరి. వీరికి జ్యేష్ఠ పుత్రిక జానకీలక్ష్మి. తే. 22–1–1944 స్వభానునామ సం॥ ర పుష్య శు ౧౨ లు బుధవారము కమలాకుమారీ అను పుత్రికారత్నము, తే. 26–8–46 భాస్కరరామ్ తే. 30–1–49 సర్వధారినామ సం॥ ర పుష్య బ 30 లు నాడును కలిగిరి. వీరిట్లు పుత్రపౌత్రికాబృందముతో నొప్పారు చున్నారు.

మఱియు గ్రంథపోషణకర్త యగు సీతారామస్వామి ద్వితీయ సోదరుఁడు సూర్యప్రకాశనారాయణరాయునకు, విజయనగరంవాస్తవ్యులు, బొడ్డువంశప్రవర్తనులగు 1 వెంకటేశంవార, 2 వెంకటనారాయణ, 3 నరశింహము, 4 అప్పన్నవారగారలు క్రమముగా సోదరులై వీరిలో వెంకటనారాయణ కు॥ వెంకటేశంవార కొమరిత పార్వతమ్మనిచ్చి వివాహముఁ గావించెను. ఈయనకు పుత్రికలు ఆరుగురు క్రమముగా 1. సీతారత్నం, 2. లలితాకుమారి, 3. జయలక్ష్మి, 4. అనసూయ, 5. మంగాంబ, 6. వెంకటలక్ష్మి యనువారు. అందు జ్యేష్ఠపుత్రికను గురాల లక్ష్మీనారాయణ గారి కు॥ బంగారురాయునకును, రెండవ కన్యను తూ॥ గో॥ జిల్లా మేకపాకగ్రామం కొరపాటి వెంకట్రావునకు నిచ్చి వివాహముఁ గావించిరి.

ఇక మన గ్రంథపోషణ కర్త యగు సీతారామస్వామిచౌదరికి పినతండ్రియగు రామయ్యగారి వంశక్రమం బెట్టిదనిన:—

ఈయన భార్య మేదరమెట్ల గురవయ్యగారి ప్రథమ పుత్రిక మహాలక్ష్మి. ఈమె పతివ్రతయు, శాంతాది సద్గుణోపేతయు ఉభయవంశపవిత్రియునై, సుమంగళయుక్తముగ కీర్తిశేషురాలయ్యెను. ఈ మహాలక్ష్మి రామయ్యగార్లయందు ప్రథమ పుత్రిక సుందరమ్మ, సుపుత్రులు 1. కాశీవిశ్వేశ్వరరావు (యీతఁడు దేవరాపల్లి అగ్రహారం గ్రామోద్యోగి) 2. ప్రకాశరాయఁడు అను యిరువురు పుత్రు లుదయించిరి. ఇందు పుత్రికను పెద్దనడపల్లిగ్రామ వాస్తవ్యులు మన్నె ప్రకాశరాయుడుగారి కు॥ అప్పల కామన్నగారి కొసంగెను. వీరలకు 1. వెంకటరమణారావు, 2. రామచంద్ర రావు, 3 గోపాలకృష్ణరావు, 4. సత్యనారాయణరావు అను పుత్రులును, కన్నాంబ యను పుత్రికయు గలరు మఱియు పై కాశీవిశ్వేశ్వరరాయునకు గురాల లక్ష్మీనారాయణగారి ప్రథమ పుత్రికయగు వెంకటరమణమ్మను యీ గ్రంథపోషణకర్త తండ్రి తన మనుమరాలి వివాహముగావించెను. వీరలకు అప్పలకొండ యను ఒకకుమారుఁడు గలఁడు. మఱియు వీరి సోదరుఁడు ప్రకాశరాయునకు తూ॥ గో॥ జిల్లా రంగమ్మపేట వాస్తవ్యులు ఉండవిల్లి సత్తిరాజుగారి ప్రథమ పుత్రిక సుబ్బాంబను వివాహము చేసిరి. వీరలకు నలువురు పుత్రికలు. 1. లక్ష్మి, 2. ముత్యాభాయి, 3. రత్నం, 4. శిరోమణి అనువారు. ఒక కుమారుడు వీరవెంకటనరసింహారావు.

## గ్రంథ పోషణకర్త మాతృవంశము

### గురాలవారు (పాఠాంతరము) గుఱ్ఱాలవారు)

వీరి మూలపురుషుఁడగు గురాల రామయ్యకు నాలుగవ పురుషుఁడు సూర్యనారాయణ. ఈయన భార్య సీతమ్మ. సీతమ్మ పై గ్రంథపోషణ కర్తకు మాతామహియై యుండెను. వీరలకు లక్ష్మీనారాయణ. భాస్కరరాయుఁడు. పాపయ్య లక్ష్మీనారాయణ అనువారు నలుగురుపుత్రులు, (1) లక్ష్మీనరసమ్మ (2) బంగారమ్మ (3) సీతమ్మ అను ముగ్గురు పుత్రికలు. అందు పుత్రులందు భాస్కరరాయఁడు సంస్కృతాంధ్ర జ్యోతిషములందును, పురాణేతిహాసములందును బహుప్రవీణత వహించి సత్యవాక్యధురంధరుఁడై నిత్య ధన భాగ్యశాలియై స్వకుల గోత్ర గౌరవము లందు ఆ నాఁటి పిన్నపెద్దలలో కీర్తివహించెను. ఆయనకు గ్రంథపోషణకర్త మేనత్తయగు బంగారమ్మనిచ్చి వివాహము గావించిరి. వీరలకు గలిగిన ప్రకాశ రాయఁడు అను పుత్రునకు గ్రంథ పోషణకర్త తోబుట్టువు లక్ష్మీనరసమ్మ నిచ్చిరి. రెండవ కళత్రము పశ్చిమ గోదావరిజిల్లా ఆచంట వాస్తవ్యులు నెక్కంటి రామయ్య

గారి పుత్రిక మంగాంబను యిచ్చిరి. ఈమె సోదరీ భర్త నవుడూరు వాస్తవ్యులు బొల్లింపల్లి రామస్వామి ద్వితీయ భార్యా శీతమ్మ పుత్రుడు శ్రీరామమూర్తిని దత్త స్వీకారము చేసుకొని గ్రంథపోషణకర్త పెద్దకుమార్తె అలిమేలుమంగాంబ నిచ్చి వివాహము చేసెను. పాపయ్యకు వెలిచేటి నారాయణరాయఁడుగారి కొ॥ భోజన్నగారి పుత్రిక పాపాంబనిచ్చి వివాహము గావించెను. వీరలకు (1) భోజన్న (2) నారాయణమూర్తి కుమాళ్లు. కుమార్తె కాంతాంబ. ఈ కాంతాంబను వెలిచేటి కామన్నగారి వంశములోగల సుందరరాయని కిచ్చి వివాహము చేసిరి. వీరలకు భాస్కరరాయఁడు కామయ్య అను పుత్రులుగలరు. ఇందు భోజన్నకు కమ్మవారి సింగడాం వాస్తవ్యులు మన్నె నరసింహులుగారి కొ॥ సుందరమ్మ నిచ్చిరి. వీరలకు 1. పాపమ్మ 2. ఈశ్వరమ్మయను పుత్రికలు గలరు. ప్రథమ పుత్రికను భాస్కరరాయున కిచ్చెను. ఇందు ద్వితీయుఁడు నారాయణమూర్తికి గచ్చలవలస అగ్రహారం కా॥ మన్నె అవ్వల సత్యనారాయణగారి పుత్రిక వెంకటనరసమ్మ నిచ్చిరి. వీరలకు 1. కోటేశ్వరరావు 1. వెంకటరంగమ్మ 2. వీరలక్ష్మి 3. ముద్దుబాబు అను పిల్లలు గలరు.

మఱియు సూర్యనారాయణ ద్వితీయ పుత్రికయగు సీతమాంబ యీ గ్రంథ పోషణకర్త సీతారామస్వామికి మాతృవునై యుండెను. ఇందు బంగారమ్మ వెలిచేటి నారాయణరాయఁడు కొ॥ రామయ్యకు ప్రథమ ధర్మపత్ని యాయ్యెను. గ్రంథపోషణ కర్త పెదతల్లి లక్ష్మీనరసమ్మ మేదరమెట్ల సీతారామయ్య కొ॥ ప్రకాశమునకు నిచ్చిరి వీరి సోదరుఁడు కూర్మన్న గారికి బంటుపల్లి వాస్తవ్యులు మన్నె లక్ష్మీ నారాయణ కు॥ సుందరమ్మనిచ్చి వివాహము చేసిరి.

మఱియు నీ గురాలవంశమునకు మూలపురుషునకు అయిదవ పురుషుఁడు రామయ్య వీరి కు॥ గురవయ్య. భార్య కోనమ్మ. వీరలకు రామయ్య, కూర్మన్న గారలు పుత్రులు. వీరిలో ప్రథమ పుత్రునకు వెలిచేటి తిరుపతివారకు ఏఁడవ పురుషుఁడగు సుందరరాయని కుమారిక లక్ష్మమ్మ నిచ్చెను. వీరలకు సుందర రాయఁడు, నారాయణమూర్తి. గోవిందరాజు అను పుత్రులు గలరు, రత్నమ్మ, వరహాలమ్మ, మోర్లమ్మ, సుందరమ్మ. చిట్టెమ్మ అను అయిదుగురు పుత్రికలు. అందు సుందరరాయునకు ప్రభాకరరాయని కొ॥ అన్నపూర్ణ ద్వితీయభార్యగా [ప్రథమ భార్య మేదరమెట్ల కూర్మన్నగారి కు॥ సుందరనారాయణమ్మ ] నిచ్చిరి. వీరికి 1. నారాయణమూర్తి, 2. రామచంద్రరావు, 3. వసంతరావు అను పుత్రులును, 1 అమ్మాజి, 2 సావిత్రి, అను పుత్రికలు గలరు.

2 నారాయణమూర్తికి కమ్మవారి సిగడాం వాస్తవ్యులు మన్నె బుచ్చిరాజుగారి కు॥ అప్పలనరసమ్మ నిచ్చిరి. ఈ బుచ్చిరాజుగారి జ్యేష్ఠపుత్రికయగు సుందరనారాయణమ్మను భోజన్నగారికి కు॥ సత్యనారాయణకు నిచ్చెను. మూఁడవ కొమరిత భాగ్య లక్ష్మిని గురాల వెంకన్నగారి కు॥ అప్పన్నకు నిచ్చెను.

3 గోవిందరాజునకు యీ బుచ్చిరాజు తమ్ముఁడు నరసింహులుగారి కుమార్తె రత్నమ్మ నిచ్చిరి. వీరలకు ఒక పుత్రుఁడు జగన్నాధరావు గలఁడు.

పుత్రికలు: నల్గురు.—

1 రత్నమ్మను భోజన్నగారి కు॥ సూరిరాయునకు యిచ్చిరి. వరహాలమ్మను మేదరమెట్ల లక్ష్మీనరసయ్య కు॥ సూర్యనారాయణకు నిచ్చిరి. వీనికి ద్వితీయము అయినవ సోదరి మాణిక్యాంబనుగూడ నిచ్చిరి.

మొహర్లమ్మను వెలిచేటి గురపయ్య కొ॥ కామయ్యకు నిచ్చిరి. వీరలకు బంగారురాయఁడు, గోపాలకృష్ణ అను పుత్రులు గల్గిరి. సుందరమ్మను గచ్చలవలస వాస్తవ్యులు మన్నె అప్పలసత్యనారాయణకు నిచ్చిరి.

వీరికి 1. కొండలరావు, 2. వెంకటనారాయణమూర్తి, 3. మోహనరావు అను పుత్రులు, పుత్రికలు 1 వెంకటనరసమ్మ, 2 జయప్రద, 3 అలివేలుమంగమ్మ, 4 సావిత్రి, 5 చిన్నమ్మ అనువారు.

చిట్టెమ్మను కృతిపతివంశములో వెలిచేటి కామన్నగారి కు॥ సూర్యనారాయణ కొసంగిరి. వీరికి 1 వెంకటరమణమ్మ, 2 నారాయణమూర్తి, 3 కామేశ్వరరావు, 4 గోవిందరావు అను పుత్రులు జనించిరి. వీరికి 1, చిరంజీవి, 2, రాములు 3, చిన్నమ్మ అను పుత్రికలుగూడ గల్గిరి.

పైన వివరించిన గురాల రామయ్యగారి సోదరుఁడు కూర్మన్నగారికి వెలిచేటి ప్రకాశరాయఁడుగారి కు॥ రామలక్ష్మి నిచ్చిరి. వీరలకు ఏకైక పుత్రిక సూర్యబంగారమ్మ. గ్రంథపోషణకర్త్రి ధర్మపత్నియయ్యెను. పై గురాలవంశములో లక్ష్మీపతికి ప్రథమభార్య ప్రకాశరాయని తోబుట్టువు మహాలక్ష్మి నిచ్చిరి. ఆమె కుమార్తె మహాలక్ష్మి. రెండవ భార్య మేదరమెట్ల సీతారామయ్యగారి ద్వితీయ పుత్రిక మహాలక్ష్మి నిచ్చిరి. వీరలకు లక్ష్మీనారాయణ, వెంకన్న, సీతారామయ్య అను పుత్రులు. అందు లక్ష్మీనారాయణకు వెలిచేటి రామయ్య (గ్రామమునసబు) కుమార్తె రాజ్యలక్ష్మి నిచ్చిరి వీరికి నారాయణమ్మ అను పుత్రిక కల్గెను. ఈమెను కృతిపతివంశస్థులలో వెలిచేటి కామయ్య కు॥ వెంకన్నకు నిచ్చిరి. వీరలకు పుత్రుఁడు లక్ష్మీనారాయణ, పుత్రికలు 1 ఈశ్వరమ్మ, 2 బంగారమ్మ, అనువారు కల్గిరి. ఇందు సీతారామయ్యకు మేదరమెట్ల లక్ష్మీనరసయ్యగారి కు॥ గురవయ్య కుమార్తె చిన్నమ్మాయి నొసంగిరి. వీరికి 1 వెంకటరమణ, 2 చిరంజీవి, 3 నారాయణమూర్తి, 4 భాస్కరరావు అను కొమారులు, 1 అన్నపూర్ణమ్మ, అను పుత్రికయు గలరు.

లక్ష్మీపతి సోదరుఁడు అయ్యప్పకు వెంకన్న అను పుత్రుఁడును, లచ్చమ్మ అను పుత్రికయు గలరు. ఈ లచ్చమ్మ కృతిపతివంశములోనివాఁడగు వెలిచేటి కామయ్యకు ధర్మపత్ని యయ్యెను. వీరలకు సప్తఋషులవలె సప్తసంఖ్య పుత్ర

రత్నములు గలరు. వరుసగ 1. కామేశ్వరరాయఁడు, 2 ప్రకాశరావు, 3 అప్పల స్వామి, 4 లక్ష్మీనారాయణ, 5 సూర్యనారాయణ, 6 వెంకన్న, 7 కామయ్య లేక తాతయ్య అనువారు.

ఇందులో మొదటి గురాల వెంకన్నకు భార్య సుందరమ్మ కృతిపతివంశస్థులు అప్పయ్యగారి పుత్రికలలో జ్యేష్ఠురాలు. తక్కిన సోదరీలు అచ్చమ్మ మొదలగువారు, పుత్రులు: 1 సింహాచలరాయఁడు, ఈ ముగ్గురు గురాల సూర్యనారాయణ తోబుట్టు మహాలక్ష్మి సంతతియై యున్నారు.

మఱియు యీ వెంకన్నగారికి కు॥ 1 లక్ష్మీనారాయణ, 2 సత్యప్రకాశము 3 అప్పన్న అను పుత్రులు, 1 మహాలక్ష్మి, 2 బంగారమ్మ, 3 సుందరమ్మ, 4 అమ్మన్న 5 చిన్నమ్మాయి అను పుత్రికలు — అందు పుత్రులలో ప్రథముఁడు గురాల లక్ష్మీ నారాయణగారు సంగీతసాహిత్య విద్యావిశారదుఁడును, రాజకీయ విద్యాధురంధరుఁ డును, సత్యదయాశౌచగరిష్ఠుడునై ప్రఖ్యాతిగల కీర్తిసంపాదించెను. ఆయన స్వశక్తి పిల్ల అగ్రహారభూములను, ఆరామగృహనిర్మాణములు గావించెను. మఱియు శ్రీమంతులై స్వపరివారమును పోషింపుచు, మృదంగాదివాద్యనాటకాద్యలంకార భరత శాస్త్రములయందు ప్రాముఖ్యత వహించి శంఖుపాలెం అను గ్రామోద్యోగ పదవిని వహించెను, వీరు నిత్యము బంధుమిత్రపరివారములతో నిత్యానందదాయకులై 1937 సం॥ రం జూన్ నెలలో దివి నలంకరించెను.

ఈయనకు గ్రంథపోషణకర్త యగు వెలిచేటి సీతారామస్వామిచౌదరి సోదరీ మణులు మాణిక్యాంబ, సీతాలక్ష్మియు వరుసగ భార్యలు. మరియు పతివ్రతారత్న ములు. సర్వధర్మముల నెఱింగి, భర్తకు సమస్త కార్యములందు తోడ్పడి సచ్ఛీలము గల్గి సర్వమంగళవతులుగా స్వర్గమలంకరించిరి. ఇందు సీతాలక్ష్మికి వెంకటబంగా రాయుఁడను పుత్రుఁడు, వెంకటరమణ యను పుత్రికయుఁ గలదు.

ద్వితీయుఁడు సత్యప్రకాశము. ఈయన భార్యా కృతిపతివంశములో వెలిచేటి కామయ్యగారి మాత్రి సాయమ్మ నిచ్చిరి.

వీరికి, 1 వెంకట్రావు అను కుమారుఁడు, 2 కుమార్తె పునర్వసు గలదు.

మూఁడవవాఁడు అప్పన్నకు కమ్మవారి శిగడాం కా॥ మన్నె బుచ్చిరాజులుగారి కనిష్ఠపుత్రిక భాగ్యలక్ష్మి నిచ్చిరి. వీరికి పుత్రిక అలిమేలు. ఈమెను గోదావరి జిల్లా రామచంద్రపురం తా॥ రామచంద్రపుర వా॥ కరుటూరి గోపాలకృష్ణకు యిచ్చి వివా హము చేసిరి.

ఈగురాల వెంకన్నగారి పుత్రికలలో మహాలక్ష్మమ్మను వెలిచేటి ప్రకాశరాయు డుగారికి సీతారామస్వామి కొసంగిరి. 2 బంగారమ్మ వెలిచేటి నారాయణరాయుడు కుమారుడు చిననడిపల్లి, పెదనడిపల్లి గ్రూపు గ్రామోద్యోగియైన వెలిచేటి రామయ్యకు

యిచ్చిరి. సుందరమ్మను వెలివేటి ప్రభాకరరాయునకు యిచ్చిరి. అమ్మన్నను కృతి పతి వంశస్థులలో వెలివేటి కామన్నగారి కు॥ ప్రకాశరావు నకు యిచ్చెను. వీరికి 1 సుందరకామన్న, 2 రామ అను పుత్రులు, 1 పార్వతి, 2 చిన్నమ్మ అను పుత్రికలు గలరు. చిన్నమ్మాయిని బంటుపల్లిలో వెలివేటి నారప్పదొర సంతతిలోని వారగు గ్రామోద్యోగి సింహాచలరాయునకు యిచ్చిరి. వీరలకు 1 రామం, 2 ఈశ్వరరావు అను పుత్రులు. 1 అన్నపూర్ణమ్మ అను పుత్రిక గలదు.

## — గురాల అప్పారావుబావాజీగారు —

పై కృతిపోషక మాతృవంశీయులకు సంబంధించినవారగు శ్రీ గురాల ఆదెప్పగారి కుమారుడు అప్పారావుబావాజి బాల్యమున టూర్పునాటి కమ్మవారి సిగడాం గ్రామములో గాపురముండి, అతిరోగపీడితుడై, బహువ్యాకులముగచరించి పశ్చిమగోదావరి, కృష్ణ జిల్లాలలోగల కమ్మవారి గ్రామములలో సంచరించి, అచ్చట నొక మహాపురుషుని యాశ్రయించి ప్రాణాయామాది హటయోగాభ్యాసము వలన దివ్యశరీరమును దాల్చి, దృఢకాయుడై బహుతపస్సిద్ధి గాంచెను. మరియు నీ పుణ్యపురుషుడు తేజోమయశరీరముతో నొక గొప్ప గోస్వామియై అనేక శిష్య బృందమును సంపాదించిరి వీరికి తూ॥ గోదావరి మండలస్థ కోరుకొండ వా॥ గడె క్రిష్టమ్మగారు కన్నాపురం గ్రామం కమ్మవంశీయులు గోదావరి స్టేషన్‌కు పోయే మార్గమధ్యమున, మఠము కట్టించిరి, అందు శ్రీస్వామి తపోసిద్ధులతో తన నాశ్రయించిన శిష్యులను తరింపజేయుచు, తపముసేయుచున్నారు. ఇట్టి మహాపురుషుల వల్ల మన భారతమాత పుణ్యభూమి యను పేరువహించి చెన్నలరారు చున్నది.

## — గురాల వెంకన్నగారు, ముస్తాదారు —

ఈ గురాలవారు పూర్వమునుండి చాల ప్రసిద్ధి వహించిరి. వీరిలో వెంకన్నగారను నాయన పూర్వ గజపతిరాజుల కాలములో వేమకోటి పరగణాలోని కొన్ని వందలగ్రామములకు ముస్తాదారను పదవిలోనుండి పేరుగాంచిరి. ఈయన బంటుపల్లిలో ఆ కాలమందు 4 యిండ్ల లోగిలి కట్టించిరి. ఆరామములను నిర్మించినారు. వీరు చాలా సత్యవంతులు, త్యాగులు, ధర్మస్వరూపులునైయుండి అశ్వాందోళికాది వాహనారూఢులునై గొప్ప కీర్తిప్రతిష్టలు గలవారై వర్ధిల్లిరి.

## — గోపిన నారాయణగారు —

మరియు గ్రంథపోషణకర్త పితృవంశమునకు జెందిన వెలివేటి బోజన్న భార్య రాజ్యలక్ష్మి మన్నె లక్ష్మీనారాయణ మేనత్త అయి యుండెను. ఈ లక్ష్మీనారాయణ బంటుపల్లి వాస్తవ్యులు. ఈయన కుమారుడు అప్పలస్వామికి శ్రీకాకుళం దరి కొంగరాం వాస్తవ్యులు గోపిన నారాయణ తృతీయపుత్రిక లక్ష్మీకాంతమ్మ నిచ్చిరి.

ఈ గోపిన నారాయణకు సీతారామస్వామి యను పుత్రుఁడును. సీతారత్నము, రామారత్నము, లక్ష్మీకాంతము అను పుత్రికలు. వీరి ధర్మపత్ని మహాలక్ష్మి, వెలిచేటివారి పుత్రికయై యుండెను.

ఇఁక నీ నారాయణ పరమభక్తాగ్రగణ్యుఁడు. నిత్య శ్రీరామనామపరాయణుఁడునునై రామకోవెల ప్రతిష్ఠించి, సత్యధర్మపరాయణుఁడై జనకునివలె నిత్య జీవనయాత్ర జరుపుచు, ప్రపంచమును త్యజించి, అ పరవయస్సున తురీయాశ్రమము స్వీకరించి, తన యన్యోన్యసంసారమును తన కొమరునిపై నిడి, నిశ్చలముగ తపస్సు గావించు చున్నారు మఱియు ప్రతి సంవత్సరము శ్రీరామ నవమి పూజలు లోకోత్తరముగ జరిపించు పుణ్యరాశి ఈయన ఆశ్రమము నాగావళి (లేక) లాంగుల్యనదికి పశ్చిమముగ నున్నది. వీరికి సుమారు 80 సం॥ రములు వయస్సు గలదు.

ఇట్టి వంశములవారు నానాటికి వంశాభివృద్ధి గాంచుచున్నారు. కాకతీయక్షత్రియ వంశస్థులు యీ కమ్మవారు. పశ్చిమదేశమునుండి తూర్పు కళింగరాజ్యమునకు శ్రీకాకుళం జిల్లా చీపురుపల్లి తా॥ లో బంటుపలి, సంచాము. తిరుపతిపాలెము, చిమ్మవారి సిగడాం, పెద్దపాలెము. దేవరపల్లి. చిన్ననడిపల్లి. పల్లి. పెద్దనడిపల్లి, గచ్చలవల్స, వాండ్రంగి, తింత్యాం, కొంగరాం మొదలుగాగల గ్రామములలో స్థిరనివాసము లేర్పరిచి యున్నారు. వీరు ఆయా గ్రామములలో సర్దిరారులై గ్రామ గౌరవ మర్యాదతో పూజనీయులై యున్నారు. ఇచ్చట నివసించువారల గృహనామములు 1 వెలివేటివారు [కందాళగోత్రము], గురాలవారు [విరట్లగోత్రము], మన్నెవారు [వేల్పులగోత్రము] మేడిశెట్టివారు [తంగుటియ * గోత్రము] దొడ్లవారు, యనమనేడివారు మేకవారు, వుప్పలపాటివారు, ఇందుపల్లివారు, గోపినవారు, సంక్రాంతివారు, నడకుదిటివారు. వీరు తమలో తాము సంబంధబాంధవ్యముల జరుపుకొనుచు, కొంతకాలమునుండి పశ్చిమ, తూర్పు గోదావరి జిల్లాలలోగల వారితో సంబంధములు కల్గి యున్నారు.

## కులదేవతా ప్రశంస

### (మహాలక్ష్మీదేవి)

ఇందు శ్రీ శ్రీ శ్రీ విజయనగరసంస్థానాధీశులు శ్రీ విజయరామగజపతిమహారాజా మన్నెసుల్తాన్ బహద్దర్ కె. సి. ఐ యి వారు వారికాలమున యాస్థానకవి అడిదము సూరకవిగారి సన్మానములో (కాలము క్రీ. శ. 1750 ప్రాంతం) శ్రీకాకుళం బాదుల్లా కాను అను మహమ్మదీయరాజుతో యుద్ధముచేసి పలాయనమై, తిరిగి విజయరామగజపతి గారు తన ఆస్థానము చేరగ, కవియగు సూరన్న రాజుతో చలోక్తిగ నిట్లనెనట.—

---

* ఇది తమ్మలూరను దాని యపభ్రంశ వాడుకపదము — సం॥

" పలుచనై యున్న యరిటాకు-పైని గాని
మంటపై జూపనేర్చునె-మంటివాడి
బీదపడియున్న సరదార్ల-మీదగాని
కలదె ! మగటిమి బాదుర్ల-ఖానుపైని "

అని పలుకునంతనె పశ్చాత్తాప పడి మఱికొంత యధికసైన్యమును గూర్చుకొని దండయాత్రవెడలి మహమ్మదీయ చక్రవర్తిని జయించెను. గాని సేనానాయకులలో నొకఁడగు బొట్ల గుర్వప్పదొరను పై నుదహరించిన మహమ్మదీయ సైనికులు జంపఁగ నా శూరశిఖామణి వీరస్వర్గమలంకరించిన వార్త సంధాముగ్రామములో తన అత్తవారింటనున్న మహాలక్ష్మి యను వీరపత్ని ( గుర్వప్పదొర ద్వితీయభార్య ) విని తిరుగ మహారాజావారు బాదుర్లఖానును జయించి రణస్థలమార్గమున రామతీర్థముల దండు బాటగావచ్చుతరి కస్తువారిశిగడాం గ్రామ మందరిని శ్రీరాజావారిని దర్శించి, తాను సాష్టాంగ దండప్రమాణయగుచు, సహగమనమును కోరెను అంత వీరపత్ని స్వధర్మమునకు యనుజ్ఞనిచ్చి చందనాదిసుగంధద్రవ్యయుక్తమగు కుండమునగావించి తాను సైన్యముతో నుండగనె, శ్రీమహాలక్ష్మి పవిత్రయై భర్తను భగవంతునిధ్యానించి ప్రత్యక్ష సీతాదేవివలె యగ్నిప్రవేశ మయ్యెను. తన దైవత్వముజూప నామె ధరించియున్న చీరె చెఱంగు కొంతభాగమును పసుపు కుంకుమాదులును యగ్ని దగ్ధములు కాకుండుటజూచి అప్పటి పెద్దలు యీమె కేవలము దైవస్వరూపముగ వారి కులదేవత యనుటకు సందేహము లేదని చెప్పఁగ, నామెయు కొంతమంది తగువారి స్వప్నమున సాక్షాత్కరించి తనకు దేవతాగారమును నిర్మించవలెసినట్లు శాసించెను. ఆమె సహగమన దినము అనగ మాఘ శు ౧౦ మీ లకు రోహిణీ నక్షత్రకాలమున కల్యాణమహోత్సవము బంటుపల్లివారిని చేయుమనియు. వాద్య విశేషములు మేళములు తన అత్తవారగు బొట్లవారు జరుపవలసినట్లు కమ్మవారి సిగడాం వారిని నిత్యపూజలు సేయుమనియును, వేల్చురాయి కాపులకు కోవెలలో పందిళ్ళు వేయమనియు సంపూర్ణశాసనం చేసెను నాటినుండి నేటివరకు ఆ ప్రాంత వాసులుగాక అంతమందియు నామెను ప్రత్యక్షదేవతగ భావించి, రోగవిముక్తుల యందును, కార్యజయములయందును మ్రొక్కుబడులుచేసి జయములను బడసియు, ప్రతి సంవత్సరము మాఘ శు ౧౦ లు లగాయితు వరుసగ మూడు దినములు భాగవత, హరికథ, నృత్యగీతవాద్యములతో పెద్ద మహోత్సవము జరుపుచున్నారు.

దీనిని పుణ్యస్థలమని పలువురు చరిత్రకారులు వ్రాసియున్నారు. యీ పుణ్య క్షేత్రమునకు మార్గము :—

ఆంధ్రదేశములో విశాఖమండలములో విజయనగరంనుండి శ్రీరామతీర్థమున మార్గముగా శ్రీకూర్మక్షేత్రమునకు పొయ్యేరోడ్డు పదునాలుగవ మైలురాయికి ఉత్తరముగ నాలుగు ఫర్లాంగుల దూరాన నీ పుణ్యక్షేత్రమును దేవతాగృహమును కలవు.

పాఠకమహాశయులారా!

ఈ ధర్మనందనవిలాస గ్రంథమునకు చారిత్రపీఠికయు, గ్రంథవివరణయు, శ్రీ కొత్త భావయ్యచౌదరిగారు వ్రాసియే యున్నారు. అయినను నా నేర్పుకొలఁది కృతిపతివంశీయుల వివరములు వ్రాయుటకు గారణమేమన, నా బాల్యమునుండియు తూర్పునాటి కమ్మవారల నందఱిని నేను తెలిసియుండుటయును గాక, నలుబది సం॥రముల కాలము వారి గ్రామములలో వారి పిల్లలకు సంగీతసాహిత్యాది విద్యల నభ్యసింపఁజేయుటచే, వారి పోషణముననే గాపురముండుటచే స్నేహవాత్సల్యాభిమానములచే నున్నవాఁడను. మఱియు నీ గ్రంథము మాకు మాతృవంశీయుఁ డగు కాళ్లకూరి గౌరీకాంతకవిచే వ్రాయఁబడి తాళపత్రములలోనుండునప్పుడు కృతిపతివంశీయు లప్పుడప్పుడు వాని వివరములు నావల్లవినుచు, యానందము చెందుచుంటిరి. దీనిని ముద్రగావించుట కెన్నియో ప్రయత్నములు జరిగెను కారణాంతరమున నవి నిష్ఫలములయ్యెను. ప్రస్తుతకాలమునకు శ్రీ వెలివేటి సీతారామస్వామి చౌదరి ఈ మహత్కార్యమునకు బూనుకొని తాను స్వయముగ మా గృహమున కరుదెంచి తమ వంశీయుల సంబంధవివరములును, ఇతర విషయములను నాకు సొంత వ్రాతపరచినందునను, నాకు గల చిరపరిచయముచేతను పై వంశవివరములు వ్రాసినాఁడను. ఇందు ప్రమాదస్ఖాలిత్యములను సవరించుకొని అర్థగ్రహణము గావించుదురని విరమించు చుంటిని.

విక్రృతినామ సం॥ర పుష్య శు ౧౩ శ్రీ
స్థిరవారం లాంగుల్యవేగావతి, సువర్ణ
ముఖినదీసంగమము దక్షిణదిశకుగల
శ్రీమల్లికార్జునస్వామి తీర్థస్థలమునగల
గీతనపల్లి, ఆనంద ఆశ్రమము.

ఇట్లు,
పండిత భారతీతీర్థ,
రాచిరాజు కృష్ణమూర్తి, గీతనపల్లి.
పాలకొండ తా॥ శ్రీకాకుళం జిల్లా 20-1-51



శ్రీరస్తు — శుభమస్తు

# ధర్మనందన విలాసము

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతాస్తుతి

శా. శ్రీవెల్గొండ శివావనీజ లోగి దన్ ♦ సేవింప వేడ్కం జగం
బేవేళం దయతోడఁ బ్రోచు శివరా♦మేశాహ్వాయ బ్రహ్మ మి
ష్టావాప్తిన్ వెలిచేటివంశ్యు గురురా♦యాభిఖ్యునిన్ భూరి తే
జో విద్యాభినవైక భోజుఁ గృపఁ♦బ్రోచున్ బాపరాయానుజున్. 1

శా. శ్రీశో రంజిలు వేట్కతో నడుగులన్ ♦ జీరాడు సొన్నంపు జు
న్నాతాబూ జిగిమీరు దువ్వలువతో ♦ నవ్వారు నెమ్మోము శో
భాతారుణ్య మొయారమారఁ దగు నై♦క్ష్వాకు ప్రభుండైన ప
సీతారాముఁడు పావయానుజుని సు♦శ్రీయుక్తుగాఁ జేయుతన్, 2

శా. శ్రేయస్సర్వ మొసంగునంచు జగముల్ ♦ సేవించు నెవ్వాని భా
షాయోషాప్రియుఁ డవ్విభుండు కరుణా ♦ సంపత్కటాక్షంబునన్
దాయాద్యాభ్యుదయం బనంత ధనధా♦న్యశ్రీఁ బ్రసాదించి దీ
ర్ఘాయుష్మంతునిఁ జేయు శ్రీగురువరా♦యాఖ్యున్ యశోమాన్యునిన్.

సీ. తన కటాక్షంబు సం♦తత మాత్మదాన సం
తతికి నభ్యుదయ సం♦ధాయి గాఁగ
తన పాదయుగము బృం♦దారక మకుట ర
త్నములకు శోభాప్ర♦దాయి గాఁగ
తన కాంతి హాని యా♦ధమున కాత్మార్థ వి
జ్ఞానైక లోచనాం♦జనము గాఁగ
తన నాథు భజనచే ♦ తన కోటికాంతి కో
ధ్యానస్థ సంతాన ♦ తరువు గాఁగ

గీ. తనదు లావణ్య మా పురా ♦ తన జటిలు న
కంబుజేషు సమ్మోహనా ♦ స్త్రంబు గాఁగ
బరఁగు శ్రీ యన్నపూర్ణాంబ ♦ బాపరాయ
సహజు గురురాయు రక్షించు ♦ నహరహంబు. 4

సీ. ఏ దేవి పాదాబ్జ ♦ వాదనం బనిల నం
దన వాలవహ్నికి ♦ ఘనరసంబు
ఏ దేవి కరుణార ♦ సేక్షణం బాపన్ని
వారకం బఖిల ల ♦ క్ష్మీకరంబు
ఏ దేవి సుగుణ స ♦ మృద్ధి సతీజనో
ద్యానంబునకు నసం ♦ తాగమంబు
ఏ దేవి మృదువాణి ♦ వేదాది కళలకు
జీవనం బాత్మార్థ ♦ భావనంబు
గీ. నట్టి సీతామహాదేవి ♦ యధివసించు
ఛత్ర చామ రాందోళికా ♦ సామజాశ్వ
భర్మ్య హర్మ్యాదు లొనఁగుచుఁ ♦ బాపరాయ
గురువురాయుల భవ్య ♦ మందిరము లందు. 5

## శారదాస్తుతి

కం. శారద నిల్పు సమస్త వి
శారద కబరీ భరాభ ♦ శర్మితవర్ణా
శారద గమన విధూతన
శారద నయమార మద్ర ♦ సంజ్ఞా స్థానీ. 6

గీ. సర్వ కార్యంబు లొనరించు ♦ సమయమునను
కమలభవ ముఖ్య దివిజ నికాయమే గ
జాననుని సేవ గావింతు ♦ రతఁడు నాదు
కావ్యమునకు సాకల్య మాం ♦ గళ్యమొసఁగు. 7

## సుకవి స్తుతి

చం. తవిలి భజింతు నెప్పుడు వి ♦ ధాతృ సదృక్షుల ప్రాజ్ఞవీన స
త్కవులను నవ్యకావ్య కవి ♦ తారస సిద్ధికి వాములూరు సం
భవుని పరాశరాత్మజుని ♦ బాణుమయూరుని గాళిదాసుఁ భా
రవి భవభూతి నన్న కవి ♦ రాయునిఁ దిక్కన భాస్కరాదులన్. 8

## కుకవి నింద

గీ. నిరతము సువర్ణ నియమగుణ ♦ నియతివీడి
విమల శయ్యా చమత్కార ♦ వృత్త భంగ
మునకు నోర్చి కుకవి కృతి ♦ యనుదినంబు
జారగతి నుండగనరు స ♦ జ్జనులు దాని. 9

వ. అని యిష్టార్థంబుగ నిష్టదేవతావందనంబును, సత్కవితాభినందనం
బును, కుకవినిందయుఁ గావించి, యేనొక్క ప్రబంధం బగణ్యపుణ్య
లావణ్య రాజన్య చరిత్రానుబంధంబుగా రచియింప నూహించు
సమయంబున— 10

## కృతిపతి ప్రశంస

సీ. నిత్య గంగాస్నాన ♦ నిఖిల దేశాస్థాన
పూజితకీర్తియే ♦ పుణ్యమూర్తి
శ్రీరంగనాథ ప ♦ దారాధనోన్మేద
పరమపవిత్రమే ♦ ప్రభుచరిత్ర
మురు సువర్ణాంబు వ ♦ ర్షోదయశారి మా
ధవ వర్మయే కులో ♦ త్తముని పూర్వు
డశనిఖండన పటి ♦ ష్ఠాఖంగ దోర్దండ
పాండిత్యుఁ డేగోత్ర ♦ పతికులేశుఁ
గీ. డట్టి శ్రీ పూసపాటి వం ♦ శాబ్ధిచంద్ర
విజయరామ సర్వంసహా ♦ విభుతనూజుఁ
డరుణ నిభతేజుఁ డలరు నా ♦ రాయణ గజ
పతి మహారాజు భోగ సు ♦ పర్వరాజు. 11

వ. మఱియు శ్రీ మన్మహా కనకదుర్గాంబికా వరప్రసాదలబ్ధ సామ్రాజ్య ధౌరేయ దోర్దండాఖండాఖండల వైభవశ్రీ శ్రీ మన్మహా మండలేశ్వర మన్నె సుల్తానాది దివ్యాంక సంకలిత శ్రీ విజయరామరాజ తనూజానుగ్రహ ప్రవర్ధమాన సంపన్నిధానుండును, తదీయ దేశస్థ జనలోక సుధాభానుండును, నిఖల పరిపంథి వీరపరికర ప్రబలాంధకార ఘోరార్కుండును, వీరాధివీర విక్రమార్కుండును, సమస్త పురాణాగమపద పదార్థ భావసంపర్క వితర్కుండును, ద్వాత్రింశదాయుధ విద్యాపారీణుండును, సామ దాన భేద దండాది చతురోపాయ ప్రవీణుండును, సకల విద్వజ్జనగేయుండును, పుణ్యాకాయుండును, శ్రీరామచంద్ర చరణారవింద భజనానంద మకరంద బిందు సందోహతుం దిలేందిందిరాయమాణ మానసుండును, నానా బంధుమిత్రామోద ప్రధానాన్నపానీయాది ప్రదాన సంస్తూయమాన మహామానసుండును, శ్రీకండాళగోత్ర పవిత్రుండును, సాధుసన్నుత చారిత్రుండును, అగణ్యపుణ్య గుణాధార వంశవిస్తార కామయ నామధేయ కుమారుండును, సదామోదిత సద్గుణ సద్గుణాలంకారుండును, శ్రీ వేంకమాంబికా గర్భశుక్తి ముక్తాఫలుండును, యాచకాశ్రితాది సంరక్షణ దీక్షాఫలుండును, ననుపమిత సహధర్మచారిణ్యుభయకులాలంకారిణ్యనంత నామధేయ కాంతామణీ సహాయ సంపత్సంతతాచరిత తరుతటాక ప్రముఖ నిఖిల సంతానుండును నైన శ్రీ గురురాయాభిధానుండు ప్రధానాస్థానంబున బుధబాంధవ వితానంబుతో సుఖాసీనుండై యొక్కనాఁడు— 12

సీ. తప్పొప్పుగాఁజూచి ♦ దాదుదాదని వచ్చి
శరణన్న రక్షించు ♦ బిరుదమొకటి
చనవర్ల గెల్చి దే ♦ శస్థుల మునుపటి
కన్న నగ్గించిన ♦ ఘనతయొకటి
దుర్భిక్షమందు బం ♦ ధులరీతి నన్యులా
శ్రితుల రక్షించిన ♦ చిహ్నమొకటి

ఆడితప్పకను బ్ర ♦ హ్మ ప్రతిష్ఠాముఖ
సత్కృతుల్ గూర్చు లాం ♦ ఛనము నొకటి
గీ. గలుగు మీహద్దు పద్ధావ ♦ తులను బాహు
బలము కలిమి కులస్థాన ♦ పౌరుషములు
వర్ణనము సేయఁ దరమె ♦ యెవ్వారికైన
పురుషగాంగేయ వెలిచేటి ♦ గురువరాయ. 13

వ. అని యివ్విధంబున బుధ బాంధవ కవి గాయక వందిమాగధులు బొగడుపొగడి కలు వేడుకల గడలుకొనం దగువారి నాలోచనంబు గావించి, నన్ను రావించి, సరస చతురతర సుధామాధుర్య గాంభీర్య ఘోషణ భాషణంబుల సంతోషంబుతో నిట్లనియె. 14

సీ. శ్రీగోత్ర పతిభక్తి ♦ మీ గోత్ర పతులెల్ల
కవులయి రమర భా ♦ ర్గవులరీతి
మీ వంశకర్తల ♦ క్ష్మాపతి భద్రాప
రిణయ ప్రముఖల స ♦ త్కృతులఁ జెప్పె
మీ పెదతండ్రి ని ♦ ర్మించెను రసవినో
దాది కావ్యములపే ♦ రయమనీషి
మీ తండ్రి రచియించె ♦ ప్రీతి సీతారామ
చరిత్రముఖకృతుల్ ♦ సూరసుకవి
గీ. గాన వాణీకటాక్ష వీ ♦ క్షణముచేత
కవనమెప్పుడు మీ యింటఁ ♦ గలిగియుంట
జేసి తత్ప్రసాద సం ♦ సిద్ధివలన
పొందియున్నది రచనా వి ♦ భూతి నీకు. 15

మ. కృతులైనట్టి పురాణపూరుషుల చా ♦ రిత్రల్ ప్రపంచోదయ
స్థితు లాచారవిధానముల్ మొదలుగా ♦ తెల్లంబు గావించు స
త్కృతి సంతానవరేణ్య మీసకల ది ♦ గ్దేశంబులం ద్రిమ్మరుక
చ్యుతి యొక్కింతయు లేక నాయకునకి ♦ చ్చు న్నిత్యకళ్యాణముల్.

కం. తక్కిన సంతతు లెక్కడ
నక్కడనే యుండుగాని ♦ యఖిలావనిఁ బే
రెక్కించలేవు, కృతి నల్
దిక్కుల విహరించు కీర్తి ♦ తేజము నించున్. 17

వ. అదియుం గావున. 18

శా. శ్రీకాళీశ కృపాకటాక్షమున నీ ♦ చేదోడు వాదోడు వి
ద్యాకాంతామణి! శాల్లఖూరి కులజ ♦ న్మా! సూరయాంపత్యగౌ
రీకాంతాహ్వయ! పూర్వపుణ్య నృపచా ♦ రిత్రానుబంధంబుగా
మాకిమ్మొక్క ప్రబంధమాంధ్ర కవితా ♦ మాధుర్యధుర్యంబుగా.

వ, అని దక్షిణతాంబూలాదుల బహూకరించిన నేనును సంతుష్టాంతరంగుండనై, కావ్యకన్యకాలంకారంబైన కృతినాయకు వంశావతారం బభివర్ణించెద. 20

కృతిపతి వంశ చరిత్ర

ఉ. కమ్మనివిత్తు నయ్యకు ము ♦ ఖమ్మున బాహువుల నూరు పాదప
ద్మమ్ములఁ బ్రాహ్మణాదులు క్ర ♦ మమ్మునఁ బుట్టిరి భేదధర్ములై
కమ్మలనంగ బ్రాహ్మణులు ♦ క్షత్రియు లార్యులు శూద్రులాంధ్ర దే
శమ్మున నుంట *శూరులు ప్ర ♦ శస్తికి నెక్కిరి యందు కమ్మలై.

ఉ. క్రమ్మి విరోధిగర్వ మధి ♦ కమ్ముగ జిమ్మెడివారు కమ్మవా
రుమ్మలి కొందనీయక మ ♦ హోన్నతితో శరణంబటన్న క్రో
ధమ్మెదమాని వైరుల ము ♦ దమ్మున గాచెడివారు కమ్మవా
రిమ్ముగ దానసంపద వ ♦ హించిన వారలు కమ్మవారలౌ. 22

గీ. అందు కందాళగోత్ర ప ♦ యః పయోధి
యందు పూర్వంబునం దుద ♦ యంబు నొంది
చందురుని చందమున నుల్ల ♦ సత్ప్రభావ
గరిమ మిన్నంది తిరపతి ♦ దొర వెలింగె. 23

---

పాఠాంతరము — *శూద్రులు.

కం. తిరపతిదొర తిరపతిదొర
కరుణను సిరినొంది భూజ ♦ గము నిండఁగ వి
స్తరకీర్తి పౌరుషంబుల
సరసుండై గాంచె సప్త ♦ సంతానంబుల్.

ఉ. ఆతతకీర్తి పౌరుషము ♦ లారసి యా రసికాగ్రణిన్ బుధ
వ్రాతము లీతనింట గుణ ♦ వంతు లనంతశయానభక్తిమ
చ్చేతను లైనవారు వెలి ♦ సేరని దీవన లియ్యనట్లు వి
ఖ్యాతులు బుట్టఁ గాంచిరి గృ ♦ హవ్యాయముల్ వెలిచేటివారలన్

సీ. ధరణి నతఁడు వశిష్ఠ గో ♦ దావరీ ని
కటమున స్వాపించెను ♦ గ్రామ మొకటి
గట్టి మంగాంబికను జెట్టఁ ♦ బట్టి మల్లి
కార్జునుని గాంచె వజ్రజ ♦ యంతుఁ బోలి. 26

చ. అతఁడు కళింగరాజ్యమున ♦ కర్థిగ మించి తదీయ మేదినీ
పతి బహుమాన మందుకొని ♦ పౌరుషమారఁగ బంటుపల్లి సు
స్థితి రచియించి భోగపురి ♦ సీమ రణస్థలి చెంత నందు సు
స్థితముగ నిల్పి యచ్చటఁ బ్ర♦తిష్ఠ యొనర్చెను మల్లికార్జునుల్.

గీ. మేలునకుఁ దల్లి కీర్తికి ♦ పాలవెల్లి
తల్లి తల్లికి క్రొత్తము ♦ త్యాలరుఘల్లి
వెండి బంగారముల కెల్ల ♦ నిండు ఘల్లి
ప్రాభవపు ఫిల్లి యతఁ డేలు ♦ బంటుపల్లి. 28

కం. ఆ మల్లేశుఁడుఁ దనతో
నే మల్లేశుఁడును ననికి ♦ నెదురొడవమి ది
గ్భూమీశ సభల నెగడెను
భూమీశ పదాంబుజాత ♦ పూజారతుఁడై. 29

ఉ. అచ్చమదేవి నాతఁడు ప ♦ దంపడి బెండిలియాడె పద్మినిన్
బచ్చగురాలలేదు రతి ♦ భద్ర మదేభగతిన్ సమున్నతిన్

బచ్చని వింటివాడుఁ దన ♦ పై నతిమోహినియైన రోహిణీ
లచ్చి యనంగుఁదోఁడుశుభ ♦ లక్షణయుక్తి వరించుకైవడిన్. 30

కం. జాయాపతు లయ్యిరువురు
దాయాదాభ్యుదయమంది ♦ దగిరి సమిల్ గాం
గేయుల వితరణగుణ రా
ధేయుల సత్కవినుతాభి ♦ ధేయుల ముగురిన్. 31

కం. వారెవ్వరన్న కూర్మయ
నారప్ప తిరపతిఘోం ల ♦ నం గీర్తులఁ బెం
పాలిన వార్వారల వే
ర్వేరను వర్ణింతు సత్క ♦ విత్వ ప్రౌఢిన్. 32

సీ. కాదంబ కాదంబ ♦ కాక్రాంతమగు వియ
ద్దాపగా జల మదు ♦ గంటఁ[1] జేసి
శారిశుకపిక ♦ చంచరీకావృతా
మర భూరుహంబుల ♦ ప్రమానుపరచి
మందరమథన జా ♦ ఘాల దూషితదుగ్ధ
పాథోనిధానంబు ♦ భంగపరచి
దివిజేంద్ర నీలదే ♦ హ విభాపరీతాభ్ర
కరిచెక్కులఁ జెమర్పఁ ♦ గా నొనర్చి
గీ. స్వస్థల రసాతల రసాత ♦ ల స్థలముల
నిండె నెవ్వానికీర్తియ ♦ తండు మల్ల
పధార కగ్రసుతుండు శ్రీ ♦ బంటుపల్లె
నుండు వెలిచేటి కూర్మరా ♦ యుండు వెలసి. 33

చం. వెలిచెటి పెద్దకూర్మవిభు ♦ విశ్రుతకీర్తి పరంపరాభి వృ
ద్ధులు కమలాసమృద్ధులు వి ♦ ధుప్రతిమాన యశోనిబద్ధు లు
జ్జ్వల సుగుణప్రసిద్ధులు ని ♦ జ ప్రభుకార్య ధురీణతా ప్రబు
ద్ధులు పరిపంథి నిర్మథన ♦ దోఃకరవాలపటిష్ఠయుష్ఠులై. 3

(1) గలిపి పాఠాంతరము.

క. అకూర్మి విభు సహోదరుఁ
డాకూర్మిప్రభు పదాంబు ♦ జాశ్రాంత ధ్యా
నైక వినయానఘాత్ముఁడు
నైకవినుతులొందినార ♦ పాఖ్యుఁడు వెలసెన్. 34

చ. పలుకఁడసత్యవాక్యములు ♦ పాటి యొకప్పుడుదప్పఁ డాశ్రితా
వళిఁ గలలోన నేచుఁడు ♦ వారి జనాభ కథాతిరిక్తముల్
దలఁపఁడు విప్రభక్తి మది ♦ దప్పఁడు నారపరాయఁ డుర్వరా
స్థలమున గల్గు దాతృ పరిషణ్మణిగాఁడె ♦ తలంచిచూడఁగన్. 35

క. నారప్ప సుగుణతా సం
భారుండై నిలిచి బంటు ♦ పలి లోపల పెం
పారన్ [1]దోర్బలమునను న
వారణుఁడై పుత్రపౌత్ర ♦ వర్ధిష్ణుండై. 36

వ. అందు కనిష్ఠుండైన తిరపతిరాయుండు, 37

చ. సకల శుభావహంబు వన ♦ జాల సమగ్రము సర్వదేశ నా
యకము నభీష్టదాయకము నఘవిదూర రమాప్త బంధుపో
షక గృహమేధి సమ్మితము ♦ చారుసరోవర శోభితంబు వి
ప్రకుల సుఖాస్పదంబు నడి ♦ పల్లి ప్రధానపురంబు గాఁదగెన్. 38

వ. మఱియు నతని గుణంబు లభివర్ణించెద. 39

క. కరములు శ్రీహరి పూజా
కరములు వాక్యములు విష్ణు ♦ కళ్యాణగుణ
స్మరణోత్సుక్యము లహహా
తిరుపతిదొరకు దయపూర్తి ♦ తిరుపతిదొరకున్. 40

సీ. చక్రావనేభ త్రి ♦ విక్రమ పదలబ్ధి
నందననాఁటి బ ♦ ల్యాహ్వయుండు

---

1. దోర్గర్వమునను అని పాఠాంతరము.

బుధసత్ర భుగ్విపా ♦ ద్భుతకరోద్ధృతమైన్య
మూననినాఁటి మం ♦ ధాననగము
త్వష్ట్రికృచ్ఛిల్పి యం ♦ త్రివ్యథాప్యాతదీప్తి
నొందని నాఁటి ఖ ♦ ద్యోతనుండు
కలిదోష దూషితా ♦ కార వికారంబు
నెరియఁజేయని నాటి ♦ నిషధరాజు

గీ. దాన ధైర్య ప్రతాప సౌం ♦ దర్యములను
ధన్యరాజన్యలోకైక ♦ మాన్యుఁడైన
భూరివెలిచేటి సత్కులాం ♦ బుధి నిశాస
హాయుఁడౌ తగు తిరుపతి । రాయ ఘాళి. 41

క. ఆ తిరపతిదొర భార్యలు
సీతమ, యచ్చమ యనంగ ♦ శ్రీమత్సుగుణ
ఖ్యాతులు మెలఁగుచు గాంచిరి
ప్రీతిఁ నందనుల నార్వు ♦ రిని గ్రమమొప్పఁ. 42

సీ. సీతమ్మ నారయ ♦ చిన కూర్మరాయుల
గనె నచ్చమాంబిక క్రమముతోఁడ
పర్వతాహ్వాయుని గో ♦ పన జగ్గపానంతు
లనువారి మువ్వుర ♦ ననఘ యశుల
గనియెఁ జతుర్దిశా ♦ జనపద విఖ్యాత
చరితుల సుగుణోప ♦ భరితులఁ గత
దురితుల సమర వి ♦ దూతారిదోర్బల
చరితుల దానాంబు ♦ జాత బహుచ

గీ. రితుల వేశ్వరహారల ♦ నుతి యొనగు
అందటికి పెద్దయౌ నార ♦ పాహ్వయుండు
పుత్రపౌత్రాభివృద్ధిచే ♦ పొలువుమీరె
సేతు శీతాచలాంతరో ♦ ర్వీతలమున. 43

క. అతనికి సోదరుఁడు బుధ
స్తుతుఁడగు చినకూర్మయ రిపు ♦ సూదనుఁడు రమా
న్వితుఁడు చతురబ్ధివేష్టిత
కుతల సుకవి గేయమాన ♦ గురుచరితుండై. 44

సీ. ముష్కరపాదుషా ♦ లష్కరులకు మిత్తి
చెలువారు నే వీరు ♦ చేతికత్తి
పాదుషాహి వజీరు ♦ ఫౌజుల తలమీఁదు
చెలువారు నే వీరు ♦ చేతిబాకు
గడిదేశ దుర్గాధి ♦ కాముల పెనుమారి
చెలువారు నే వీరు ♦ చేతిసూరి
యుత్కళ దేశారి ♦ యూథాంత కల్పాంతంబు
చెలువారు నే వీరు ♦ చేతికుంత

గీ. మతఁడు రాజాధిరాజ మా ♦ న్యప్రతాప
రాజపూజిత బిరుద వి ♦ రాజితుండు
సీతమాంబోదరాంబోధి ♦ శీతభానుఁ
డాయతయశోధనుఁడు కూర్మ ♦ యాఖ్యఘనుఁడు. 45

సీ. చినకూర్మరాయ నృ ♦ సింహ మేతెంచెను
రాకుఁడీ మన్నెసా ♦ రగములార !
సీతాంబికాసుత ♦ శ్వేతాననుఁడు వచ్చె
కదలుఁడీ మ్లేచ్ఛనా ♦ గంబులార !
తిరపతిదొర సంత ♦ తి శశాంకుఁడే తెంచె
వీఁగుఁడుత్కళ చక్ర ♦ వీరులార !
వెలిచేటికులజాత ♦ వీతిహోత్రుఁడు వచ్చె
చనుఁడు శ్వేతాశ్వ నృ ♦ కుచరులార !
గీ. యనుచు నన్యోన్య భయవిహ్వ ♦ లాత్ములగుచు
సకలపరిపంథు లెవనికి ♦ ఝుడిసిపోదు

రఖిలదిక్కోటరంబుల ♦ కతఁడు మనుజ
మాత్రుఁడే కూర్మరాయప ♦ విత్రమూర్తి. 46

సీ. గట్టిగా శ్రితులఁ జే ♦ పట్టినా వదలునా
పట్టి బ్రహ్మాదు ల ♦ ట్టిట్టులైన
నాడినా తప్పునే ♦ గూడు నా మాటకు
నిందు సూర్యులు తల ♦ క్రిందులైన
హెచ్చుగా ధన మర్థి ♦ కిచ్చినా యచ్చెరు
వల బలిశేఖరా ♦ దులకునైన
నిలచెనా దురములోఁ ♦ దొలఁగింప వచ్చునా
కొలఁది భీమార్జునా ♦ దులకునైన

గీ. కలఁడె యిటువంటి సుగుణ ని ♦ కాయుఁ డెందు
చతురుదన్వత్సమావృత ♦ క్ష్మాతలమున
ననఁగ వెలిసేటివంశసం ♦ జనితుఁడై మ
హాప్రభవహించు చినకూర్మ ♦ యాభిఖ్యుండు. 47

వ. వీరలకు సాపత్న్ని మాతృగర్భసంభూతుఁడైన పర్వతాభిధేయుండు.

ఉ. తమ్ముఁడు చిన్నకూర్మయకు ♦ దారుఁడు శౌర్యవివేకధైర్య స
త్యమ్ముల కాకరంబు విన ♦ యావనశీలుఁడు పర్వతాలు ర
త్నమ్మ సమాన యోధ సము ♦ దాయములోపల సత్కవీంద్రలో
కమ్ము నుతింపనించెను ద ♦ గన్నుజకీర్తి జగత్ప్రపూర్తిగా. 49

శా. నించెన్ గీర్తులు రోధసిన్ నృపులు మ ♦ న్నించన్ బుధశ్రేణి బో
షించెన్ పౌరుషదూరకార్యములు దూ ♦ షించెన్ బురాణంబు లా
లించెన్ సర్వదిశావకాశముల నే ♦ లించెన్ బ్రతాపార్కుచే
మించెన్ బర్వతరాయుఁ డిద్ధరణి ని ♦ ర్మించెన్ దటాకాదులన్.

గీ. అతనికి సహోదరులును గో ♦ పనయు జగ్గ
నాహ్వయుఁ డనంతుఁ డభ్యుద ♦ యంబునొంది
మూఁడు లోకంబులను నిండ మూర్తి విద్య
కీర్తి ప్రతాపంబు లందిరి ♦ శాశ్వతముగ. 51

ఉ. పేరున బెంపునన్ మిగుల ♦ పెద్దతికంబున నీతిచాతురిన్
నేరుపు నోర్పులన్ దయను ♦ నిర్మలకీర్తిని సాధువర్తనన్
వీరికి వీరెగాక పృథి ♦ వీస్థలి వీరికి సాటివారు లే
రారయనంచు పెద్దలన ♦ నా ఘనులార్వురు బొల్చిరెంతయున్. 52

క. ఆర్వురిలో మధ్యముఁడు సు
పర్వేంద్ర సమాన భోగ ♦ భాగుండగు శ్రీ
పర్వతరాయుఁడు గొనియెన్
పర్వంబు వదసల నచ్చ ♦ వను జగ్గాంబన్. 53

సీ. జన్మంపుదిండి వ ♦ న్నాదు దేవేరికే
రారాణి పవలింటి ♦ రామితారి
నుడువు వాల్వం గడు ♦ పొడయుని గేస్తురా
లలరారు వలజేని ♦ యలరుబోణి
సలుఁడను రాచక ♦ న్నాకు ముద్దులగుమ్మ
వెలిమానుల వజీరు ♦ కలువకంటి
పుట్టుగు గ్గువాని ♦ పువ్వారుబోఁడియు
కరువలి చెలికాని ♦ కలికిమిన్న

గీ. నైన మగనిచిత్తంబుల ♦ నలరుగొనము
లందుగందు జెతులయని ♦ యందఱనఁగ
నందముగ నెప్పె సంతతా ♦ నందహేతు
చరితులగు నచ్చమాంబ శ్రీ ♦ జగ్గమాంబ. 54

క. తనయులనుగాంచె శ్రీ పర్వ ♦ త ప్రభుండు
అచ్చమాంబికయందు కృ ♦ ష్ణాభిధేయు
మఱియు జగ్గాంబవలన కా ♦ మన సమాఖ్యు
వారిలో గృష్ణరాయఁడు ♦ జ్వాలత మెరసె. 55

రంభాది కామినీ కుచ
కుంభమ్మృగీమదకదంబ ♦ గురులక్షణ దో

స్తంభాంతరులై దివిని వి
జృంభింతురు కృష్ణవీర ♦ శేఖరు శత్రుల్. 56

క. ఈ రసికాగ్రణి సోదరుఁ
డై రాజిలు కామరాయఁ ♦ డనుపమగుణ వి
స్తారుండై వారి విభవ
స్ఫారుండై పెంపుగాంచె ♦ చతురంతపయిన్. 57

సీ. తతి నపత్యప్రవ ♦ ర్తకుఁ డయ్యె నని ధర్మ
దేవతాత్మజుమతి ♦ స్థిరత నొసఁగె
పోటాదవిన బీర ♦ పోయెనటంచును
పార్థుని శౌర్యసం ♦ పద హసించె
యొక రాచవాని ఘా ♦ కకు భంగపడెనని
జలధిగాంభీర్యంబుఁ ♦ దలఁపమానె
యగ్రసంభవుల శ్రే ♦ యస్సుల కోర్వని
దేవేంద్రవైభవం ♦ బేవగించె

గీ. యనవరత సత్యవాగ్వృత్తి ♦ యచలశౌర్య
శక్తియునభంగగాంభీర్య ♦ సత్ప్రభుతల
ఖ్యాతిఁగనె జగ్గమాంబికా ♦ గర్భశుక్తి
జనిత ముక్తాఫలుండు, కా ♦ మఘనుండు. 58

ఉ. గండరగండ భూవిభవ ♦ ఖండన కామనరాయ సైనికో
ద్దండ మదోపమాన్య బిరు ♦ దప్రతిపుంజలి కాహళధ్వనుల్
కాండమునిండ నంత రిపు ♦ కామిని కంచుకముష్ణగోపఘా
మండలి కంచుకంబు నొగి ♦ మాటు వడిన్ విడె నేమి చిత్రమో. 59

చ. అనుపమ సత్యశౌచ విజ ♦ యార్జుఁడు [1]కామయ యుద్ధవేదికన్
దన భుజసత్వమున్ గృపయొన ♦ ర్చి యశోధవళాంబరస్ఫురత్
ఘనపథకాయమానము ప్ర ♦ తాపమరాత్రి కరూపమైఁదగన్
గొనియె జయేందిరన్ దిశలు ♦ గోరిక ముత్తెఁపుసేసఁ జల్లఁగన్. 60

1. విజయాంకుఁడు (పాఠభేదము)

సీ. నలరాజుఁబోలు సౌం ♦ దర్య మొక్కటె కాదు
నలరాజు తేజంబు ♦ గలుఁగువాఁడు
రాజరాజును బోలు ♦ లక్ష్మియొక్కటె గాదు
రాజమాన విరాజ ♦ రాజితుండు
దేవతాగము బోలు ♦ ధృతి యొక్కటియె గాదు
దేవతాగ వదాన్య ♦ తా విభుండు
హర్యర్యకుని బోలు ♦ శౌర్య మొక్కటి గాదు
హర్యర్యక సుసాహ ♦ సాన్వితుండు
గీ. యూరి యూతఁ డటంచును ♦ సూరిజనులు
సకల దిగ్దేశ రాజన్య ♦ సభలఁ బొగడ
ప్రబల వెలిచేటి పర్వత ♦ ప్రభుకుమారుఁ
డాయుధ సితారి శ్రీ కామరాయసూరి. 61

వ. అమ్మహానుభావుండు. 62

సీ. శ్రీలు వర్ధిల్లఁ బ్ర ♦ సిద్ధ దానాలు ధ
రం జేయువారు గు ♦ రాలవారు
మేలు గురాలు వ ♦ రాలు ముత్యాలు స
రా లిచ్చువారు గు ♦ రాలవారు
పాలకీ లందలాల్ ♦ మేలు బంగారు శా
లూ లందినారు గు ♦ రాలవారు
వాలూని కేల సూ ♦ బాలను గెలచి శ
రాఁ జూపినారు ♦ గురాలవారు
గీ. బాల గోపాల పదభక్తి ♦ స్వాల్ జవాబు
లందు గడుశక్తి దీనపో ♦ షాను రక్తి
చాల గల్గినవారు గు ♦ రాలవారు
రాజసము గల్గువారు గు ♦ రాలవారు. 63

గీ. అట్టి శ్రీమద్గురాలాన్వ ♦ యమునఁ బుట్టి
కొమరుగన్నట్టి కోనమ్మ ♦ గురువరాయ

లకును తోలుతటి పట్టి యై ♦ న్నికలగట్టి
విమల సద్గుణ నికురంబ ♦ వెంకమాంబ. 64

వ. మఱియు నప్పరమ పతివ్రతామణికి సంతానత్రయంబు గలిగె
వారెవ్వరనిన— 65

సీ. కుమతాహితవ్రాత ♦ కమలినీవనవన్య
సామజంబు గురాల ♦ రామమూర్తి
దీప్యత్సుకవిరాజ ♦ దివ్యవాగ్వినుతాభి
ధేయుఁడై తగు జగ ♦ న్నాయకుండు
పుండరీక భవాండ ♦ భాండ సంభరిత వి
ఖ్యాతయశుండు వెం ♦ కట మనీషి
వేదత్రయము రీతి ♦ విబుధవిజ్ఞేయమై
యా మహాపురుషత్ర ♦ యంబు వెలసె

గీ. చెఱువులొనరించి పెండ్లిండ్లుఁ ♦ జేసి ధనము
బాతి తోటలు వేయించి ♦ ప్రబల దేవ
తాగృహంబులు గట్టించి ♦ తమ యశోభ
గాంచి కృతులందె వీరన ♦ ర్గంబులోన. 66

క. వీరికి తోఁబుట్టువుగా
పేరుఁ గన వేంకమాంబ ♦ పెండ్లాడె గుణా
ధారుఁ బర్వతరాయ గు
మారుఁ గామయను మేరు ♦ మందరధీరుఁ. 67

ఉ. ఆ కమలాక్షియందు సుతు ♦ లారయ కామయ కుద్భవించి రా
ఖ్యాకలితుల్ సుధీయుతుల ♦ హర్పతి తేజులు కీర్తిరాజులు
శ్రీకవిరాట్ప్రబంధనుత ♦ విశ్రుతకీర్తులు సంతతార్థిల
క్ష్మీకరమూర్తు లభ్యుదయ ♦ సిద్ధులు సర్వదిశాప్రసిద్ధులై. 68

క. భూతల విఖ్యాత మహా
పూతాత్ములు సుతులు మువురు ♦ బుట్టిరి విలస

జ్యోతిత్రయ తేజులు పటు
శాతాయుధ యుద్ధవిజిత ♦ శత్రుసమాజుల్. 69

గీ. పాపయాభిధేయుఁడును జగ్గ ʃ యయును గురువ
రాయలును సాధ్వసత్కవి ʃ గేయులు నుత
కాయు లాహవ విజిత గాం ʃ గేయులు సదు
పాయు లూర్జితగుణ్యాస ʃ హాయు లెపుడు. 20

క. రామయ్య తోఁబుట్టువు
భూమహిత సతీత్వ సహిత ʃ బుచ్చమ ప్రియకాం
తామణియై సిరిగాంచెను
రామయ్యను మన్నెవంశ ʃ రాయున కెలమిన్. 71

క. తన గర్భవాసమున బు
ట్టిన యచ్చప బుచ్చపలు ఘ ʃ టించిరి తను బు
ట్టిన యింట మెట్టినింటను
వననిధికన్యక సదా ని ʃ వాసము సేయన్. 72

చ. అనయము మన్నె రామయ సరోమాఖ్యునకున్ ప్రియపత్నియై జగ
జ్జన నుతిఁగాంచి యచ్చమ ప్రకాశస్థిరయశంబును గాంచి నిత్యశో
భన తనయానుభూతి పరిపూర్తి నీతిఁ జరించి మించె శ్రీ
వనిత ముకుందుతో గలసి ʃ వర్తిలు చందము దోప నిచ్చలున్.

గీ. శ్రీగురాలపాపాహ్వయుఁ ʃ జెట్ట బట్టి
గాంచె అచ్చమ యోగభా ʃ గ్య ప్రపూర్తి
చంద్రు నల రోహిణీదేవి ❙ చందమునను
బలుని సమ్మతమైన రోహిణీ ❙ భామ రీతి. 74

క. ఈ పరమపుణ్య సతులకు
దాపున జనియించి సమధి ʃ దానాధికులౌ
పాపయ, జగ్గయ, గురవయ
దీపించిరి భువిని కీర్తి ʃ తేజము లలరన్. 7

వ. అందుఁ బెద్దయగు పాపయాభిధేయుండు, 76

సీ. త్రేతాగ్నులను సమునర్చిత తేజంబుచే
తనె కాదు కినుకచే తను జయించె
నాలుగంభోనిధానంబులు గంభీర
తనె కాదు కరుణచే తను జయించె
సైతుకల్పకముల నధిక దానంబుచే
తనె కాదు కీర్తిచే తను జయించె
షడ్చక్రవర్తుల శమదమ ప్రాప్తిచే
తనె కాదు బలిమిచే తను జయించె
గీ. భళిభళీ యీతఁడే మహాభాగుఁడనుచు
సకల భూమీవరోత్తమ సభలలోన
బుధజనములెన్న పేరు పెంపును వహించె
నవని వెలిచేటి పాపరాయాహ్వయుండు. 77

సీ. కవచకుండలములు కాంక్షింప హరికిచ్చి
యర్థిరిధుండయ్యె నంగరాజు
వరుసఁ గోరినకళల్ సురల కర్పించి క
ళావిహీనుండయ్యె రాత్రిరాజు
నొకమారు పాదత్రయోర్వి నర్పించి యం
తట శాంతపడె బలి దైత్యరాజు
చెలికాని నొకని పోషింపఁ జాలకను మూ
లను దాచుకొనె సొమ్ము రాజరాజు
గీ. గాని నీవలె నిరతాన్నదాన ధర్మ
శూరులా? కారు వారల దారివేర
టంచు సుకవులు పొగడఁ బ్రఖ్యాతిఁ గాంచె
నవని వెలిచేటి పాపరాయాహ్వయుండు. 78

సీ. వెలిచేటి గోత్రపవిత్ర కామనరాయ
నందన పాపయనామధేయ

వింత నీకీర్తిగో దోం తరం బంతట
కరిఖగరత్నని ర్జరమహీజ
రాశివారాశి ప ర్వతహారి దీశ్వర
పంక్తులు నిజమూర్తి ప్రబలెనెంట
రెంటిఁగూడింట నా ల్గింటనై దింటనా,
ఁఒంట నేడిఁట నెన్మి దింట నంటి

గీ. సింటి తోడయ్యె నలతమ్మి కంటిదొరకు
నింటితోడయ్యె నలబేసి కంటిదొరకు
వెంట తోడయ్యె నలదచ్చి కంటిదొరకు
నంటి తోడయ్యె నలతెర గంటిదొరకు 79

సీ. ఈరమ్యుఁడాత్రేన కీ రతుణోన్నిద్ర
జాగ్రత్ప్రతాప దీ తూచణుండు
ఈశూరుఁడరిభ ద్బాసకంఠవిలుంఠ
నాత్రిశాత్రవ పేత హేతిబాహుఁ
ఈధన్యుఁ డక్షలభూ మీనాదురాగ్రేయ
చటుల నిశ్చలగాఢ సారభుజుఁడు
ఈ సత్యవాక్యుఁడ నేకకళాపూత
చాతుర్య విద్యావి చక్షుణుండు

గీ. ననుచు కవిరాజులెల్ల వర్ణనముసేయఁ
బ్రతిదినంబును నెగడె భూపాల సభల
నంగ వంగ కళింగ రాజ్యంబులందు
ననుప మానోదయుఁడు పాప యాహ్వయుండు. 80

సీ. శ్రీసుందరీమయ ప్రాసాదముల్ గల్గి
నవరత్న సింహాస నంబుగల్గి
మానితాట్టాలకా[1] జానేయములుగల్గి
ప్రమదయుగ్దంతావ శములుగల్గి

1. మానితారట్టకా (పాఠాంతరము)

ధరియింప నమల ము § క్తాహారములు గల్గి
సత్తీర ధుకృశు § చయము గల్గి
గోత్రానుగుణ పుత్ర § పుత్రీచయము గల్గి
శాసింప పూజ్య రా § జ్యంబు గల్గి

గీ. భటనటీనట గాయక § ప్రతతి గల్గి
సకలవిద్యావిశేష వ § జ్ఞనము గల్గి
మీఱి వర్ధిల్లు నా § చంద్రతారకముగ
నవనివెలసేటి పావరా § యూహ్వయుండు. ౬౧

ఉ. శ్రీ మహితాత్ముఁ డీతఁడు ప్ర § సిద్ధగురాల కులాధినాథుఁడై
రామయఁ బుత్రినచ్చపను § రంగలఁ బెండిలియూడె యామెతో
తామర తంపరై సిరులు దార్కొని § యెనుగు రాముబిడ్డలన్
గామయ రామ యాప్పయల. § గాంచెఁ గుమారుల సుధీసులన్.

ఉ. తమ్ముఁడు: బాపరాయునకు § దాముఁడు జగ్గయనామధేయుఁ డా
ద్యమ్మగు నన్వయక్రమము § నందలి పూర్వుల వాగ్విపన్నగుల్
గ్రమ్మకయుండఁగా మెలఁగె § కావ్యవివేకము పుణ్యరీతి దన్
నమ్మినవారి బ్రోచుట స § నాథత నిత్యముమూల్య సాధుతన్. ౬౩

సీ. మందార కుందార § విందచందనచంద్ర
బంధురంబు జతాభ్ర § సింధురంబు
హీరముక్తాహార § హిమధారుణీభృద్ధు
ద్ధారకం బవహృత § తారకంబు
శర్వపర్వత ధరా § ధూర్వత స్వర్ధేను
గోరసం బవధూత § సారసంబు
శరదర శిశిర వా § సవతురగస్వరు
శ్రీకరం బమిత సు § ధాకరంబు

గీ. 1శారదానంత పారద § శారదాభ్ర
శారణం బమృతాంభోను § సారణంబు

1 శారదా పారపారద యని పాఠాంతరము.

క. కాంతాకాంతులుఁ బొగడ న
నంతమ గురురాయ వరులు నైక్యతమదిలో
జింతింప ననంతాస్థలి
సంతత శుభవృద్ధి గొనలు సాగుటచేతన్. 89

వ. అని జగజ్జనంబులు గొనియాడ వేడుకనివ్వటిల్ల నవ్వధూవరులు. 90

చ. చెరువు లొనర్చి బెండిలులు జేసి ధనంబులు బాతి దేవమం
దిరములు గట్టి సత్కృతి ప తిత్వము గాంచి ప్రజాభివృద్ధిచే
వరలి కళింగదేశమున వారలు మెచ్చఁగఁ గీర్తితేజముల్
నిరతము గప్పుచుండి రవ నీతలనాథులు సత్కరింపఁగన్. 91

వ. మఱియుఁ గృతినాయకుండైన శ్రీగురురాయుండు ప్రాగల్భ్య గాం
భీర్యాది గుణంబులఁ బ్రకాశింపుచు. 92

క. తన సంశకర్త్రై తగు
చిరతిరకుతిద్వార ప్రతి ష్ఠచే నిల్చి రచిం
చిన, నడిపల్లెను నిలచెను
తనకుం దనవారలకు బ్ర థాన పురముగన్. 93

వ. అట్టి గురురాయుని మహనీయసద్గుణంబులు వర్ణించెద. 94

సీ. ఆశ్రిత జనముల కానందమూరంగ
సుకవీశ్వరులకు గో రికలు గురియ
శాస్త్రవాదులకు ని చ్ఛాపూర్తి చేకూర
సంగీతగాయకు లుత్సవమెలర్ప
బ్రహ్మవిద్వాంసులు పరమసంభ్రమమొంద
వందిమాగధులు కై వారి పరుప
బంధుల కధిక సం పదలుఁ జెన్నొందంగ
దీనజనంబుల తృష్ణ దొలఁగ

గీ. సర్వశత్రులరణ్య వా సములుఁ జెంద
ప్రబలి దేవేంద్రవైభవ పదవిఁగాంచె

వెలిచెటి కులాంబురాశి నా ౯ విర్భవించి
రమ్యగుణపూర్తి శ్రీ ౯ గురురాయమూర్తి. 95

సీ. చెవులందు కట్టాణి ౯ చవులీను ముత్యాల
చౌకట్లు భుజముల ౯ చౌకళింప
కంబుగా కంబుకం ౯ ఠంబునదాల్చిన
చంద్రహారములు ర । త్నంబులీనఁ జెలంగ
మహితోర్ధ్వ రేఖాస ౯ మంచితాంగుళముల
దివ్యమాణిక్య ము ౯ ద్రికలు వెలయ
కటితటంబున ప్రభా ౯ పటల సంఘటితమౌ
ఖలజగాజగి చుట్టి ౯ గడలు కొనఁగ
. నిచీనాంబరములు దా ౯ ల్చి ననమోహ
నాకృతిని వచ్చుదిను నభి ౯ నవమనోజు
గాఁగ వెలఁదులు వర్ణింపఁ ౯ గాఁదనర్చు
రమ్యగుణపూర్తి శ్రీ ౯ గురురాయమూర్తి. 96

. ఎడిమ్వ సర్వలా । స్యాడంబర చరస్వ
రాడగ్రధున్యార్మ్మ । లఁ హసించి
సార్వీమరుజ్యేష్ఠ । వధ్యాయతోత్కోభ
వాధ్యాంకహారాళి 1 ౯ బాళి మించి
నాకరజన్యటీ । నీకర్ప్రభమిశకు భృ
త్ప్రాకటోద్ధాబ్ధిఁ ది । రస్కరించి
కుంభినీభృచ్ఛిదా ౯ జృంభణదంభోళి
ధరతరుపంక్తి పాం । డురతనొంచి

గీ. యహిపతిను కాంతినొంచి ప్ర । ఖ్యాతిఁగాంచె
స్వస్థల రసాతల రసాత । లస్థలముల
పురుమగాంగేయ వెలిచేటి । గురువరాయు
చారుతరకీర్తి కాంత వి ౯ శ్వప్రపూర్తి. 97

1. వాధ్యాంకహారాచ్ఛశ్శభాళియని పాఠాంతరము.

సీ. నినునాశ్రయించువా ॥ నిదిగదా దేవేంద్ర
భోగంబు లక్ష్మీస ॥ మాగమంబు
నిను వినుతించువా ॥ నిదిగదా! ప్రాజ్యసాం
రాజ్యంబు జగదేక ॥ పూజ్యతంబు
నీ ప్రాపుఁగన్నవా ॥ నిదిగదా నిత్య
వస్వర్గసుఖము త్రి ॥ వర్గసుఖము
నిను శరణొందు వా ॥ నిదిగదా విజయలా
భ్యుదయంబు సకల ది ॥ గ్విజయంబు
గీ. నహహా! నిను గొనియాడఁగా ॥ నలవి యగునె
యెన్నికలుఁగన్న భాగ్య సం ॥ పన్నులందు
ననుచు సుకవులుఁ బొగడఁ బ్ర ॥ ఖ్యాతిఁ గాంచె
రమ్యగుణపూర్తి శ్రీగురు ॥ రామమూర్తి. 98

సీ. అగ్రజన్ముల భంగి - నగ్రజన్ములఁ గాంచు
తనయుల భంగి ॥ తనయులఁ గను
తమ్ము లట్టిజా ॥ తమ్ముల నీక్షించు
సఖుల యశస్వాది ॥ సఖులఁ జేయు
శ్రితుల లక్ష్య సమా ॥ శ్రితులఁగా నాదరించు
నరుల రాజసవి కా ॥ పరుల జేయు
తల్లులంచు సతీమ ॥ తల్లుల నీక్షించు
చరుల స్థాన సం ॥ చరులుగ గను
గీ. నెంత పుణ్యాత్ముఁ డితఁడు మ ॥ హాతలమున
సత్స్వభావుండు ధర్మని ॥ ష్ఠాగరిష్ఠుఁ
డార్య సన్నుత చరితుఁ డ ॥ వార్య ధైర్యుఁ
డతుల వీర్యుండు గురువరా ॥ యాహ్వయుండు. 99

సీ. ఎంత పర్యంతంబు ॥ దంతావళంబులా
శాంత సంవహానేచ్ఛ ॥ నలరుచుండు

ఎంత పర్యంతంబ ॥ నంతాభరం బూని
యాదివరాహేంద్రుఁ ॥ డలరుచుండు
ఎంతపర్యంతం బ ♦ నంతరత్నతుషా
పతు లహర్నిశమును ♦ ప్రబలుచుండు
ఎంతపర్యంతంబు ♦ పృథ్వీసుతానాథ
కథ లోకపావన ♦ క్రమముమీరి

సీ. ప్రబలునందాక వంశప ♦ రంపరాభి
వృద్ధినిశ్చల లక్ష్మీస ♦ మృద్ధిగల్గి
వర్ధిలుచునుండుగాఁతఁ భ ♦ వ్యక్రమమున
రమ్యగుణవర్తి శ్రీగురు ♦ రాయమూర్తి. 100

## షష్ఠ్యంతములు

క. ఏతాదృక్సద్గుణ సం
జాతునకుఁ బోషితాగ్ర ♦ జాతునకు శుభ
వ్రాతనికేతనునకు ఖ్యా
కేతన తుల్యాకృతికి సు ♦ కృత సంతతికిన్. 101

క. కరుణాంతఃకరణునకుఁ
శరణాగత దీనమనుజ ♦ సంభరణునకుఁ
తరుణారుణ తేజునకు వి
తరణామరమణికి, వీర ♦ తనయాగ్రణికిన్. 102

క. ప్రవిమల వెలిచేటికుల సం
భవ తిరపతిరాయవంశ ♦ పాథోనిధపూ
ర్ణవిభావర్యధిపతికిన్
ధవళాబ్జాతాక్షు భక్తి ♦ తత్పరమతికిన్. 103

క. కరగత కాశ్మేయునకున్
శరధివృతోర్వీశగీర్తి ♦ సంధాయునకున్
దురితయుత శత్రు త్సం
గర గాంగేయునకు సుకవి ♦ గాంగేయునకున్. 104

క. (శ్రీ) వెంకమాంబికా గ
ర్భావాస సరోజునకును ♦ హరితేజునకున్
భావనదార్యసుత నా
నావిద్యాగ్రహణ కాభి ♦ నవ్యోజునకున్. 105

## * కథా ప్రారంభము *

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన ధర్మనందన విలాసంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 106

సీ. పాలముస్నీటి పా ♦ పని కాలముస్సైన
మన్నీలలో సడి ♦ పన్నవాఁడు
చిలువజన్నముసూడు ♦ చేయఁబూని జే
జేధరణిఁ బాగడ ♦ వజ్రంచినాఁడు
నుడ్డకేడ్చి యాడు ♦ బిడ్డ బిడ్డనికిని
మనుమఁడౌ వాసిగై ♦ కొనిన వాఁడు
కడగంట్లురాకుండ ♦ గనిపెట్టి ప్రజలెల్ల
నేలనాల్గు తెఱంగు ♦ నేలినాఁడు

గీ. దీవిపుట్టువుబాసవాల్ ♦ దేవర నుడి
కారములగల్గు చలిపాన ♦ కంబుగ్రోలు
ననఘుతరమతి జనమేజ ♦ యక్షితిపతి
మనవిగా వైశంపాయ ♦ నునకు ననియె. 10

ఉ. తాపసనాథ నాకు పెద ♦ తాత యుధిష్ఠిరుఁ డగ్రిమున్నుగా
ద్రౌపదిఁ బెండ్లియాడి తన ♦ తమ్ములతో నటపొంద మైథిలి
త్మూ్మ పరిపాలు బాలికను ♦ కామినిగాఁ గొనుపట్లు చెప్పవే
శ్రీపరిణాము వాక్యముల ♦ చే యతిలోక వతంస నావుఁడున్. 108

వ. వినుమని వైశంపాయనుం డిట్లనియె. 109

### ఇంద్రప్రస్థపుర వర్ణన

క. విప్రవరాజశ్రేష్ఠ ఫ
లప్రదమై మేలుఁ గొమ్మ ♦ లం బెనఁగుచు లో
క ప్రస్తుత తరుగణి నిం
ద్రప్రస్థ సమాభిధాప్ర ♦ధాన పురిఁ దగున్. 110

మ. పరిఘాబ్ధి ప్రతిబింబితాంఘ్రియమణీ ♦ ప్రాకారశుంభచ్ఛిఖో
త్కరముల్ శేషఫణాళియున్ భ్రమ సదా ♦ గ్రాసార్థమై వచ్చి యా
గరుటామంతుఁడు స్వాంఘ్రిఘాతములకున్ ♦ గాకుంటబోలించి వే
సరియేగున్ ప్రతినిత్య మీర్ష్యను యథే ♦ చ్ఛాదుర్లభస్వాంతుఁడై.

### గజవర్ణన

చ. దరివిరిఁ దోఁటద్రుమానుల నెము ♦ దళ్లను గట్టుకువడ్డ యేనుఁగుల్
గరజుక పక్కముక్కలను ♦ గ్రక్కన గింజలురాలి పీపులన్
గరవున నేలగ్రొచ్చి పయి ♦ గట్టిన [1]మట్టి మదోదకార్తి నం
కురములుగట్టి చెట్లగుట ♦ కొండల పోలిక నుండు నందునన్. 112

### అశ్వవర్ణన

మ. అరడెంకల్ దడిగాక యుండను ప్రవా ♦ హాంభంబు పైనాడు బ
య్యొరకున్ బాయుల వేటకానికిని ము ♦ న్నైన పారు వేళంబుపై
కురు కంసాదుల కింకవన్నియల జో ♦ డూనించు బాచాల్ పురిం
బరగున్ నన్నె కొకొక్క లక్షయగుచున్ ♦ బాగాలు నిండారఁగన్.

1 గప్పిన యని పాఠాంతరము,

### భటవర్ణన

మ. పులి మీసల్ దెగదీసి సారెఁగ కరం ♦ బుబ్బించి కంఠేభమున్
నిలుపన్ గోజుదు పాముకోఱఁ బెనుకన్ ♦ బేతాళు రావించి
కొలుపం గోటను వెన్కముందరగఁ బైఁ ♦ గుప్పించి దాటంగ సా
ముల నస్త్రాదు తనంబు గన్న భటు లిం ♦ పుల్లంద్రు పెక్కండ్రటన్.

### స్త్రీ వర్ణన

గీ. నయనముఖ కరతల చర ♦ ణములు విరులు
బావులు బిసంబు లుదుటు గు ♦ బ్బలు మొగడలు
పలుకు మావుల తేనెమై ♦ వలినిడి యట
పద్మినుల పద్మినులఁ జేసె ♦ పద్మభవుఁడు. 115

గీ. నడలమాంద్యము కేలందు ♦ తొడల కుంభ
గరిమ పిరుదల సిబ్బెంపు ♦ గుబ్బచనుల
రదరుచి నఖంబులను గూడ ♦ గాదివి యనట
పద్మినుల పద్మినులఁ జేసె ♦ పద్మభవుఁడు 116

చ. కలకులతోడ నేత్రముల ♦ గట్టినవారలువచ్చి వేల్పుటిం
తులు బాలయల్కనుంట గని ♦ తోడదిదీర్చి మరుంగు దీపిక
జ్జలమిడి గొప్పులన్ మెడల ♦ స్వర్ణదితంబుల దండలుంచి కాం
తులఁ గవగూర్చి వారలను ♦ త్రోవలుపట్టుమనందు .. డలన్. 117

శా. కొమ్మల్ రత్నవిమానరాజములపై ♦ గూర్చుండి గుండక్రియన్
జమ్మంగా నమృతంబువాడ ఖచరుల్ ♦ చిత్రస్థపాంచాలికా
ఘుమ్మంగూడుక నాలకించి తుదినే ♦ గన్ రామినందంటి వి
త్యమ్మర్థింపుచు బ్రోవుచుంద్రు మగుడన్ ♦ తద్గీతముల్ గొల్వఁగన్.

### సౌధ వర్ణన

శా. సింగారంబుగ పైడిమేడలపయిన్ ♦ శృంగారిణుల్ గూడి సా
రంగోద్గీతము వాడ చెంతజను సా ♦ రంగాంక సారంగ మ

ఢింగుప్పించఁ దలంచ నాతఁడు నిగో । ధించంగ తత్పాద ఘూ
తాంగ స్రావసుధాప్తి వాటికిని సా । ధాభిఖ్యగల్గెం జుమీ. 119

## బ్రహ్మ క్షత్రియాది వర్ణన

శా. అందెల్లప్పుడు యాగభాగములకై । యాసింపఁగావచ్చి పో
సందోక్కించుక లేక దివ్యులు పురీ । సంవాసులై యుండుటన్
కందర్పజ్వర పీడితాంగులయి త । త్కాంతల్ తదీయాగ్ర భూ
బృంద ప్రార్థన సేయుచుండెదరు స్వా । భీష్టార్థసంసిద్ధికిన్. 120

సీ. శేషుండె విద్యావి ♦ శేషుండు మదిదేలి
వారి చుట్టుక పాకు ♦ లాడుచుండు
చందురుండే రాజు ♦ సంజ్ఞఁ డెల్లప్పుడు
నక్షత్ర పూరింబునం జరించు
యక్షుండే సంపన్నుఁ ♦ డర్థదుండై యల
కాపురంబునఁ ♦ జేరి కాపురించు
ముసలియే హలికుఁడై ♦ పసిలేక తా తెల్ల
బోయి యేపనిసేయఁ ♦ బూన కరుఁగు

గీ. ననుచు హాస్యంబు సేయుచు ♦ నప్పురమున
బ్రహ్మణ క్షత్ర వైశ్య శూ ♦ ద్ర ప్రముఖులు
సకల వేదులు స్వకులాను ♦ సారు లుచిత
వర్తనులు కార్యకరులయి ♦ వరలు చుంద్రు. 121

## రసిక వర్ణన

సీ. వారిజనయన నీ ♦ యూరు పేరేమన్న
వాల్జూపు మీఁగాళ్ళ ♦ వైపు [1]జూపి
కోమలీమణి నీదు ♦ కులమేది యన్నను
నూనూగుటూరుగ ♦ నెనఁగఁజేసి

1. వంచె యని పాఠాంతరము.

ననఁబోడి నీవగు ♦ నునువక్షమైనన్న
గొప్ప తామరతూఁడు ♦ ద్రిప్పెఁ గేల
రామావతంస నీ ♦ నామ మెయ్యదియన్న
కువలయపత్రంబు ♦ గోరఁ జీరె
గీ. పొలతి దయఁజూడుమనుచుఁ దాం ♦ బూలమియ్య
నంది చెవిమూసి క్రీడ ♦ నాని చనియె
భావము నెఱింగి సరసుఁ డ ♦ ప్పాటి నరిగి
యతను సంభోగ సామ్రాజ్య ♦ మనుభవించె. 122

## పుష్పలాలికా వర్ణన

సీ. పూఁబోణి నీ పొన్న ♦ పువ్వంటవచ్చునా
వెలలేని గరియంట ♦ ఫలముఁగలదె
పొలతిరో తమ్మి మొ ♦ గ్గలు బయల్ పరువుము
వలపు నిలువఁగరాద ♦ వస్యముగను
ఇంతిరో దంసలం ♦ దిమ్మ కేలంటఁగ
కొన గొసరెద రెండు ♦ గుణమెఱుఁగక
కోమలీమణి జపా ♦ కుసుమ మెంతో మీఱు
బలు కుదు రుంచంగ ♦ భ్రమ గలిగిన
గీ. సనుచు సరసుల కామోద ♦ మంకురింప
నర్మ మర్మోక్తులాడుచు ♦ కూర్మి నెఱయ
నలరు విల్తుని పువ్వుజిల్కల ♦ విధమున
విలుతుకట్టు పూలు పుష్పలా ♦ వీజనములు. 123

## తాలిపాలికా వర్ణన

సీ. ముత్తెపు సరులతో ♦ జొత్తిల్లునవి సల్లె
గుత్తులాదెల్పుము ♦ కోమలాంగి
సరసుండ సహాహ యు ♦ జ్జాడ లెఱుంగవు
చేలచాటున జూడ ♦ బోల దింతి

గనరాదె చేలచా ♦ టున వెల్గుగల్గిన
పట్టి చూడఁగరాదె ♦ పద్మగంధి
పట్టిన చిక్కులు ♦ బెట్టరా నగవారు
కలయఁజూచిన తప్పు ♦ గలదె చెపుమ
గీ. తప్పుమాటలు పెద్దలు ♦ తలపబోరు
పగలు గాకుండ జూతురా ♦ పాళమైన
ననుచు పాంథులతో సూక్తు ♦ లాడుకొనుచు
[illegible]లఁ [illegible]లుతురు శాలిపా ♦ లికలు వీఁట. 124

ఉద్యానవర్ణన

క. విరజాజులు చామంతులు
సరసపు సంపెఁగలు పారి ♦ జాతంబులునున్
విరిమల్లెలుఁ దరుచై యట
విరిదోటల కరణి నరులు వెలయుఁగఁ [illegible]ందుర్. 125

మలయమారుత వర్ణనము

సీ. మందార కుందార ♦ విందమాధ్వీరసా
సారపూరంబు వి ♦ స్తర పరచి
మలయాంగరా స్పహా ♦ నిలయాంగ నలయాహి
కులభుభుజాపేక్ష ♦ గుంటపరచి
బోళవాళిక ము ♦ ఫలలా మానన
గోళ తాంబూల క ♦ సాళిఁ గ్రోలి
శారీ శుకీ సహ ♦ శారీ వనీచం
న్నాకీతనుగ్లాని ♦ వారి నడచి
గీ. పాలయులుక మంరుమోములై ♦ మలయుఁ జెలులు
మైఁ గగుర్పాటులో నల్క ♦ మాన్పి ప్రియుల
కౌఁగలింపఁగఁ జేయుచు ♦ కడకుతోడ
సోకు వేలుపు వేకువ ♦ సోకు నచట. 126

చ. క. చిలుకలు భట్లరీతి నుతి ♦ సేయఁగ గోరలు నూడిగంపు వా
రలగతి రచ్చ్రమోలలను బ ♦ రాబరిసేయఁగఁ గేకులాడ కో
కిలములు మేలుపల్కు కల ♦ గీతము తేఁటులు సేయ పువ్వుఁదో
పులను మదుంచు నిచ్చల ప్ర♦భుత్వము జూపుచు నుండునప్పురిన్.

వ. మఱియు మహాదేవుని దేహంబునుఁ బోలె సర్వమంగళాలంకృతం బై, నారాయణ ప్రవేశంబు బోలె నిష్కపట భాసురంబై, పితామహుని ముఖంబునుంబోలె చతుర్వాణీవిలసనంబై, నభంబును బోలె చంద్రతారకాభిరామంబై, స్వర్గలోకంబును బోలె రంభారామావృతంబై దినలక్ష్మిం బోలె ననంత మహాబంధురంబై, మధ్యమానామృతార్ణవంబులుం బోలె ఘుమఘుమారావ భరితంబై యొప్పు నప్పురమున కధీశ్వరుండు. 128

ధర్మరాజు

సీ. తన కీర్తి సతి కటి ♦ స్థల మేఖలా ఘంటి
కలన కాంచె కటాహ ♦ ములు వెలుంగ
తన ప్రతాపత్రయీ ♦ తనున కన్నిత్రయీ
తనులు ఖద్యోతంబు ♦ లను వెలంగ
తన దాన జల సము ♦ ద్రమున కంభోధిఘూ
పల్వలంబులరీతి ♦ జెల్వుఁ జూప
తన కర ఖడ్గ శా ♦ త శతకోటినిశా
భూ భృత్పటలి శిలా ♦ స్ఫూర్తిఁ గాంచఁ
గీ. దేజరిల్లును సకల దిగ్దేశ రాజ
మండలేశ సభాస్థలి ♦ పండిత కవి
కాండ జేగీయమాన వి ♦ ఖ్యాత మహిత
దృఢచరిత్ర స్థిరుండు యు ♦ ధిష్ఠిరుండు 129

సీ. కేలు మోడుచుట యే ♦ కాలంబునను లేదు
బుధ గురు దేవ స ♦ న్నిధులఁ గాని

చెనటిమాటకుఁ జెవి § జేర్చుటెన్నఁడు లేదు
విమలగురూప దే § శమునగాని
ఆడితప్పుట కల § నైన లే దరిజన
విత్త జీవనభంగ § వేళగాని
చెంత జేర్చుట పర § స్త్రీల నెన్నఁడు లేదు
లలితమైయొఁదగు జయ § లక్ష్మిగాని

గీ॥ అను మ తనదు చరిత్రంబు § లార్యజనులు
సన్నుతించంగ రాజన్య § సభలనెగడె
కా ర్తికీ చంద్రమః కాంతి § కీర్తి పాండు
రాజసుతుఁడైన యీ పాండు § రాజసుతుఁడు. 130

ప్రత్యర్థ్యనల నల § ప్రత్యర్థి ప్రత్యర్థి
దుర్గాధినాయక § దుర్గములను
ద్వేషివృష వృష § విద్వేషి విద్వేషి
దండధరోత్తమ § దండధరుల
పరిపంథిగజ గజ § పరిపంథి పరిపంథి
భూధరాగ్రేసర § భూధరముల
విప్రియ ఘన ఘన § విప్రియ విప్రియ
భోగివరాధీశ § భోగి వరుల

ఆ. వె. కాల్చ, గర్వమణఁప, ఖండింపఁ § ద్రుంపస్వా
హాధిరాజు పశు గ § ణాధిరాజు
శౌరికాధివాస § నారాధిరాజు ప
తంగవంశరాజు ♦ ధర్మరాజు 131

సీ॥ అధిగుణరరత్న ర ♦ త్నాకర రత్నాక
రాంతరోర్వీజన ♦ క్రాంతమునకు
అర్థిచాతక చాతకా ♦ ర్థిప్రత్యర్థిభూ
మండలాధీశ వే ♦ దండములకు

ఆశ్రితకువకువ ♦ లాశ్రితయాశ్రితో
ద్యానావనీజసం ♦ తానమునకు
బాంధవ నలపల ♦ బాంధవబాంధవ
వార కీర హితోప ♦ చారములకు

ఆ॥ వె॥ భాగ్యలక్ష్మినించి ♦ పాలించి తూలించి
బహుసమృద్ధిఁబెంప ♦ ఫలము నింప
భరతరాజసత్ర ♦ చరరాజు ఋతురాజు
దైవ తాగరాజు ♦ ధర్మరాజు. 132

సీ॥ ఎవ్వాని సద్వృత్తు ♦ లే ప్రాగ్భువనత్ర
యీధర్మ సంస్కృతి ♦ నెసఁగుచుండు
ఎవ్వాని తేజంబు ♦ లెంతే త్రిమూర్త్యాత్మ
కస్ఫూర్తిభూత జా ♦ గ్రతనుఁదెల్పు
ఎవ్వాని ఘనయశం ♦ బేదువార్ధులనుంచి
శుచిమీరి త్రిపధగా ♦ శోభఁజెలఁగు
నెవ్వాని గుణధర్మ ♦ మెందేఁద్రిశుద్ధిగా
రవమై యజాత శా ♦ త్రవము చెన గు

గీ॥ అతఁడు నిజభక్తి భావమో ♦ దితమనస్క
బాంధవామాత్య దైవతా ♦ ప్రభుహితా ర్త
కృతదయావృత యదువేష ♦ కృష్ణమూర్తి
తలఁప కేవల మర్త్యుఁడే ♦ ధర్మసుతుఁడు. 133

క॥ ఘనులనుజులు భీమార్జును
లు నకుల సహదేవులన ♦ నలుగురతనిం బో
లినవా ర్నలుగురు బలు మా
రును నని నలుగురును బలుమరు నిరూపించన్. 134

వ॥ అమ్మహానుభావుండు రాజ్యపరిపాలనంబుఁ జేయుచు — 135

సీ॥ హరివాసరవ్రతా ♦ యతపరాయణత చే
రుక్మాంగదుని మనో ॥ రూఢిగల్గి
ద్వాదశీవ్రతప ము ॥ త్పాదనోన్నతి గన్న
యంబరీషునకు తు ॥ ల్యంబుగాంచి
నిరతాన్నదాన వి ॥ స్ఫురణాభిమక్తి చే
బలిచక్రవర్తికి ॥ తులవహించి
సకల ధర్మాధర్మ ॥ సాంప్రదాయక వివే
క విఖ్యాతిచే భీష్ము ॥ ని విధముగాంచి
గీ. భానుతేజమును శీతభాను సుప్ర
సన్నతాభూతి దేవతా ॥ చార్యబుద్ధి
గలిగి పరివ్యాప్తవిశ్వ వి ॥ ఖ్యాతిఁగాంచె
దీనరక్షాస్త్రరుండు యు ॥ ధిష్ఠిరుండు. 136

సీ. కుంభినీనాథ ది ॥ క్కుంభినీ నాథుల
కిచ్ఛావిహార సం ॥ తృప్తిఁగలిగె
నాగాధినాథ ఘ ॥ నాఘాదినాథుల
నవనీభరము ప్రోవ ॥ నల్పమయ్యె
భానుమత్ప్రాలేయ ॥ భానుమత్ప్రముఖ ఖ
గంబుల కధిక ప్ర ॥ కాశమబ్బె
పవనంబునకు పుష్టి ॥ పవనంబునకు శైత్య
సౌరభ్య ముఖ్యవాం ॥ ఛలు లభించె
గీ. తల్లిదండ్రులగతి నన్న ॥ దమ్ములట్ల
ప్రజలఁ బాలింపుచును ధర్మ ॥ పథము విడక
సకల వర్ణాశ్ర మాచార సం ॥ భృతముగ
నాతఁ డుర్వీతలంబేలు ॥ నవసరమున. 137

వ. ఇట్లు తన దమ్ములు దాను సుఖంబున నుండ. 138

క. వారలు దనమది కెపుడను
సారులుగా నిత్యధర్మ ॥ చారులుగ సుధా

ధారలుగా నిఖిలారి వి
దారులుగాఁ దలఁచుచుండ । ధర్మజుఁడలరెన్. 139

సీ. ఆ పాండుసుతులు స్వ । యంవరలబ్ధయౌ
పాంచాలితోఁ ప్రియ । వడివసించు
తరి నారదుఁడు వచ్చి । తదనుచితంబెంచి
సమయంబుఁ జేసె వ । ర్తనమున కొఱకు
గానట్లు వసియింప । క్రమమున నాఁగో యు
ధిష్ఠిరుండు కళావ । తిని వరించి
గనె ప్రజాభ్యుదయమ । క్కడ వినుపించెద
మానవేశ్వర సావ । ధాన మతిని

ఆ. వె. వినుము సకలమైన । జనపదములలోఁ బ్ర
శస్తిగను విదేహ । జనపదంబు
జరయు రుజయు లేక । పరిపూర్ణ ధనధాన్య
మహిత మగుచు భద్ర । మహిత మగుచు 140

మిథిలాపుర వర్ణన

సీ. సాకల్య ధన నిధా । నాకరం బగు నల
కాపురం బిల మిథి । లా పురంబు
శ్రీకర రత్న చా । మీకర ప్రాకార
గోపురంబిల మిథి । లాపురంబు
వరవాహినీశ సం । భరితమౌ జలదేవ
తాపురంబిల మిథి । లాపురంబు
బహుభోగినీభోగ । సహితమౌ భోగవ
తీపురంబిల మిథి । లాపురంబు,

గీ. ధర్మకర్మంబులకు నెల్ల । దాపురంబు
క్రౌర్యనృప జయలక్ష్మికి । కాపురంబు
భూపురంధ్రీమణి మణికి । నూపురంబు
గోపురం బమ్మహా మిథి । లాపురంబు 141

జనకుడు పత్నీయుతముగ తపంబు సేయుట

సీ॥ ఆరాజధానికి । నాధిపత్యముసేయు
సకల ధాత్రీజన । జనకుఁడగుచు
జనకుండు విజ్ఞాన । సనకుండు కలదైన
వినకుండు పిశునుని । విన్నపంబు
గనకుండ పరకాంత । లను కడచూపుల
ననకుండు కడ నాలు । క నన్నృతంబు
గినకుండు నిల తన । కునుగానిది ధనంబు,
జనకుండు సన్న్యాయ । సరణి నెపుడు

గీ॥ దాను మును దినమందు షట్ । ప్రతతి విడచి
యగ్రమున నుండు సంగ్రామ । మానవేలిన
వెనక వెనుకుండు కొలదాం । కొనిన చోట
తనివి సనకుండు హరిపద । ధ్యాననిరతి 142

సీ॥ శ్రీరామమూర్తి ద । ర్శించిన రీతినే
ప్రభుకేరునాంక । పదలు దొలఁగు
విశ్వనాయకుని సే । వించి నట్టీమహే
శ్వరు గన్నవారికై । శ్వర్య మబ్బు
దేవేంద్రు కరుణ నుం । దిన భంగి నీరాజు
బొగడువారికి మహా । భోగమబ్బు
చంద్రుగన్నట్టు లీ । సర్వజ్ఞ మౌళిని
గన్నవారికి భాగ్య । కళలుఁగల్గు

గీ॥ ననుచు దిగ్దేశ రాజ స । భాంతరముల
దీనమార్గణ సుకవి సం । తాన మను ది
నంబు బొగడంగ కీర్తి జ । గంబు నించె
జనక భూజాని విజ్ఞాన । సరణి నూని. 143

గీ. కారవేశ్వరుఁ డల్లుండు । గాగఁ దగిన
భాగ్యమునకై హిమాచల । పార్శ్వమునకు

జని మహేశ్వరుఁ గూర్చి నిశ్చల తపంబు
సలుప వలె నని ప్రియవధూ సహితుఁ డగుచు. 144

వ. ప్రధానీ జనయుక్త రాజ్యభారుండై యతండు చని. 145

## హిమనగ వర్ణన

మ. ఎలుగుల్ గొంతులు కొండముచ్చులు మృగాశ్వేనుంగులుం లొట్టిబం
దులు చీరంతలు నక్కపోతు లెనుబోతుల్ శల్య జవ్వాది బి
ల్లులు తోడేళ్లును మన్నులుం గణుసు లెక్కుల్ దుప్పులుం గొండగొ
ఱ్ఱెలు రేచుల్ పులులంది యొండొకటితోఁ జేపాడి జాం పెట్టఁగన్. 146

ఉ. భూరి హిమాంబు గొజ్జగల పూపొదరిండ్లను నుండి ధారలై
భోరున జారి చంద్రమణి భూముల భ్రామి తదంబుసిక్తమై
యేరులుగట్టి చూడఁబడె నిందుముఖీ కుచకుంభ వీథిపై
దారెకు తారహారముల తాళతలీరుచి శ్రేణి సేయుచున్. 147

వ. పొలుచు నక్కులాచలంబు సుందర మందిరాంతర్వాసినీ కిన్నర
కింపురుష విద్యాధర గరుడ గంధర్వ విలాసినీ బృంద సంగీత గానా
నందిత సాత్త్వాకారముకుంద తనూలావణ్యరస కందళంబుల చం
దంబున నందంబైన మిళిందబృందంబులు నమ్మహాత్మునకు ఘన
తరువులు పట్టు పనువుచాయ పుట్టంబు లల్లాథంబుల కరణి పిల్ల
కరువలి నెగసిన యగణితవితానావృత గగనోల్లేఖిత విశాల
శాఖాగ్రశాఖాసంతానావలంబ వసంత సమయ సంపత్సౌభాగ్యాం
కురిత సుమనో మనోహర పరాగ పటలంబును, యువ యువతీ
మనోధృతి ధన సర్వస్వాపహారణ నిపుణుండైన మదనునకు యదృ
చ్ఛాలబ్ధ బాణాకారంబులైన ప్రసూనంబులును, నిరంతర తపో
నుష్ఠాన పటిష్ఠ మునిశ్రేష్ఠ వన తరుచ్యుత ఫలరస ప్రవాహంబు
మిహిరాంశులిప్త రవి కాంతులపైఁ బడి పొంగి పొరలి చూత్కా
రంబు లిడుచు, గొంగు బూరుగుల పొడవు కొమ్మలం బెట్టిన తేంట్ల
గాంచి మెలుఁగు బంట్లొనర్చిన గోటపోంట్ల దారిజారు తేనెలో

మొనగూరి దిగు పరువడి పాఱుటఁ జేరిచూచి సురనారులు నిజ
కల గానంబని సంతసింప, మఱియు నెక్కొక్కెడ జక్కని తీవియ
లుయ్యాలలగా బాఁగుపరచు యూఁగు నాగకన్నియల ముడివీడిన
కీప్పుకొప్పుల మేని యొప్పులంగాని ఘనాఘన భ్రమఁగాని రమణీయ
కలాపంబులు విప్పియాడు కలాపిగణ ముదాలాపంబునకు జోడుపడి
కూయు కోయిలల పలుకుల కలికి తొలినాఁటి దీరని పొలయలుకల
నొందిన సుందరీజన స్వయంకృతాశ్లేష సౌఖ్యసంజనితానంద
కాముక ఖేచర సందోహంబు గలిగి, బిల్వాశ్వత్థ, రసాల, సాల
ఖర్జూర, కోవిదార సింధువార, కందరాళ,చందన, భుజపత్రి, నారికేళ
మధూక, హింతాల, తాల, జంబీర, సారంగ, శిరీష, శింశుపాశోక,
కదంబ,పున్నాగ, చంపక, హరిచందన, మందార, పారిజాత, సంతాన
బహుళంబును, మల్లె, చామంతి, సురపొన్న, గన్నేరు, పెన్నేరు
గొజ్జంగులు మున్నగు పూపొదల తావి దిక్కులాకరింప సమస్త
మృగ పక్షి కోలాహంబులును నై, మేరునగంబునుబోలె రత్నసాను
విస్తారంబై, సత్యలోకంబునుబోలె మహర్షి సేవ్యమానంబై, పుత్ర
కామేష్టియునుంబోలె కుమారోదయ కారణంబయి, శరత్కాలం
బును బోలె శ్రవణవిస్తారంబై, యత్ర తత్ర తపోధన కృతాగ్ని
హోత్రసంజాత హోమసంభారంబై, రజిత మహోరజత ధాతునిధా
నంబై, భువన జేగీయమానంబై యొప్పు నందొక్క నిర్మల ప్రదే
శంబున నాశ్రమంబు గల్పించుకొని గౌరీజానిఁ గూర్చి తపంబు
సేయుచుండె నంత— 148

ఉ. నేలకుం నింగికిన్ నడుమ § నిండి ఘనాఘన మాలికల్ హరిత్
కూలము లాక్రమించి బహు § ఘోషము భీషణయుక్తటిల్లతా
జాలయుతంబులై కుతల § సాంద్రపతత్కరకాగణంబులై
రేయి బవళ్లు వాన లెడ § లేక తరిం గురిసెన్ భృశంబుగన్.

గీ. ఇట్టి వర్షావసరమున § నిమ్ముఁడు దుద్ది
నాంతరస్థుండు నగుచు మ § హా తపంబు

బూని సన్మార్గవృత్తిమై బొల్చు పొలపు
దులకు తనచాయ పొలతుక ♦ తోడఁ గూడి. 150

## హేమంత వర్ణన

వ, తదనంతరంబ, 151

చ. జలముల నెల్లఁ గ్రుంగ హిమ ♦ శైల సమావృతశీత వాతముల్
నలుదెసల న్మెలంగ నన ♦ లంబు జనంబుల కాంత భంగి మై
చెలు నలరంగ దిక్పటల ♦ సీమల హైమము బాటిలంగ వృ
ద్ధులు బలుబెంగ బ్రుంగతరికతో చలికాల మిలం జెలంగఁగన్.152

గీ. తొలి మలదవ్వొామ్మ సెడలించి ♦ చలికి నులికి
కడలి చలిమిరి కడలి బస్ల్వడిని నార్వ
ములు బరచ దాని వలన న ♦ మోఘు గతిని
యహము లల్పంబు లయ్యె న ♦ య్యవసరమున. 153

వ. అట్టి హేమంత కాలంబున నయ్యనంతా కాంతుండు కంతాక్రాంత జలాంతరంబున నత్యంత తపంబు సేయుచుండ. 154

## గ్రీష్మర్తు వర్ణనము

గీ. కనలి బలుగాలితోఁగూడి ♦ వనములను హ
రింపు జనులకుఁ జూచుట ♦ కింపుఁగాక
భూతభీతిగ దావాగ్ని ♦ ప్రోలి వెలిఁగి
భీష్మమై భూమిపొడచూపె ♦ గ్రీష్మఋతువు. 155

వ. అట్టిసమయంబున 156

చ. బెడిదఁపు వెట్ట నీరువుర ♦ వింటికి మొగ్గలు త్రొల్లి త్రుళ్లికా
ప్లడరఁగ పత్రపత్రములు ♦ నైదనరంజని పక్షి భావ మే
ర్పడ నలహంసతో జలత ♦ వాపెడి తత్కిరణ గ్రవృత్తి దా
నుకువఁగ నేగు సాకేసము ♦ లోయన సారసముల్ సరస్సులన్.157

ఉ. బిట్టుగువెట్ట నీరిపుర । బెద్దతటాకములందు రేవులన్
దొట్టుపదైకతల్ నిలిచి । దొట్రుపటించుక విప్పు జెక్కులన్
గట్టరఁదోప నేవుగ బ । కంబులు బోల్చెను కావిధోవతుల్
పట్టుగదాల్చి వారుణ జ । పంబులు జేసెడి విప్రులోయనన్. 158

మ. ఖరమృష్టిఘృట తిగ్మభానులను దీ । తుంభావి బీజాగ్థమా
స్థిరతిన్ దిష్ట కృషీవలుం డఖిల ధా । త్రీజాతముల్ బంక్ల నూ
ర్చ్చరహీం గాలికిఁబట్టెనో యనఁగ బో । ల్చెన్ భగ్నవర్యాప్త వ
త్రరజః కాండ మఖండచండ లమరు । చ్చాతుర్య తిర్యగ్గతిన్. 159

మ. కొనె నెవ్వేళ భజించు యద్ధ్విజను లో । కుత్మెచ్చ నీలానురూ
ప నితాంత ప్రియభూతినొంద విరహ ♦ ప్రాప్తైకసంత ప్తగా
దనుఁజేసెన్ హరియంచు భూరమణి చి ♦ త్తంబందు నిట్టూర్పులో
యన వేగాడ్పుల నుబ్బ నుబ్బతిలె ను ♦ ద్యద్భీకరంబై ధరన్. 160

మ. మును రాజొక్కఁడు వెన్కనన్ గడనగం ♦ బుం జేరి దత్సౌమ్య శా
సనముల్ గాకొనరింపఁబూని నిజతే ♦ జప్రాపులం బంప న
య్యూన సంబంధులు దస్మహావిధుల నెం ♦ దేదుగ్గముల్ గొంచు బో
ల్చిన లీలందగెరేల దావశిఖ ల ♦ ద్రిశ్రేణి నుద్దీప్తమై. 161

వ. ఇట్లు గ్దండంబైన యెండకాలంబున నయ్యిలా మండలాఖండలుం
డఖండ నిష్ఠాగరిష్ఠత్వంబు హృదయ పుండరీకంబున నెందుకొన
నల్గడల చండాగ్నుల నిండుకొని, మార్తాండ లోకనంబు నేయుచు
యత్తోకతపంబు జేయుచున్న యవసరంబున— 162

జనకునకు శంభుఁడు ప్రత్యక్ష మగుట

సీ. ఫణిఫణాయత లస ♦ ద్గుణిమణియుత భూష
ణాళితో నతభక్త ♦ పాళితోడ
నవసతస్మేరధా ♦ మాంచితానన వామ
భామతో సంభృతి ♦ ప్రేమతోడ
నురు సువర్ణ విచిత్ర ♦ తరశుభానంత చే
లమ్ముతో వహాని ♦ జాలమ్ముతోడ

లోకపాలన ఘృణా ♦ లోకాక్షి చాకచ
క్యములతో మధురవా ♦ క్యములతోడ

గీ. నతుల శోభావిభూతి రా ♦ మా కృతీంద్ర
ఈవధూ కచభూషణ ♦ కృత దశాస్య
గర్వ భేదాతిశయ పదా ♦ గ్రమహిమాప్తి
నలరు పరమేశ్వరుండు ప్ర ♦ త్యక్ష మయ్యె. 163

గీ. ఇట్లు సాక్షాత్కరించి దా ♦ నెలమి నంది
వాహనారూఢుఁడైన య ♦ వ్వామదేవు
గాంచి యానంద పూర మ ♦ త్కటము గాగ
హృదయ కాసారమున బొంగ ♦ ముద మొసంగ. 164

గీ. తపము చాలించి లేచి భూ ♦ ధవుఁడు తనదు
తరుణితో గూడ సాష్టాంగ ♦ దండ మొసఁగి
లేచి కరపాళి తలను గీ ♦ లించి పల్కె
త్రిభువనాధారు నా దేవ♦ దేవు నభవు. 166

శివరామాత్మక కల్పిత కల్పవల్లి సీసము

సీ. దీనమందార వ ♦ ర్ధిత భూతవారగా
నానుమోదాత్మ గం ♦ గామలాత్మ
దాక్షాయణీశ సం ♦ స్తవ నిర్జరేశ ర
క్షాధిపధ్వంస రా ♦ జావతంస
సాకల్య పుణ్య శా ♦ శ్వతకీర్తిగణ్య లో
కేశ్వర స్తోత్ర లో ♦ కైక పాత్ర
కోట్యర్కతేజ స ♦ ద్గుణవందితాజనా
శ్యాది సంతోష నా ♦ గాదిపోష

గీ. భావనోద్దీప నిర్భర ♦ భవ్యరూప
భావనాతీత చిత్పర ♦ భక్తజాత
సర్వ దుర్మార్గభంజన ♦ సాధుసర్గ
గర్వ యుక్సిక్షశంకర ♦ కంబుపీక్ష. 166

వ. అని మఱియు నిట్లనియె. 167

సీ. హరి ముఖ్య పాలితో ♦ త్తరదిశా వాసాయ
వాసవాద్యమరాళి ♦ వందితాయ
కైలాస భూధర ♦ కంధర గేహాయ
వర్ణిత వృషభేంద్ర ♦ వాహనాయ
స్వర ధిపద్విచ్ఛి దే ♦ శాంతాయ దాంతాయ
శేషాహిరాజ వి ♦ భూషణాయ
దారిద్ర్యదోష వి ♦ స్తార విదూరాయ
సమ్యగ్దయారస ♦ సాగరాయ

గీ. పరమభక్త మనోంబుజ ♦ భాస్కరాయ
దీపితామల భూతి వి ♦ లేపనాయ
శ్రీమనోనాయకార్చితాం ♦ ఘ్రిద్వయాయ
మహదభినుతాయ భవతే న ♦ మశ్శివాయ. 168

సీ. ఫాలలోచన భక్త ♦ పాలక నారద
గానలోల కృపాని ♦ ధే నమోస్తు
సకల లోకైక ర ♦ క్షక పార్వతీనాథ
శ్రీనాయకార్చిత ♦ తేనమోస్తు
చంద్రావతంస దే ♦ వేంద్రముఖామరా
ధీశ్వర భూతేశ ♦ తే నమోస్తు
కైలాసవాస శం ♦ కర పుంగవ తురంగ
దీనావనాధ్యక్ష ♦ తేనమోస్తు

గీ. అనుచుఁ బ్రణుతింతు నీదు పా ♦ దాంబుజముల
కసుర వరభంగ మానివా ♦ దాబ్జ భృంగ
మథిత మాతంగ లింగ వా ♦ రిధి నిమంగ
మేరు చాపశుభాంగ భూ ♦ మీశతాంగ. 169

సీ. దండంబు కోటి మా ♦ ర్తాండ సన్నిభ తేజ
దండంబు దీనమం ♦ దారభూజ

దండంబు ఘన శర ♦ త్పుండరీక శుభాంగ
దండంబు ధృతకరాం ♦ తర కురంగ
దండంబు ఘోరవే ♦ దండ దానవ భేద
దండంబు గాన వి ♦ ద్యా వినోద
దండంబు పార్వతీ ♦ దానవ్రోత్సవ లోల
దండంబు వాయుప ♦ ద్యానుకూల

గీ. దండ మనలాక్ష రూక్ష కం ♦ దర్పశిక్ష
దండ మా భూమ ంశిత శేష ♦ దళితదోష
దండ మగధామస ామ భృ ♦ న్ ్త్రసీమ
దండ మకలంక శంకరో ♦ త్తమ వృషాంక. 170

వ. అని బహుప్రకారంబుల నభివందనంబు లాచరించి మఱియు
నిట్లనియెను. 171

సీ. శ్రీమద్గుణాధార ♦ శ్రితజనమందార
అహిరాజ కేయూర ♦ యఘవిదూర
ఖండచంద్రకిరీట ♦ గంగాజటాజూట
వీతఘోరనిశాట ♦ వృషభఘోట
శరదభ్రనిభకాయ ♦ సురరక్షణోపాయ
యగజాసహాయ మ ♦ హర్షి గేయ
కరభృత్కపాలలో ♦ క ్ ్య వరశీల
కరుణాలవాల భ ♦ క్తజనపాల

గీ. మాధవనుతాంగ దోషత ♦ మః పతంగ
యమమదవిభంగ మౌని హృ ♦ దాబ్జభృంగ
మథితమాతంగ లింగవా ♦ రిధి నిమంగ
మేరుచాపశుభాంగ భూ ♦ మీశతాంగ. 172

సీ. విశ్వంభరంబు స ♦ ప్తాశ్వచంద్రులు న
భంబును కనకాచ ♦ లంబు శేష
పన్నగేంద్రుండును ♦ పద్మాసనుఁడు వార్ధి
ధానంబు నిందిరా ♦ ధవుఁడు శ్రుతులు

స్యందనంబును రథ ♦ చక్రంబు లాతప
త్రంబును బా ♦ ణాసనంబు మార్వ
సారథి శరధియు ♦ సాయకంబును తురం
గంబులుగాక వి ♦ క్రమము మిగిలి

గీ. త్రిపురములుగెల్చి కృపజగ ♦ త్రికముఁగాచి
నట్టి వీరావతారుని ♦ న్నభినుతించి
కేలుమోడ్చెద సకలది ♦ గ్జాల చేల
పాలితామరజాల కృ ♦ పాలవాల. 173

సీ. గతజన్మ సంప్రాప్త ♦ కలుష సంఘంబులు
నేఁటితోఁజనె మాకు ♦ నీలకంఠ
పరమశోభన పరం ♦ పర సమగ్రంబుగ
నేఁటికబ్బెను మాకు ♦ నిగమవాహ
అనుపమైశ్వర్య మ ♦ హావిభవప్రౌఢి
నేఁటికి సమకూరె ♦ నిష్కళంక
ఘన సదానంద యో ♦ గజ్ఞాన సంపత్తి
నేఁటికి చేకూరె ♦ నిటల నయన

గీ. ఆద్యమై నిత్యమై జగ ♦ దాంతరాత్మ
మై యగోచరమై యజ ♦ మైన నీదు
పాదదర్శనమాట నో ♦ పరమపురుష
భూషిత భుజంగ శారదా ♦ బుధ నిభాంగ. 174

క. పరికించిన నెపుడు సుధా
కరుఁడును భాస్కరుఁడు ♦ యజ్వగగనంబులు న
క్కరువలి కరువలి నెచ్చెలి
ధరణియు యన నీవె కావె ♦ ధర్మవిదారీ. 175

సీ. పరమాత్మ పరమేశ ♦ పరమపావనరూప
దీనసంరక్షక ♦ దేవవంద్య

సర్వలోకాధీశ ♦ శైలజా హృదయేశ
కంఠే కళంక రం ♦ గ ద్వృషాంక
కైలాస గిరివాస ♦ కమనీయ దరహాస
చంద్రఖండ కలాప ♦ శైలచాప
శరధిహారావార ♦ యురగేంద్ర కేయూర
సజ్జనావళిలోల ♦ చర్మచేల

గీ. భూతనాథ మహాదేవ ♦ పుణ్య చరిత
ధారుణీధర భక్తమం § దారభూజ
కమలలోచన వినుత శం § కర మహేశ
నిను వినుతిసేయ నెవ్వఁడు § నేర్చు నీశ. 176

సీ. కాలంబు యజ్ఞంబు § కర్మంబు ఫలమును
మోక్షంబు సురలును § మునులు నీవ
నీవ స్త్రీ పురుషులు § నీవ చరాచరం
బులును దిక్కులు జగం § బులును నీవ
ఖగములు తార లోం § కారంబు సత్త్వ ర
జ స్తమో ముఖము యు § ష్మత్స్వరూప
ములు నీవఖిల బీజ § ములు నీ త్రిమూర్తులై
సృష్టి స్థితి లయంబు § సేతువీవ

గీ. నిరుప సద్గుణ నిర్మల § నిత్యశుద్ధ
బుద్ధమైన పరంజ్యోతి § భూతిమై మ
హిమను కేవలమును వెల్గు § దీవు యట్టి
నీవ సర్వంబుఁ దలపోయ § నిగమవంద్య. 177

గీ. ఇట్టి నిన్నుఁ బ్రతీక్షించి § యేత్వాదీయ
దివ్యతేజో మహిమను ను ♦ తించనేర
గావునఁ బ్రసన్నమూర్తివి § గమ్ము వేగ
బహుళశుభోపేత యాశ్రిత § పారిజాత. 178

చ. అనికొని యాడుచు న్నెసల ✱ హ స్తయుగంబిడి సమ్మదాశ్రువుల్
కనుఁగవ జారఁగా నెదుట ✱ గాఢతరంబగు భక్తి నున్న య
జ్జనకునిఁ జూచి యిట్లనియె ✱ చారుసుధామధురోక్తులన్ జగ
జ్జనకుఁ డపాంగరంగ దధి ✱ సమ్యగపార కృపారసంబునన్. 179

జనకునకు శివుఁడు ప్రత్యక్షమై వరము లిచ్చుట

ఉ. ఓయి! నరేంద్రచంద్ర! భువ ✱ నోన్నత తావకభక్తి సాత్వికా
మేయనయాదికంబునకు ✱ మెచ్చితి నిచ్చెద నిచ్చతోడ నెం
తే యఖిలేప్సితార్థము ల ✱ నేకము సంగఁగ వేడుకయ్యె మా
కీయెడ నీకటంచు పర ✱ మేశ్వరుఁ డానతి నియ్య నావుఁడున్. 180

వ. సవినయ భక్త్యానందరబు హృదయంబు నందుఁ గండలింప నానంద బిందు సందోహంబు కందామరలం దిగఁజార ముకుళితకరార విందుండై జనకుం డిట్లనియె— 181

ఉ. ఓ మహితానుభావ! భవ ✱ దుజ్జ్వల సత్కరుణాకటాక్షవీ
క్షామధురామలామృత ర ✱ సం బిసుమంతయు సోకినంత ను
ద్దామసమాన వైభవప ✱ దంబును బొందితి నింక నొక్కటే
నామది బాయకున్నది వి ✱ నంగ నొనర్చెద నాలకింపవే. 182

గీ. పరమ కల్యాణ సహిత సం ✱ పత్కళా ని
ధానమై తగునట్టి సం ✱ తానమును భ
వత్పదాంబుజయుగళి సే ✱ వాపరత్వ
మనిశ మిమ్మన నప్పుడ ✱ య్యధిపునకును. 183

చ. నరవర మత్ప్రదేప్సిత మ ✱ నర్ఘ్యము గైకొని దీని నీవు నీ
పురి కరుదెంచి సుస్థిరత ✱ భూపరిపాలన సేయుచున్న యం
చరుదుగ నుండు బొమ్మనుచు ✱ నప్పరమేశ్వరుఁ డానతిచ్చె య
చ్చెరువుగ విచ్చుమొగ్గయిన ✱ చిత్తముతోడ ధరాధినాథుఁడున్.

చ. తన సతితోడ గూడి విబు ✱ ధ ప్రకరంబులు మేలు మేలనన్
మనమున నమ్మహేశు మహి ✱ మంబులు మాటికి దూటికెన్నుచున్

ఘనత దలిర్పఁగా సఫల కామదుఁడై జనుదెంచె నాతఁడున్.
దన నిజరాజధానికి ముదంబున పాండవరాజ నందనా. 185

వ॥ తదనంతర కథావిధానం బెట్లని యడుగుటయు.

— ఆశ్వాసాంతము. —

మ॥ తపనీయాచల ధీరసద్గుణగుణా ♦ ధారాసుధారాశి కీ
ర్తిపరాగ్ధ్యాయతకీర్తివార యహితా ♦ భీలావలేపాధికా
భ్యపహృద్గోర్యుగ సారసారసదళా ♦ పాంథ్రిఘద్వయీ పంకజై
కపదానంద రసప్రపూర్ణ హృదయా ♦ కందాళగోత్రోద్భవా.

కం. సుకవివర నికర శుకకుల
సకలేష్ట ఫలప్రధాన । శతమఖసాలా
వికట పరిపంథిభటలో
క కవి ఘటనసార ఘోర । కరకరవాలా. 188

మాలినీవృత్తము.

నిరుపమిత విలాసా । నిత్యలక్ష్మీ నివాసా
సరస సుకవిగేయా । సాధువిద్వద్విధేయా
విరచిత శుభయూధా । విష్ణుసేవానుమేధా
పరమగుణసమేతా । పాపరాయానుజాతా. 189

గద్యము.

ఇది శ్రీశివరామేశానుగ్రహపాత్ర భారద్వాజసగోత్ర
పవిత్ర కాళ్లకూరి సూరకవిపుత్ర, కించిదాంధ్ర
కవితావిధేయ గౌరీకాంత నామధేయ
ప్రణీతమయిన ధర్మనందనవిలాసం
బను ప్రబంధంబు నందు
ప్రథమాశ్వాసము.
శ్రీ శివరామేశ్వరార్పణమస్తు.

శ్రీరస్తు — శుభమస్తు

# ధర్మనందన విలాసము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీ కామరాయకుల ర
త్నాకర భవరాజ పాప ♦ యానుజ పుణ్య
శ్లోక ఘనదాన ధారా
ద్రీకృత దిగ్గజనికాయ ♦ శ్రీ గురురాయా. 1

వ. అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 2

ఆ. అట్లు సఫలకాముఁ / డై జనకావనీ
జాని తనదు రాజ / ధానిఁ జేరి
సకల జనులుఁ గొలువ / సామ్రాజ్యవంతుఁడై
సుఖము బడయుచుండె / సఖియతోడ. 3

వ. తదనంతరంబ—

క. ఆరాజేంద్రుని యువతి మ
నోరమకుక్షి నెల మసలె వి / నూతనమై క్రొ
క్కారు మెఱుఁగు లోనై వెలుఁ
గారెడి కాదంబినీ మ / హత్త్వము దోఁపన్. 5

సీ. ఒడలు నీర్వట్టె నె / న్నడ లలసటమించె
నడుము బయల్పడె / తొడవు లిరికె
వళులు హరించె కో / ర్కులు మించె చన్నుము
క్కులు నలుపయ్యె చె / క్కులు వెలసెను
చిట్టిముల్కఁ దొట్టెను / రెట్టించెఁ దెల్పు క
న్నుల నొక్కి లింతలు / బలువుకొనియె

కుసు కెక్కుడయ్యెను ♦ దినమన్న రుచియయ్యె
దినమన్న మనుకార్య ♦ మనుసరించె,

గీ. సఖులు ముచ్చటవినఁ జెప్ప ♦ సైపడయ్యె
నూరువులు మిక్కిలయ్యె నో ♦ రూరసాగె
నాఁడునాఁటికి కొంతకొం ♦ త గననయ్యె
గర్భ చిహ్నము లా సుధా ♦ కరముఖికిని ౬

గీ. నెల లొకటిరెండు దప్పిన ♦ దెలిసి ఘన త
పో ధనులఁ జేతఁ జేయించె ♦ పుంసవనము
రాజచంద్రుండు తన మనో ♦ రమయనంగ
దగు మనోరమ కధిక మో ♦ దంబుతోఁడ. ౭

క. శ్రీమంతుఁడైన భూభృ
త్స్వామి యెనిమిదవనెల ప్ర ♦ సన్నద్విజవా
క్సామాన్యముతో గర్భ
క్షేమంబునకై రచించె ♦ సీమంతంబున్. ౮

క. నవమాసము లిట్లత్యు
త్సవముగఁ గడతేర ప్రసవ ♦ సమయం బైనన్.
వివరింపదు జవరాలవు
నవు నంచున్ వృద్ధ మహిళ ♦ లరుదెంచి తగన్. ౯

సీ. పాలన్న మిడి పైడి ♦ పళ్లెంబుతోఁ దెచ్చి
కొను కొను మని యొక్క ♦ కొమ్మ యొసఁగె
తిన శక్యమా నేనుఁ ♦ దినిపించెద నటంచు
గొబ్బున నొక లత ♦ కూనఁ గనియె
గడెయసే పోరిచి ♦ కబళంబుఁ దినఁబెట్టె
వద్దనఁగా నొక్క ♦ ముద్దుగుమ్మ
ఝుడియకు మమ్మ స్త్రీ ♦ జన్మమే కష్ట సం
బారంబనియె నొక ♦ కీరవాణి

గీ. ఇరు గడలఁ జూచు కలకంఠ ♦ లెల్ల దొడ్డ
గండమీఁది తప్పు టధిక భా ♦ గ్యం బటంచు
బలికి యిలవేల్పులకు వేలు ♦ పులకు మీఁదుఁ
గట్టఁజేసిరి భూధరా ♦ గ్రణికిఁ దెలిపి. 10

క. కొందఱు ప్రియాళులటఁ జని
కొందల పడు భూధరేంద్రు ♦ గూరిచి పలుకన్
మందుల సుఖప్రసవమును
బొందించ నెసంగ రాగ ♦ మునఁ బిలిపింపన్. 11

గీ. విప్రవరు లేగుదెంచి భూ ♦ భృద్వరేణ్యు
జనువు గొనుచు నారణ్య ని ♦ స్వన మొనర్ప
బడసె సౌఖ్యప్రసూతి య ♦ ప్పడఁతి మిన్న
యమల తరమైన శుభలగ్న ♦ సమయమునను. 12

జనకునికి కళావతి పుట్టుట

శా. ఆ రాజేంద్రునకున్ మనోరమకుఁ గ ♦ న్యారత్నమున్ గల్గె శృం
గారాకారిణి సత్కళాభరణి రం ♦ గచ్చంచలావల్లి బం
గారంపుంజిగిమోదు నూత్నశశిరే ♦ ఖాలక్ష్మి శీతాద్రికిన్
గౌరీదేవత పద్మినీ వరునకున్ ♦ గాళింది చందంబునన్. 13

ఉ. ఆ రుచిరాంగి బుట్టు సమ ♦ యంబున దివ్యవధూటులాడి రం
భోరుహబాంధవాది ఖగ ♦ ముల్ విలసిల్లె వెలంగె దేవతా
భేరులు మ్రోసె వార్నిధులు ♦ పెంపుఁ గనన్ జిరుగాలి వీచె మం
దారలతాంతవృష్టి వసు ♦ ధార రమందిం భూమిపైఁ దగన్. 14

క. అనలుఁడుఁ బ్రదక్షిణార్చులఁ
దనరెన్ గల జంతుకోటి ♦ తతసంభ్రమ సం
జనకస్వము లొనర్చెను
మునులు నుతించిరి ప్రమోద ♦ మున్ గడలు కొనన్. 15

ఉ. అంతట నమ్మహీధర కు ♦ లాగ్రణి సంతస మంది పార్వతీ
కాంత కృపారసంబునను ♦ గల్గిన సంతతి కుత్సవంబుగా

ప్రాంత సమాగ తద్విజకు ♦ లాళికి నిష్టఫలోపలబ్ధి న
త్యంత ముదంబు నించి సమ ♦ యంబునఁ జేసెను జాతకర్మముల్.

శా. జాతాశౌచ దినంబులెల్లఁ జనినన్ ♦ సర్వంసహా భృద్వరే
ణ్యాతి ప్రీతిగుటించి సంచరితపు ♦ ణ్యాహంబు మీరెన్ ద్విజ
వ్రాతోద్దీప కలస్వనోప భరిత ♦ బ్రహ్మాండ 1 పూర్ణేయశో
ర్వేతాద్భృష్టున శోభనావహము ఖం ♦ బేకాదశాహంబునన్. 17

క. దానిఁ గళావతియని యభి
ధానంబున రాజసన్నిధానస్థులు చం
ద్రానూన కళావంతుని
దైన మహాభిఖ్య యతని ♦ కాత్మార్థముగాన్. 18

వ. అంత. 19

గీ. వేడుకలతోడ వాడల ♦ వాడలఁగల
చేడియలుగూడి ♦ మేల్పైడి మేడలోన
జిలుకుపని తొట్లలోపల ♦ జేర్చి జోల
బాడి రాలింప నిరుగేలఁ ♦ బట్టిపట్టి. 20

క. నెలతుకలుఁ గూడుకొని చి
న్నెల వెన్నెల రేలు పాలు ♦ నేతులతోగి
న్నెలఁ బువ్వలుఁ దినిపింతురు
నెలఁబాలునిఁ జూపి రాచ ♦ నెలకూనకొగిన్ 21

చ. కలికులతోడ నేస్తములు ♦ గట్టిన గుజ్జన గూళ్లువండి విం
దులకును బిల్చుఁదీగెలకు ♦ దోహదముల్ సవరించి పల్కు జి
ల్కలకు విపంచిమీటి కుల ♦ గానము నేరుపు వియ్యమందఁగా
దలఁచును బొమ్మపెండి లిలు ♦ దప్పక సేయుచు నాఁడు నాఁటికిన్.

కళావతీ వర్ణన

వ. ఇవ్విధమ్మైన దినదినప్రవర్థమానినియైన మానినీమణికి నభినవ యౌవనారంభం బైన— 23

1. "గేహంబు పూర్వేతాద్భృ అని పాఠాంతరము—

సీ. అమ్మహారామోత్త ♦ మమ్మున కధరస
త్కర తరల కిసలయ ♦ స్ఫురణమించె
రద నఖ కుంద కో ♦ రకములు దనరె నా
భియును నా పొన్న సం ♦ పెగలు విరిసె
కరములన్ గ్రొవ్విరి ♦ సరములుఁ దూగాడ
కమ్మన మెయిదీగ ♦ జిమ్మసాగె
భుజములు శోభావి ♦ భూతి వుప్పొడి గప్పె
పలుకులం దేనియ ♦ లొలుకుచుండె

గీ. కుచ లకుచములు మడమల ♦ రుచిరవట ఫ
లములు పండెను నెఱులను ♦ భ్రమరకములు
గుంపుకొనె కంఠరవ పిక ♦ ఘోషమెసఁగ
జవ్వనంబున [1]బొంగు నా ♦ సమయ మందు. 24

సీ. నలినాక్షి వేణి ఘ । న శ్రేణి వదనంబు
చంద్రబింబప్రభా । సదనము శ్రుతు
లభినవాకృతులు జా । పాధరం బధరంబు
కరములు కమ్మ క్రొ । వ్విరి సరములు
కుచములు ఫలితల । కుచములు నూగారు
నల్లచీమలబా ర । నంతము నడు
మిల కటిస్థలము మ । దేభకరము లూరు
వులు మకరములు జం । ఘలు మడమలు

గీ. వటఫలంబు లుఘలు లును । ప్రదములు నఖ
రములు తారక లనగ గం । ధము కపురము
గమనము మరాళ గమనంబు ♦ కాంతిహైమ
మంగము శిరీష పే శలం । బౌర సతికి. 25

చ. పొలతుక కొప్పుతోనవతుఁ । బోలఁగజాలక రావువా మహా
బిలమున వార్షికాబ్దమతి । భీతి దిగంతములందు బర్వి కొం

1. "గుసుమరుతు" అని పాఠాంతరము.

డల వనవాటి తుమ్మెదల । గాంచు నదీనద పుష్కరాంతర
స్థలములఁజేరె చీఁకటుల । సాయనబోలును నిల్చియుండినన్. 26

గీ. సరససౌందర్య లావణ్య । సరసి నుద్భ
వంబయిన పద్మ మన వద । నంబు మీఱె
నమరు లేదరగల పోల్కి । బొమలు బేడి
సలవిధంబున దనరె గ । న్నులు సతికిని. 27

గీ. కర్మశుష్కులికలన వాం । క ప్రభావి
భూతి దనరారెను శ్రీ వి । భూతి మించె
మగువ చెక్కులు నొసలిందు । మండల ము త్రి
ఖండములు జేసుకొన్నట్లు । గాఁదనర్చె. 28

గీ. రమణిలోచన ఖంజ రీ । టముల దీము
వీలుగను యువతీ మనో । మృగచయంబు
నీక్షణాస్త్రములం గ్రుమ్మ । నిరుగరముల
నెత్తు మరువింటి కోమలంబు । జేతబొమలు. 29

క. చిరుదరగల చందంబున
మరుని పతాకల విధమున । మంజుల లతికా
స్ఫురణను గురువిందా ధర
శిరవ్రెందుల్ భ్రూయుగంబు । నెంచఁగ నధిపా. 29

సీ. కోరికఁ డాయుచ । కోరకంబులకును
విరిజాపు వెన్నెల । విందువెట్టె
దళమెత్తుకొని వచ్చు । విలసితకైరవం
బుల నీటిలోపల । మునుఁగఁ జేసె
జక్కలకోవుల । నిక్క కాటుకపిట్ట
లను వననాటుల । మఱ నొనర్చె
దినదినాభ్యుదయంబు । గని నూఱులే మొనల్
గదియించు తమ్ముల । నదుల నదిమె.

గీ. కాకయుండిన సమమెన్న గా తరంబె
చేరలను గొల్వఁదగి కడ చేవులంటి
నల్పు ఱెప్పల కడలలో దెల్పుఁ గల్గి
చెన్నుఁగల వన్నెలాడి వా ల్గన్నులకును 30

చ. మిలమిలలాడు తుమ్మెదగ మింగికురించి ప్రసూనధన్వి క్రొం
జిలుకలకున్ మొనల్గొలిపి చిన్నిరయొయ్యారపు లేడికందులన్
పులఁగొనఁ జేసె నిండయిన పున్నమవెన్నెల చెన్నుదన్నియ
న్నులగమి మిన్నచూపుల మనోహరవృత్తిఁ జరించు నేర్పునన్.

చ. వనతరు జాతమందు వెలి వడ్డది గంధ ఫలిప్రసుమంబు క్రొ
న్నన మరునారిచే మును గ నంబడ దుశ్శకునంబటన్న నిం
దనుఁగొనె నువ్వులార్ద్రి సవ తండ మదెంతని రోటకీలు వే
సిన గతి నాసభాసిలు వశీకృత షట్పద శోభనాకృతిన్ 31

గీ. చానకంఠరవంబుతో సవతురామి
పిక ని కాయంబు పరభృతా భి ద వహించి
జేసి మధుసేవకాకలి చెలువుఁజూపె
గాక పదసంగతినిఁ బొంద గాబనేమి. 32

గీ. పలుకుఁ బలుకును తేనియ జిలుకు చిలుక
బోధలను పెంచి పదపద్య ములను నేర్పు
నేర్పుకొనునంచు దాచిన నెలవెరింగి
యాణు లందిచ్చిన విపంచి మేళమించి. 33

గీ. పలువరుస దాడిబీజమ పద్మరాగ
శకలముల మొదటనేగెల్చి సవతువచ్చు
ముత్తెముల మల్లెమొగ్గల కోజొత్తడంచి
తుదనుమగరాలమూలల నొదుగఁజేసె, 34

క. చిరునగవు లేతవెన్నెల
నరముఱిగాఁ జేయు కపుర మాళుల మీదన్

విరజల్లినట్లుఁ దోఁచును
వరవర్ణినిఁ బొగడఁదరమె ? వసుధాధీశా. 35

సీ. స్మిత సుధాబిందు న । మృతమాటచేత న
యమృతంపు ఘుటికయం । చనఁగవచ్చు
నతులారుణామూల్య । గతి రంజిలుటఁజేసి
పద్మరాగంబని । పలుకవచ్చు
మహిత మార్దవతగుణో । ద్భాసమై యుండుట
చిగురుటాకనుచు న । చింపవచ్చు
తాంబూల రసశోష్ఠ । తాశుమ్మ-మగుటచే
విద్రుమంబనుచు భా । వించవచ్చు

గీ. కఠినతాశాణ కర్షణా । కార భేద
ఖండనల నొందకున్న । నఖండమహిమ
దనరిఘన మాధురీ దురం । ధరత నమరు
నళిన పత్రాయతాక్షి దం ? తచ్ఛదంబు. 36

క. కమనీయ తాళబీజ
క్రమమున గొమ్మ చుబుకమ్ము ♦ కంఠమశంఖ
క్రమము కము లెదరిన దరమిడి
నమలబరచె నాకులపడి ♦ నరకులనాథా. 37

క. విధివరమున తమిలోఁగొని
యధరారుణ బింబమనకు ♦ నధరగతి సదా
పృథగాత్మ నిలుచు కవికవ
విధమున కుచయుగము దనరు ♦ విమలాననకున్. 38

సీ. తామర మొగ్గల ♦ తో మొనల్ పచరించి
పువ్వుబంతులఁజూచి ♦ నవ్వినవ్వి
మారెడుబళ్ళ ర ♦ మ్యంబెల్ల విదళించి
గజనిమ్మపళ్ల పొం ♦ కము వహించి

తాళఫలైక వృ ♦ త్తత యెంతయనిరోసి
కిన్నెరకాయల ♦ చెన్నడంచి
మొలక బంగారు కుం ♦ డలకు వన్నెలు దిద్ది
కుంభి కుంభస్థిత ♦ గుంటుపరచి 38

సీ. శైలిశృంగకఠితను ♦ గేలిజేసి
వలుదలయి వట్రువలపైన ♦ నలువుగలిగి
యెదను నిండారి యెడమీక ♦ యించుకేని
గుబ్బెతలమిన్న సిబ్బెంపు ♦ గుబ్బలమఱు. 39

క. క్రొన్ననతో మాలికలను
తిన్నన పూలతల తూల్లఁ ♦ దెగడిన భంగిన్
కన్నియకు బాహు లమరును
వెన్నరిటాకువలెఁదోచు ♦ వీక్షింపంగన్ 40

ఆ. పొక్కిలనెడి పొన్న ♦ పువ్వులోపలనుండి
తను లతాస్తన ప్ర ♦ ధాన సూన
గుబ్బములకుజేరు ♦ కొనుతేఁటి పిల్లల
చాలనంగ నాఱు ♦ బాలకలరు. 41

సీ. సరసులనుమంజి పున్నాగ ♦ సముదయమును
పణతి పొక్కిలి భ్రమపాలు ♦ బరుపకున్నె
కుంభిపైనెక్కి ద్వీపముల్ ♦ గొని యరుల జ
యింపరే రట్టి సంపత్స ♦ మృద్ధితరిని. 42

గీ, కౌదమతుమ్మెద చాల్ మృగ ♦ మదము శక్ర
నీలములు నల్లచీమల ♦ చాలు ఫణియు
దనకు నుపమానముగ వాని ♦ కధికమాట
నాఱునిడి పేరుగల్గెరో ♦ మావళికిని. 43

క. కడుపు వటదళము నెన్నన్
నడుము విలాసంబహీయ ♦ నంతము పొగడన్

జడలుగలుగు వనవాసికి
పిడికిట గొనుటకును గాను ♦ పింపక యునికిన్. 44

గీ. కరభకంబులు గరతల ♦ గతములయ్యె
సరటికంబంబు లెదురేగి ♦ పొరలఁజొచ్చె
కరికరము లొంగి కంపింప ♦ గాఁదొడంగె
చేడె నిద్దంపుఁ దొడలతో ♦ నీడుగాక. 45

గీ. తరుణి జంఘాభ్యుదయము చి ♦ త్రింబుగా
కాహళులు మొఱయఁగ పొరల్ ♦ గిన్కమహాము
కరములను బట్టి వరశాలి ♦ గర్భజయము
గాంచె మొనలూడ్చి ఘనశరా ♦ ఘముల ముంచె. 46

ఆ. ధనదు ప్రోలి కొకటి ♦ ధరక్రింది కొక్కటి
బారినిల్చె గచ్ఛ ♦ పమ్ములట్లు
గాకయున్నతులయె ♦ కాంత మీగాళ్లకు
మట్టిపండు లీడె ♦ మడమలకును. 47

క. తోరంపు ముత్తియములకుఁ
దారకలకు చవులొసంగు ♦ తరుణి నఖంబు
నీరజ ఝషధర రేఖా
కారకరాంగుళులు పెసర ♦ గాయలు పొగడన్. 48

చ. పసిడి శలాక పుష్పలత ♦ భాసుర చంచల చంచలాక్షి మే
ని సొగసు మార్దవంబు బుర ♦ ణించు శిరీసుమంబుతోడ సా
రస నవ పాటలంబులను ♦ రాజిత చందన చంపకంబులన్
గసరు వధూశరీర భవ ♦ గంధము సద్ఘనసార సంపదన్. 49

గీ. కరిణికిని మందయానమే ♦ కరణిఁగల్గు
వడిబడుటఁగాక హరి మధ్య ♦ నడకగన్న
హంసమెటు తుల పాదాంగ ♦ దాభిధాన
మొంది యడుగుల పెంబడ ♦ యుండెనేని 50

సీ. గోళ్లు ముత్తియములం ♦ ఘ్రులు కమలములు జం
ఘలు దాన వ్వారువుల్ ♦ కరభగములు
వెన్నరటాకు నా ♦ భి సరోవరంబాను
దర్వీకరంబు ము ♦ త్తరులు తిరగ
లరిచేయి కడుపు పె ♦ సరి బండు వ్రేళ్లు హ
స్తములు తామరతూళ్లు ♦ స్తనములమరు
జంతులు కంఠ మ ♦ బ్జము మోవి చికురాకు
చెక్కుటద్దంబులు ♦ ముక్కు గంధ

గీ. ఫలి పలుకు చిలుక కన్నులు ♦ త్పలము వీక్ష
చంచల కనుబొమలు విల్లు ♦ శ్రవణములన
వాక్కృతులు మోము ముకుర బిం ♦ బాంచితంబు
కొప్పు బర్హంబు మేదిని ♦ కోమలిని 51

ఉ. ఆమెకు రాస్య యా వెలది కీ యా తరుణి మణీ యా మిటారి యా
భామిని యా సుధా మధుర ♦ భాషిణి యా కలహంస యానయా
తామరసాక్షి యా కుసుమ ♦ తన్వతతి ప్రతిమానగాత్రి యా
కోమలి కాల్చెనిల్చి మెఱుఁగోయన నిండిన యవ్వనంబునన్. 52

వ. అంత — 53

— ♦ నారదుఁడు జనకుని యాస్థానంబునకు వచ్చుట. ♦ —

సీ. మిన్నేటినిండ నిం ♦ పిన సుధారసతుల్య
జలముతో మణికమం ♦ డలముతోడ
స్వరయుక్తముగ రఘు ♦ వరుని గానము సేయు
వీణతోఁ దగు వామ ♦ పాణితోడ
శ్వేతోర్ధ్వపుండ్ర లాం ♦ ఛితములై తగు నంగ
కములతో బాసవా ♦ ల్గములతోడ
నుదయారుణప్రభా ♦ స్పద జటామకుట ధీ
ధితులతో కావిధో ♦ వతులతోడ

గీ. దక్షిణకరస్థమగు త్రిదం ♦ డంబుతోడ
నధిక సాత్వికరుచి విగ్ర ♦ హంబుతోడ
సరణి వినమితులగు వియ ♦ చ్చరులతోడ
జాళువా తమ్మిపూసల ♦ సరులతోడ. 54

ఉ. తామరసాపుఁడేల వసు ♦ ధాస్థలికాగతుఁడయ్యె నంచు వి
భ్రామితచిత్తులై జనులు ♦ బల్మరు మెచ్చుచు జూచుచుండ దే
హామలదీప్తితోడ కల ♦ హాశనుఁ డభ్రపథమునుంచి వచ్చె సు
త్రామగృహాభిశోభి మిథి ♦ లాధరణీధవధాము సీమకున్. 55

వ. ఇట్లు వచ్చిన బ్రహ్మపుత్రునిం గాంచి జనకభూజాని సతియునుం దాను నెదుర్కొని యభివందనంబు లొనర్చి, యర్ఘ్యపాద్యాది విధులం బూజించి, యనర్ఘ్యమణిమయ సింహాసనోపవిష్టుంగావించి, దన కూతురను రావించి యమ్మహానుభావునకు మ్రొక్కించి, తదీయానుజ్ఞల గాంచి, యుచితాసనంబున నధిష్ఠించి, కరకమలంబులు ముకుళించి వినయానందంబు లంతరంగమ్ములం దురంగలించఁగా నిట్లనియె. 56

క. మహాసీశ్వర మీ రాకచే నేము గృతార్థతం భ ♦ జించితి మిట్లున్
శ్రీ నెరయుచును బవిత్రం
బై నెమ్మిన్ మెఱయుచుండె ♦ నతులిత మహిమన్. 57

వ. అదియునుంగాక దేవా! మహాత్ములరాక యమోఘకల్యాణ కారణంబని పెద్దలం డ్రుమఁ గావున భవదాగమంబత్యంత శోభాప్రధాన మహిమాభిరామంబని వినుతించుచున్న యన్నరేంద్రునకు మానీంద్రుండు రాజచంద్రా! నీ గుణంబులు సన్మార్గసేవితంబులు, సర్వసులభంబులు గాన, నీ ప్రాభవంబు లెఱుంగ, నితరుల కసాధ్యంబులు. తొల్లి మీ వంశకర్తయగు నిమినామధేయుండు పరమ భాగవతోత్తములకు తత్వమార్గంబులుఁ దెలిపె. నతని మహిమా

విభూతులు వక్కాణించ నగణితంబులు. తద్వంశోద్ధారకుఁడ వగు నీవు, నట్ల పరమనీతికళాకుశలుండ వని పలుకుచున్నెడ కేళికా వ్యాజంబున సెలవిమ్మని పునర్నమస్కారం బొనరించి, ముకుళిత కరారవిందయైయున్న యక్కన్నియంగాంచి, వైదేహుని ముఖం బాలోకించి, ముఖంబునం జిఱునవ్వొలయ నిట్లనియె. 58

క. దీవించి దేవముని తన
భావంబు గ్రహించి వంశ ♦ పావని యిది కా
శీవర వరమున నీగ
ర్భావాసంజనిత యయ్యె ♦ నతినయవతిన్నై. 59

నారదుఁడు ధర్మరాజునకుఁ గళావతి నిమ్మనుట.

గీ. దీని భారతవంశ ప్ర ♦ దీపకుఁడగు
ధర్మనందనునకును సుం ♦ దరిగఁ జేయఁ
బుత్రికను గన్న భాగ్య మ ♦ బ్బును నిజంబు
నీకు నతఁ డల్లుఁ డగునని ♦ ప్రాకటముగ. 60

క. జత బంగారంబునకున్
రతనమ్మదిగాన జనక ♦ రాజేంద్ర శుభ
స్థితినుంచు పోఁచువచ్చెద
సతతంబని పలికె మౌని ♦ జనియె నిజేచ్ఛన్. 61

క. చని కౌంతేయాగ్రజునకు
జనకక్షితినాథు తనయ ♦ సౌందర్యము త
జ్జనన ప్రకార మంతయు
వినిపించి విరించి కొడుకు వేడుకఁ బలికెన్. 62

క. కన్నియల ముజ్జగంబుల
గన్నాఁడ విదేహరాజు ♦ కన్న తనయ బో
లన్నేర రింతి సొగసుల
గున్న సుమీ భరతవంశ ♦ కుంజర వింటే. 63

చ. తళుకు మొగంబులాగు కను ♦ దమ్ముల బాగు గళంబుతీరుచే
తులవాపణూరు చన్నుగవ ♦ తోరము మేని నిగారము౯ గటి
స్థలము వెడల్పు లేనడుము ♦ స్వల్పము వేళ్లతనర్పు పల్కు తే
నెల గతిసౌరు కల్గు తరు ♦ ణి౯ ధరణీస్థలి౯ జూడ మెన్నడు౯. 64

సీ. దాని పెన్నెఱుఁ గొప్పు ♦ దాని నవ్వు మొగంబు
దాని నుంజెక్కు ట ♦ ద్దములు దాని
ముద్దు మాటలు దాని ♦ మురవైన వాతెఱ
దాని విశాల సౌం ♦ దర్యతరము
లైన వాల్గన్నులు ♦ దాని మిటారంపు
చూపులు దాని మం ♦ జులకరములు
దాని చన్బంతులు ♦ దాని సన్నపుఁ గౌను
దాని బల్ పిరుఁదులు ♦ దాని యంద

గీ. మైన తోడలును దాని యొ ♦ య్యారపు నడ
దాని మేలి కడాని జి ♦ గాని గార
మైన మేనును దాని సో ♦ యగము గనిన
వేయు నేటికి యతియైన ♦ విధముఁ జెడఁడె. 65

ఉ. నీటు నొయారపు న్నడలు ♦ నీటును వేగుపాటు గబ్బిచ౯
న్గోటు కటీతటత్ కుటిల ♦ కుంతల పాశవు వేటు సోగ క౯
గాటుకఁగీటు నెమ్మొయి చౌకాటఁవుప్రాటి విలాస కోటి ౯
పాటలగంధి పాపటయు ♦ బాట సుమీ మరునాట పాటకు౯. 66

వ. అని వలఁపుఁ గొలుపం బలికి కలహాసనుండు కురుకులపతిం దీవించి
తదనుజ్ఞ వడసి యెందేనియుం జనియె నంత. 67

ఉ. నారదు మాట వీనులను ♦ నాటిన నాఁటగ నవ్విహాటిలోఁ
గూరిన మోహభారమున ♦ కోరిక లీరికలెత్త రేపు మా
పారని తాపమోర్వక ప్రి ♦ యాళులతో మరుమాటలాడకే
చేరిక మాని వేదురను ♦ జెందిన చందముగా వసింపుచు౯.

నారద వృత్తాంతంబు విని కళావతి మోహభ్రాంత యగుట

చ. నరపతి రూపు చిత్తరువు ♦ నర్థి లిఖియించి తదీయదర్శనం
బరుదుగఁజేయు కీరముల ♦ కాతని స్వర్ణ గౌరవంబు లే
ల్పరచుచు సారెసారెకు పద ♦ పద్యము లద్భిలినేర్పు వీణచే
భరతకులాధినాయకుని ♦ బల్మరు బాడు రహస్య వేళలన్. 69

వ. మఱియును. 70

సీ. అలికభాగంబున ♦ తిలకంబు దిద్దుచో
సుతతిచే ముకురంబు ♦ చూచుకొనదు
పరుల దండలు తన ♦ ప్రేసలి దురుముచో
నలకల దువ్వ కో ♦ దండముగను
నగలుంచు కొమ్మని ♦ నను దాల్చు పన్నీట
జలకంబులాడన ♦ సహ్యమందు
ఆరగింపుము కూడుఁ ♦ గూరలంచనినను
నగపడక సిగాటు ♦ లుగ భుజించు

గీ॥ కనకపంజర శుకశారి ♦ కలకు మించి
పద్యములుఁ జెప్ప మనమార ♦ బలుకకుండు
వీణగొని గానమొనరింప ♦ వేయుటన్న
భ్రాంతిపడి తంతి విడి ♦ గోటుఁబయలు మీటు. 71

చ. తలఁపు వచింప దెవ్వరికి ♦ తత్తరమందక నిమ్మళించు లో
గులుకుచునుండ దానివలు ♦ కుల్వవిన దాకలి కన్న పానముల్
దలఁచదు; పువ్వుఁదీగెలను ♦ దాపులు గొల్వను నీరుబోయ దం
కెలి యొనరించి మారుఁడెద ♦ గేదఁగి రేకున నొవ్వఁజేయగన్. 72

—♦ యోగానందుని ధర్మజునొద్దకు బంపుట ♦—

శా. ఆలో నొక్క సఖీలలామము తదీ ♦ యంబైన మోహంబుదా
నాలోచించి రహస్య కృత్యముగ కా ♦ ర్యం బద్ధిగావించు వా
చాలున్ గౌతమపౌత్రు రాబనిచి హా ♦ స్తద్వంద్వమిష్టార్తిగా
మాళిన్ దాలిచిపల్కె నీ గతి వచో ♦ మాధుర్యధుర్యంబుగన్. 73

గీ. ధరణిదేవ! శతానంద ♦ తనయుఁడవగు
నీవు మిక్కిలిఁగూర్తువు ♦ నృపతనయుని
గాన నెక్కడ నెవ్వరు ♦ గానకుండ
నరుగవలయు నింద్రప్రస్థ ♦ పురమునకును. 74

వ. చని యందు ధర్మనందనుని సవినయంబునం గని. 75

ఆ. తనివిలేని వేళ ♦ చనువ్రసంగనివేళ
తినకయున్న వేళఁ ♦ గునుకువేళ
ధనము చెడినవేళ ♦ తప్పులెంచెడివేళ
మనవిఁ జెప్పరాదు ♦ మనుజపతికి. 76

గీ. కుడిచి శ్రమమార వీడెంబు ♦ గొనెడివేళ
వాసనాద్రవ్యములు మేన ♦ బూసి కొలువు
నందు విరిఁదోఁట నానంద ♦ మందువేళ
చనువుతోఁ జెప్పుమనవి రా ♦ జన్యునకును. 77

క. భరతకులోత్తముఁడు స్వయం
వరమున కేతెంచి తగ ♦ వైదేహసుతన్
పరిణయమగు మని తన్మతి
పరిపాకముఁ దెలిసి కార్య ♦ పరుఁడగుము విప్రా. 78

ఉ. నా విని కట్నకానుకలు ♦ నల్గడలంది పురోహితోర్వరా
దేవుఁడు నాఁటివీడుకొని ♦ తీవ్రముగా జని యొక్కెడ ఁడా పృథా
దేవి కుమారుఁ గాంచి తగఁ ♦ దీవనలిచ్చి వసించి తత్కృతా
తిథ్యావళిఁ గాంచి విస్మరము ♦ నందు వసించిన నాతఁడిట్లనున్. 79

ఉ. ఏ యెడనుండి నే యెడకు ♦ నేగుచు నీ యెడ కేగుదెంచినా
రో! యవనీసుపర్వ భవ ♦ దుర్వరనేలు నృపుండు ధర్మనం
ధాయకుఁడే, ప్రజల్ సుఖులె, ♦ ధారుణిపండునె చెట్లునిత్యమున్
బూయుచు కాయుచున్నయుడి♦పోవక గోవులు పాలొసంగునే. 80

శతానంద సుతుండు గళావతీవృత్తాంతంబు ధర్మతనయునకుఁ జెప్పుట

వ. నావుఁడు శతానందుని సుతుండైన యోగానందుం డిట్లను, దేవా! విదేహదేశంబునకు నాయకీరత్నంబైన మిథిలాపురంబు గలదు.

సీ. ఆ రాజధానికి ♦ నాధిపత్యము సేయు
సకల ధాత్రీజన ♦ జనకుఁ డగుచు
జనకుండు విజ్ఞాన ♦ సనకుండు, కలనైన
వినకుండు పిశునుని ♦ విన్నపంబు
గనకుండు పరకాంత ♦ లను గడచూపుల
ననకుండు కడనాలు ♦ క నసృతంబు
గొనకుండు నిల తన ♦ కోరుగాని ధనంబు
జనకుండు నన్యాయ ♦ సరణి నెపుడు

గీ. తాను ముందు వినకుండుమి ♦ త్రతతి విడచి
యగ్రమున నుండు సంగ్రామ ♦ మావహిలిన
వెనక వెనకుండు కొలదొర ♦ కొనెడుచోట
తనివి సనకుండు హరిపద ♦ ధ్యాననిరతి. 82

క. అతనికి నీశ్వర వరమున
సుత గలిగెను రతిసమాన ♦ శోభిత గాత్రాం
చిత సుగుణాశ్చతురతచే
చతురబ్ధి పరీతభూమి ♦ జనసన్నుతయై. 83

వ. మఱియును. 84

సీ. అళి సుధాంశు ధనుర్న ♦ వాదర్శనల పత్ర
కచ ముఖ భ్రూ కర్ణ ♦ గండనేత్ర
కనకాంకుందేశు ♦ కలకుదచంద్రికా
ఘ్రాణ దృగ్దంతోష్ఠ ♦ కంఠహాస
క్రముక బిసాద్రి ప ♦ ల్లవహారవల్లికా
గళబాహు కుచపాణి ♦ తల నఖాంగి

తన్మాతలావర్తాభ్ర ♦ కదళీభ కాహళ
కటినాభి మధ్యోరు ♦ కమల జంఘ

గీ. కలిత పాటలా చంచలా ♦ గంధకాంతి
సూన నవనీతకోమలా ♦ నూన మృదుల
భావసంభవ మోహనాం ♦ బకము శివి
దనరు నయ్యింతి వర్ణింపఁ ♦ దరమె యధిప. 85

ఉ. నీటు మెయారఫుర్గ స్నడలు ♦ నేటను లేనగుబాటు గుబ్బచ
న్గోటు కటీనటత్కుటిల ♦ కుంతలపాశపు వ్రేటు సోగక
న్గాటుక గీటు నెమ్మొయి చొ ♦ కాటఁవుపూటు విలాసికోటికిన్
పాటలగంధి పాపిటయు ♦ బాటగదా మరునాట పాటకున్. 86

చ. జనకుఁడు కూతుఁ బెండిలికి ♦ చాటఁగలండు [స్వయంవరంబునం
దనువుగ గూడి బంధుల] స్వ♦యంవరవేళ వరింపరమ్మొ మా
జనకజ నావుఁ డిష్టపడి ♦ సమ్మతివచ్చెదనంచుఁ బల్కెనన్
విని మగుడన్ ద్విజుండు నృప ♦ వేగమె రాఁదగు జాగుసేయకన్.

శతానందసుతుండు మిథిలకు తిరిగి వచ్చుట

వ. అని విన్నవించి తదనుజ్ఞ గాంచి బహూకరంబుగా నింద్రప్రస్థ పురంబు నిర్గమించి యథాసుఖగమనంబున నదీ నద పుర గ్రామ తరు గిరి ప్రముఖంబులు దాటి మిథిలానగర మార్గంబువట్టి చను దెంచు చుండె నంత. 88

సాయంకాల వర్ణనము

ఉ. జారె మరీచికల్ కువల ♦ షండము నిద్దుర దీరె తమ్మి బెం
పారె రథాంగ యుగ్మముల ♦ కాపదగూరెను వారుణాశజన్
జారె పతత్రిసంఘములు ♦ వ్యోమపథంబున బారె పంక్తులై
మీరె తమంబు తూర్పున శ ♦ మించె నినోష్ణము భూతలంబునన్. 89

[సంపాదకపూరితము]

క॥ సరసుల నుడికించితిరే
పథికులకు మేలొసఁగి కువలయపతి నణచియు స
త్పరి వృథుఁ జేతెంచె న
త్తరి భయమగు నెనుభంగి తపసుఁడు గ్రుంకన్. 90

క. యరలింగి బొడిచె నత్తరి
హరిమైతగు హరి కటిస్థ లావృత పీతాం
బర కాంతి చందమున న
బ్బురమున వారుణము హరిన భోభాగమునన్. 91

గీ. తనకు పగవాఁడు హరిత్రయీ తనుఁడు సాయు
మనెడు వర్షాగమంబున నంబురాశి
బండ జన నిండె బ్రహ్మాండ భాండ మంధ
తమము తద్రిపు దైత్య యూథంబువోలె. 92

## తమోవర్ణన

వ. మఱియు నంధకారంబనేక ప్రకారంబుల నవారితంబై మీఱి నిశాచరానీకంబులు చెలంగుచు, మిత్రత్వంబున సర్వరక్షణంబుసేయుచు, సురోత్తముండైన హరి సముచితసాయం సమయుంబను వర్షావసరంబున సముద్రాంతరంబున నిద్రాముద్రితుండఁగుట యెఱింగి తూరుపుకడనుండి యచ్చట నద్దివిజుల సామిసోదరుండైన దామోదరుండు లేమి నొక్కఁడు దిక్కుమాలి పాలింపుచున్నాఁడని బెదిరింప దరితోలి దిక్కాక్రమించి, యవ్వజ్రపాణి మణిగణ విజృంభణంబు హరించిన యపరాధప్రకారంబున, యనలుని మార్గ నిరోధంబుజేసి, మహాభీలంబగు కాలనివాహనాయుధంబులాక్రమించి, యవక్రంబులైన నిశాచరసైన్య క్రమంబున, విక్రమించి వరుణదేవతాత్మ బలంబడుగంట గలిపి, సమీరుని రజోవికారుం గావించి కుబేరుని నవనిధులు నిజాధీనంబుఁ జేసి, కృత్తివాసు నంబరాడంబునుహత్తి జారచోరుల కుపకారంబు గావించి ఘూకంబుల వలన చీకాకుపడు కాకిమూకలకు నాలోకన భీక

రంబై, భల్లూక వరాహానీకంబుల పోల్కి భూచక్రంబు నిండి యాకాశంబున కెక్కి యెక్కడ జూచినం దానయై, యుండెనంత.

సీ. అరుణఁ దోలెడి కాల ♦ హరిపతాకాదిక
చ్ఛదసముద్యుతి వోలె ♦ సంజవొడమె
నటమీద గనియు ప్ర ♦ త్యర్థి నిశాట యూ
థంబు నా గాఢాంధ ♦ తిమము బలిసె
నతఁడేయు నుదయ శై ♦ లజ్యాముక్త బాణ పుం
ఖముల పోలిక తార ♦ కలు జనించె
తదనంతర ప్రయు ♦ క్తంబునై మిన్నందు
గదనాగ నొప్పెన ♦ క్షత్రవీధి

గీ. అట దివియు ఖడ్గ మనఁదెల్ల ♦ నయ్యె తూర్పు
నందు నేతెంచు చక్రమో ♦ యనఁగ జంద్రుఁ
డుదయమయ్యెను తరువాత ♦ నొత్తువిజయ
శంఖరుచిపోల్కి రేయెండ ♦ జగము నిండె. 94

## చంద్రోదయ వర్ణన

శా. ప్రాచీనాబ్ధి సరోంత రోదయగిరి ♦ గ్రాహోపగూఢోన్మద
ప్రాచుర్యాంత తమః కరేణ్వ భయదా ♦ ర్ధంబచ్యుతుండే యథా
రాచిత్రార్భటు రుక్మితో వెడలు చ ♦ క్రంబోయనన్ రక్తి బెం
పై చంద్రోదయ మయ్యె నయ్యెడను త ♦ త్ప్రాంతంబులన్ వింతగన్.

మ. తొలుతన్ వెన్నెల మిన్నువాఁకగొని దాదోప్తోడ వీక్షించి గో
త్రలసద్వీధి జనం దమఃకలిత వేళాకాళికం గాంచి వం
బలరన్ దీర్ఘ శరంబులం బొదివి యాత్మాంకంబునన్ నిల్చి వె
న్నెలరా సోముఁడనంగ సోముఁడు కళంకాంగైక శోభం దగన్.

వ. అంత మహానటుని జటాజూటంబు నిర్గమించి సమయ భగీరథ రథమార్గంబు ననర్గళ ప్రవాహంబులతో వచ్చు వియచ్చర స్రోతస్విని ననుసరించుచు, ధరణిపయిన్ వెల్లివిరిసిన పాలవెల్లిచందంబున నందంబై, రేయెండ సాగరంబులపై గొనసాగి, తరువుల నరిమురి

వెనకొని. యవనీధరారోహణంబుజేసి, బ్రహ్మాండభాండం బ్రాక
మించి సంత కళావతి యాళీయువతులతోడ. 98

ఉ. వెన్నెలగాయు చందురుఁడు ♦ వేదురుఁజేయుమరుండు బర్హిణుల్
మన్ననగా షుషడ్పదస♦మాజము పాటలపాడ తావులీ
నన్నను గాలిపల్కులు వి♦నన్ శుకపాళియొనర్ప మేడలో
నన్నిలువంగలేక పయనంబయి ♦ క్రొవ్విరిఁ దోటకేగినన్. 99

## కళావతి విరహము

సీ. కను మొగలాయి ప♦క్కా తరహాదారు
బాణైన తమ్మితు♦పాకిఁబూని
మొగలిరేకును గజ♦ముగఁజేసి తప్ప కూ
రక ఝుమ్మురనుచు మిం♦టికిని నెగసి
క్రమ్మరివచ్చు భృం♦గములను జోడుగుం
డ్లమరిపుప్పొడి కప్పు♦రమను మందు
రంజకంబుల నించి ♦ లాగైన చిల్కబా
బాడిగ్గి లంఘించి ♦ పజ్జనొలిచి
గీ. డాసి బారొనరించి మీఁద ♦ నాల్వఁజేరుఁ
డక్క గురిఁజేసివేసి చు♦రుక్క మనుచు
జక్కవల నుక్కణెక్కాను ♦ చన్నుఁగవకు
నాటుకొని తూఁటువడఁగ ము♦మ్మాటి కవుడు. 100

చ. కంతుఁ డటన్న బోయవిరి ♦ కత్తి ఘరాలనిదూయ బర్హిణుల్
గంతులువేయ వెన్నెలలు ♦ గాయ సమీరుఁడుడాయ తుమ్మెదల్
చెంతల మ్రోయ కోవెలలు ♦ చిందరసేయఁగ నోర్వరాదు ని
శ్చింత వసించుచోట నను ♦ జేర్పఁగ చేడియలార మ్రొక్కెదన్.

వ. అని విరహవేదనాభరంబున తరుణీమణి యోర్వఁజాలక. 102

సీ. విరిసెజ్జబండి త♦త్తరమంది పడిలేచు
చలువరాతి పై ♦ నిలువఁబోవు

బడి బడి వెన్నెల ♦ బైట కేఁగఁగఁ జూచు
పొన్నగున్నల నీడ ♦ పోయి నిలుచు
కృతకాద్రి తటుల కె ♦ క్కి వసించు నంతట
తద్గృహాంతరముల ♦ దాగి యుండు
సరసులలో నీరు ♦ జల్లుమో దిగుబావి
యుదిరి మేడక్కఁ జను ♦ నుస్సురనుచు

గీ. చెలుల పైఁబడు నిఁక నేమి ♦ సేతుననుచు
నులుకు బెళుకును బయలంచు ♦ కలవరించు
లేచి కూర్చుండు ననుగావ ♦ రే యటంచు
నబ్బురంబందు తాళలే ♦ ననుచు వెలఁది. 103

చ. కనికర ముంచరమ్మ మది ♦ కాకపడందగదింక క్రుంకెదన్
గానగదరమ్మ మిమ్మికను ♦ గొందు సుమమ్మ వియోగవార్ధిలో
మునుఁగఁగఁ జేతురమ్మ కడ ♦ ముట్టిన పుణ్యములబ్బునమ్మ ప్రో
చిన తెఱలేమి నిల్చుటకు ♦ జెప్పరె గప్పరె చల్వపుట్టముల్. 104

వ. అని మఱియు నొక్క ప్రియురాలిం జూచి యిట్లనియె. 105

ఉ. వినగదవే సమస్కృతులు ♦ వేగనవే పనిబాటకేమి వే
చనగదవే మనోహరుని ♦ సన్నిధి కానుకలిచ్చి తన్మనం
బున గతరాగపూర్ణమగు ♦ నట్టుగ నామనవెల్లఁజెప్పఁ దో
ట్కొని పనితోడ రాగదవె ♦ కోమలి కామునికోర్వరాదిఁకన్ 106

గీ. చూడరే మరుఁడేతెంచు ♦ జాడమీరు
వీడరే సారెసారె ♦ కెగ్గాడి వేడి
దారి యీదారివచ్చునెం ♦ దాక నిచట
భయమునకు నిల్వరారను ♦ పలుకు వినరె? 107

వ. అని యనేక ప్రకారంబులం జూచుచు లేచుచు గోరిక లీరికలెత్త
గారుచు నిలువారుచుం గూరుకెరుంగక నారగింపుమని ప్రియనారు
లిడు కూడుఁ గూరల నెల్లక తనమేని సింగారంబునకు దగునని
యొకనారి మెడం దారహారంబు లుంచుచు పంచబాణుండు

పాపాత్ముండని దూషించుచు, సమీరణు సమీపించుచు, శుక శారికాదుల నాక్షేపించుచు, వ్రాలుచు, సోలుచు, విరాళిందూలు నబ్బాలికంగని ప్రియాళులు శిశిరోపచారంబుల సేయందలంచి.

ఉ. చల్లని కప్పురంబలఁది ♦ జాజి సరుల్ మెడవేసి కీల్జడన్
మల్లెలదండఁ జుట్టి నయ ♦ నంబులఁ దామరరేకులుంచి మో
మెల్ల హిమాంబువుల్ గొలిపి ♦ యేడ్తెర తామరతూళ్ళువైచి పైఁ
జల్లిన గంధపుంజముల ♦ చానలు తాపము వాపనోపిరే. 109

క. తదనంతరంబ కొందఱు
ముదితలు మదినెందు వాయు ♦ ముఖ్యులు చెవి నా
పద బెట్టు వారలన్ మది
గదిసిన కోపమునవారి ♦ గని యిటు పల్కెన్. 110

మన్మధోపాలంబన

ఉ. వీడ్పద కేతనేశ భువ ♦ నేశ మహర్షి గణేశదేవతా
రాడ్పవమాన మిత్ర యమ ♦ రాద్దనుజాధిప వాయుయక్షులుం
విట్పరిపాటుఁ దోషక ధృ ♦ తిం జెడిపోయిరి మారయింక నీ
షడ్పదశింజ నీకుసుమ ♦ సాయక పంక్తుల కింతులోర్తురే. 111

వ. అని చంద్రు నుద్దేశించి. 112

చ. సెగయొనరింపకే చలువ ♦ చేఁ బరిపాలన జేతువంచు స
త్యగతి వసించు విష్ణు ♦ డెదమంటు గరాజసమంటుతూని బా
స గడిచిలీవయోత్సవన ♦ జాతము గుందునెకానిచో దలం
చఁగ బహుళక్షయం బిటు మ్మ ♦ సాదిపరీతముచేతఁగల్గునే. 113

వ. తరువాత వాతపోతంబు నుద్దేశించి. 114

క. కరువలి చెలిపాలింటికి
మరువలి నైతిదియె ధర్మ ♦ మా పలుమా రి
ట్లరువలి నీయగనేలా
మరువలినే యింతలోన ♦ మతకరితనమా ? 115

సీ. శరదబ్జవదన నే ♦ చఁగ నెంతురే సమ
యమ్మంచు నీలకం ♦ ఠమ్ములార
కన్ను లెఱ్ఱగఁజేయ ♦ గారాదు రామపై
కేరుచు సారె కో♦కిలములార !
పలుకాదరింపకా ♦ చిలుకలకొలికిపై
గనలుట మేలా శు♦కంబులార !
తలదాల్చు మిమ్ముల ♦ నళివేచ ఝుంఝుం మ
నఁగరాదు వినుఁడు ష♦డంఘ్రులార !
గీ. తరుణిపై కోపపడకూడ ♦ తగదు మీకు
మైనగోరింకలార ♦ యేమైన గాని
హంసగామిని నులికింప ననువుగాదు
చాలునిఁక బొందు రాజహం♦సంబులార ! 115

వ. నావుఁ డొక్క చెలికత్తె యిట్లనియె. 117

సీ. చండాలి నారిగా ♦ జనరతిం గూడి యొ
ప్పిన దర్పకుఁడు మఘ ♦ ప్రియుఁడు దెలియ
కాంచనప్రియుఁడన ♦ గా నామని జనించి
యలరించును కుజాతి♦ములను దలఁప
మహి సుమనోభూతి ♦ ప్రహరింపుచును ప్రభం
జనుఁ డారయఁగ గాలి ♦ యనఁగ సోఁకు
దోషాకరుఁడు గురు ♦ ద్రోహి నిశాచరుం
డతని జూడఁగ కళాగతిని దరుగు
గీ. కలసె పంచమకీర్తి శి ♦ ఖండి జాతి
వారి నధిపాతకాళి త ♦ త్పరత మీకు
జనదెపుడు మీదు సన్మార్గ ♦ చర్యమాని
యరుగుడో పరభృతోత్సుక ♦ హంసలార ! 118

వ. అని యుపాలించిన సమయంబున కుంభినీయానదీనానూనమాన సయ్యె మూర్ఛిల్లి దెలిసి యుసురసురనుచు లేచి నలుదిక్కులు రోసి యిటనియె. 119

సీ. నేలవేలుపు మిన్న ♦ జాలంబుఁజేసి యిం
　　ద్రప్రస్థపురము గ♦న్నాఁడొ లేదొ
నాపంపునను వచ్చి ♦ నాఁడంచు ప్రభు వాయ
　　నకు దర్శనంబిచ్చి ♦ నాఁడొ లేదొ
దర్శనంబిచ్చి యం♦తట సమయంబిచ్చి
　　నామాట లాలించి ♦ నాఁడొ లేదొ
నిను నమ్మియున్న దా ♦ నిని వెతపాల్సేత
　　న్యాయంబు గాదని ♦ నాఁడొ లేదొ

గీ. ఇంక నేమందు మరునకు ♦ నిదియె సందు
చలువ వెన్నెలకందు ♦ వాసంగు జందు
కలువమొయిరుందు ♦ పీనుల కంటివిందు
దిక్కు గలదెందు చెప్పరే ♦ దీనిముందు. 120

వ. అని విచారింపుచున్న సమయంబున. 121

గీ. వచ్చి భూసురుఁ డక్కాంతా♦వతిని గాంచి
పోయి వచ్చిన కార్యంబు ♦ కాఁగె వండొ
యనవుడు ముదించి యందు ♦ పంగడరుచు బల్కి
సకలమును జెప్పె నానుపూర్వకము గాఁగ. 122

క. దేవీ నిను వీక్షించి చని
దేవేంద్రసమాను నయ్యుధిష్ఠిరు గని సం
భావన లంది రహస్యము
గా వినుపించితిని వాచకము సర్వంబున్. 123

మ. విని సందేశము భారతాన్వయుఁడు నర్వేమారు నగ్గించి పా
వనచారిత్ర ధరాసురేంద్ర నిను తాంబంపింతె నామంచిదే

యనుకూలం బెరిగింపు మంచు పలుమారు శ్రాబాపురే మేల్బళా
క్షాను మిష్టంబులు వేయునేటికి నివే క్కొమ్మిమ్మా నమస్కారముల్.

వ. అని యభినందన పూర్వకంబుగా నన్ను మగుడం బంపించిన నరుదెంచితి విను మతంబు, 125

సీ. హిమబిందువులఁ జెంది శ్రీకోమలాంబు కరసిత
నయన పాదాబ్జ బాణములు గూర్చి
సంపెంగనూనె వాసనలు జెన్నలరు వే
నలి యన నలికుల శ్రబలముఁ గూర్చి
బహుసంపత్ప్రాప్తి సర్వకళాభియు క్తముఖా
ముఖచందురు సహాయమ్ముగను గూర్చి
ఎక్కుడిసిరికనె పెంపెక్కి చక్కని యుక్కు
బొమ సింగుణుల జోడు శ్రనమరగూర్చి

గీ. ముజ్జగము గెల్చు విలువిద్య శ్రనెజ్జయైన
మదను గెలువంగ దీక్షొన్న శ్రముదిత నన్ను
చెదరఁ జేయదె యనుచు సమ్మదముతోడ
సుదతి గొనియాడెనా నవ । మదనమూర్తి 126

వ. అట్లనుటం జేసి 127

ఉ. మానిని ధర్మరాజతని । మాటలు వేదవరంబు లిచ్చెనా
యేనుగపాడి గంటగనె । నేని సమస్త జగజ్జయేందిరా
స్థాన సమాగమంబు నర । దాపడి వ్రేసిన రామబాణమా
కానృపమాత్రుఁడేయదుక।లోత్తముఁడోహరుఁడో విధాత్రుఁడో

ఆ. జలధులన్ని యింకి । చనెనేని మేరువు
విరిగెనేని భూమి । తిరిగెనేని
గతులు దప్పెనేని । కంజాప్త చంద్రులు
మాటఁదప్పలేరు । మానఘనులు. 129

వ॥ అదిగావున ధర్మనందనుండు నిక్కమ్ముగా స్వయంవరంబున నిన్ను వరియించు నంతలోనె యని మేలువార్త దెలిపి సుఖంబుండుమని బ్రాహ్మణుండు నిజమందిరంబునకుం జనియెనంత. 130

## ప్రభాత వర్ణన

శా. మార్తాండుఁ బెన్మఘు మత్తురాత్రి చరునిఁ బ్రాపింప దద్దాగతు
ల్మైరేహంస శుకాళి పారభృత పాళీ మీఁశుభాద్రోద్గతుల్
బారందోచి యటంచు దానిజ భరద్వాజ ప్రభావోక్తులం
జేరెఁ నావన సీమ వేకువను దాల్చెఁ ఖంజరీట ధ్వనుల్. 131

ఉ. ఆయినుఁడాగతాభిముఖుఁ డైటయు దామెటిగున్న దాటఁచే
దీయని బంధురార యువతిందగు నిల్లదమిఁ రమించిరా
నా యడనేగునో తుదకి యంచని యాకలకంఠ కొక్కురో
కోయని వారణోక్తి బలె గూసె వెసఁ గృకవాకుకాండముల్.

మ. ఇనుఁడస్ రాముఁడున్వయరాగ ముదితాంకిఁ గొల్లనక్కాంత ప
ద్మినికిన్ గీడగుదుస్తమః కరటి మర్దించం గరాస్త్రంబ బం
పెస దట్టె జనపక్షిరావదము నుష్పంగావు కావుంగదే
యను పెలంబ విభ్రుధ్వనుల్ బొదిసెనాశాంతంబులఁ వింతగఁ.

వ. అంత. 134

మ. ముసుకాలాంతముగాగ నిద్రగని సంమోదంబుతో నబ్జరా
గ నిబద్ధాగ్ర శిరోగృహాగ్ర గతుఁడై కల్యం మహానిద్ర బొం
దిన విశ్వంబు పునర్భవోత్కమగు జ్ఞప్తికిం జేయ లోఁగోరి చూ
చిన బ్రహ్మేయనమంద రక్తియన బొల్చెఁ హేళిపూర్వాద్రిపై.

## కళావతి స్వయంవరము

వ. తదనంతరం బనంత కాంతుండు కాలోచిత కృత్యంబులు నిర్వర్తించి, యాస్థానమండపంబున కేగుదెంచుసమయంబున జెలికత్తెల వలన నెఱింగి, తన మనోరమ బలికిన పలుకు లాకర్ణించి సింహాసనాసీనుండై, బుధబాంధవహితామాత్య ప్రభృతుల రావించి యుచితాసనంబులఁ గూర్చుండ నియోగించి కొంతదడవునకు యథోచిత వాక్యంబులతోడ భాషింపుచు. 136

చ॥ తనదు కుమారికామణికి । తగ్గ మనోహరుఁడైన వల్లభుం
డనఘుఁడు రూపశీలనయ । యౌవన బాంధవ వంశమాది లాం
ఛన ముఖభాగ్య యోగ్యగుణ । సంగతుఁ డెవ్వఁడొకో యటంచు నె
మ్మనమున నూహఁజేసి బుధ । మంత్రిహితాభిమతంబుగా వెసన్. 137

స్వయంవరంబునకు రాజన్యులు వచ్చుట

వ. భేరీ మృదంగాది రావంబులతో నఖిల దిక్కుల యందు స్వయం
వరంబు చాటించి శోభనోద్యోగంబు సేయింపుచున్నంత. 138

మ. పరమేశాను విశాలధారి సుగుణ వ్యా । పారపారీణుఁ డీ
శ్వర పాదాంబుజ భక్తిలోలుఁడు రిపు । వ్రాతాంతకుండాశ్రితో
ద్ధరణుం డూర్జిత నీతిశాలి పటుదో । ర్దండాతి సత్వాఢ్యుఁడై
కరమొప్పారఁగ వచ్చె నీలుఁడటకున్ । గాశీశుఁ డుర్వీశ్వరా. 139

మ. అతిసత్వాంచితమౌ గజాశ్వరథ పాదాత్యాళితో మైథిలీ
పతిచారిత్ర మహోత్సవముల్ బుధహిత । వ్రాతంబుతోఁ జెప్పుచున్
సతమౌ కోసల భూప్రధాన నగరీ । సాకేత నాథుండు నా
బుతుపర్ణుం డరుదెంచె సద్గుణ కళా । హేలాను లీలాగతిన్. 140

సీ. భేరికాఢమఢమ । త్కారముల్ మీరంగ
గాంధారపతివచ్చె । బంధుయుతిగ
ధ్వజవస్త్ర పటపట । ధ్వానమభ్రముమ్రోయ
వైదర్భుఁ డరుదెంచె । మోదమునను
శుండాల ఘీంకృతి । కాండంబు ఘూర్ణిల
కాళింగుఁ డేతెంచె । హాళితోడ
కంఖాణ రింఖావి । శృంఖల ధ్వనుల బా
హ్లికుఁ డేగుదెంచె యుత్సుకము మెరయ

గీ. మఱియు కర్ణాట పానాట । మాళవాంధ్ర
కొంకణావంతి ఔంకట । ఘూర్జర కురు
నాట కరహాట దేశాధి । నాథులొక్క
మొగిని వచ్చిరి వైదేహ । నగరమునకు. 141

చ. పొలుపు దలిర్ప వచ్చిరి నభోపతవాతవిధూతకేతనాం
చలములు నైజఖడ్గజిత శాత్రవు లేగుచు చేరుమాళ్లచే
దొలఁగఁగఁ ద్రోయ సోయగము దోప వియచ్చరదప్సరఃకుచాం
చలవిలసద్దుకూలములు జాలఁగఁ ద్రోయఁగ ద్రౌపదుల్ బృహ
ద్బల కుకురాంగ వంగ నరపాలక మద్ర విరాటరాట్సుతుల్. 142

సీ. నవరత్న కర్ణకుండలకాంతి తలమీఁది
మణికిరీటంబుతో మారుమలయ
ఇంగిలీకపుఁగాంతి బంగారు పొంగారు
దుప్పటీ వలెవాటు దొంగలింప
కరముల శంఖ చక్ర గదాసి శార్ఙ్గమ్ము
లరివీరులకు భయంకరము దోప
భేరీ మృదంగ గంభీరఘోషంబు బ్ర
హ్మాండ భాండంబెల్ల నిండుకొనఁగ

గీ. ఆప్తులగు యదు వృష్ణి భోజాంధక కుల
వరులు సాంబాది నిజతనూభవులుఁ గొల్వ
రథముపై నెక్కి మిథిలాపురంబుఁ జేరె
సంభ్రమస్ఫూర్తి గోపాల చక్రవర్తి. 143

చ. జవ తురగాళితో కుథరసన్నిభ భద్రమదావళాళితో
వివిధ రథాళితో చటుల వీర్యసమేత భటాళితో మహా
దివిజ వరాళితోభయ వధీధితి ఖడ్గకరాళితోడ పాం
డవు లటకేగుదెంచిరి దృఢధ్వజముల్ నభమంది వెల్గఁగన్. 144

క. చనుదెంచిరి మిథిలాపుర
మునకున్ దుర్యోధనుండు మున్నుగ హితబం
ధునికాయముతో కౌరవు
లనఘా చతురంగబలసమన్వితు లగుచున్. 145

క. యాదవ పాండవ కౌరవు
లావరమున వచ్చిరిట్లు హరి ధర్మజుఁడున్
మోదంబున దుర్యోధనుఁ
డాదిగ నమువఁగ భుజామహాత్త్వము లలరన్. 146

గీ. మఱియు దిగ్దేశముల రాజవరులఁగూడ
మఱియు దిగ్దేశముల రాజవరులు గూడ
వచ్చిరి నృపాలయోగ్య శోభలు వెలుంగ
వచ్చిరి నృపాలయోగ్య శోభలు జెలంగ. 147

వ. ఇట్లు వచ్చిన నరలోకపాలకులు సింహాసనాసీనులై యున్న సుయోధను నుచితాసనాసీనుం జేసి కృష్ణుని మహాసనంబున నుండ నియమించి ధర్మరాజు, 148

మ. వన పుష్పాతి విచిత్రమై మృగమద వ్యాకీర్ణమై చంద్రచం
దనయుక్తంబయి ఘుమ్మనం బొలయు బల్ తావుల్ జలింపన్ గన
త్కనకోద్యన్మణి సానుసానువున ధిక్కారింపఁగా జాలబో
ల్చిన కాలాగరు ధూప సౌగంధమలీ సింహాసనం బందునన్. 149

మ. బలుజున్నా జలతారు తాసుజిగి తేవల్గుల్కా లోడెత్తు నా
వల దాపై యొరుగొప్పదీర్చిన హంవా బాలీసు జోదంటి చెం
తల బీంబాము జుగానిగారఁవు జరీ తాజాకి నేరాగబల్
దలు దట్టున్ న్నెరవన్నె మీర మెరుగుల్ ధక్కాల్ వగల్ గుల్కఁగన్

మ. హాయపై మీరు మితారి రే వెలుఁగు రాలోయ్యారపుంబారులో
ప్పుయి పైగోవమెఱుంగు కెంపురవలందం జేర్చిఁ దాపించి బో
దియ దీప్తిప్ప గళాశికీని జగా తేటల్ గుబాళింప వ
న్నియలన్ మించిన మంచగద్దియపయిన్ నిగ్గుల్ దుబాళింపఁగన్.

మ. ననువై మెచ్చు జగానిగారముల మిన్నా చీటునాల్ వన్నె తె
గ్గునిగ్గుల్ దులకింప వాల్గుమ మెక్కుం బక్కి రారాపసల్
మినిచందమ్మ కడాని మేలొరఖుడా ల్మీదం బిసాళింప గ
ప్పిననిద్రాపరుషంచు హాంబన ఝుర్ వెల్గుల్ వజాగుల్కఁగన్.

శా. ఈరేనరా హావళించి మించఁగను దా।రెంతేని ఖింతో తఘా
శా ఠీవింతఁగ గద్దెపై పరుషు తా।జాజ్ఞసేసినం జూచి తా
పీఠీ వామమునందు గొందరు దొరల్ । వెల్గొంద వైదేహుఁడా
పాఠీనాంకవిలాసరూపునకు జూ।పంజూచి యగ్గద్దెపై. 153

ఉ. బాటుల రాజులందఱును । బారులు దీరిచి గూరుచుండ నా
రాజమృగేంద్ర మప్పుడల ♦ రాజమృగేంద్ర ముగ్రావఖండవి
భ్రాజితమైన మార్గమున । పర్వత మెక్కెడిలాగు బాగుగా
రాజిలు మెట్లపెంబడిని । రంజిల నక్కడి కెక్కె నెక్కఁగన్. 154

ఉ. రాజ కిరీటి కోటిమణి।రాజి ఘృణిప్రకరోల్లసత్పదాం
భోజుఁడు చారుమూర్తి క్రతు।భోజనతేజుఁ డతండు బొల్చె నా
రాజులలోన రత్నరుచి♦రాజిత విష్టరమందు నీతఁడే
రాజులరా జయారె భళి ౹ రాయని భూజనులెల్ల మెచ్చఁగన్.

చ. కుసుమసమేత పల్లవిత ౹ కుంజ కదంబ విడంబ బించిత
ప్రసర చకచ్చకద్యుతి వి।రాజక రాజమణీగణాగ్రధా
త్వ సదృశపూర్వ పర్వతశి♦ఖాంతర భాస్కరు లీలలోల రు
గ్లసధ నుకీర్ణపర్ణముల ౹ రంజిలు గద్దియనెప్పె నొప్పఁగన్. 156

క. సురుచిర మణిగణ కిరణ
స్ఫురదాభరణాంగులైన । భూవరులుం దా
సురతరుల పారిజాతము
కరణిందగె నీదువంశ । కర్త నరేంద్రా. 157

శా. ఆ యుర్వీతలనాథ యూథమున। నుద్యద్భృత్యశోభాయత
శ్రేయోభూతిని తారకాగ్రహ మహో।రుజ్యోతిలోనున్న రా
కాయామిన్యధినాథుఁడో యనఁగ శృం।గారంబుగా బొల్చె కం
టే యుష్మత్ప్రపితామహాగ్రజుని కం।టేఁ బెద్ద పెద్దైనృపా. 158

మ: అతులాలోలస ధాళధళ్యసితవ।స్త్రాచ్ఛాదితోర్వీధవాం
చిత గేహాంగణసీమ బొల్చిరి నృపుల్ ♦ సింహాసనాసీనులై

యతిశోభఁ క్షితినాథు జట్టున విమానారూఢులై వచ్చు దే
వత లా శ్రీపతి పెండ్లి శబ్దిపయి కే♦వఁ నిల్చు నట్లబ్రమై. 159

వ. ఇట్లున్నయెడ. 160

సీ. గంభీర భేరికా ♦ ఘుంభద్ధ్వనుల్ గంధ
గంధేభ ఘీంకార ♦ గతులు బెనఁగ
లాస్య వేశ్యానూపు♦రధ్వనుల్ కింకిణీ
కంకణ క్రేంకృతుల్ ♦ క్వణనమలరఁ
పటహ ఢక్కా మహా♦స్ఫుటరావమానద్ధ
ధాంధణోద్యన్నినా♦దము నెదుగఁ
కాహళ శంఖు ఘాం♦కార రావంబులు
ప్రభవాగ్ర కీలికా ♦ ఫణితి నెరయ

గీ. విభ్రమిత మందరాచల ♦ దభ్రఘాక
మానదుంగత్తరంగ ఘు♦మంఘుమార్భ
టీస్ఫురక్షీరవారాశి ♦ కేవరావ
ముక్కటై మ్రోసె ఘుమ్మను ♦ నో నరేంద్ర. 161

ఉ. అత్తరి బిత్తరంపు వసు♦ధాధిపభూషణ చాకచక్యపుం
జొత్తులు నత్తటంతులుగ♦శోభనకృత్య ఘుమంఘుమంబు లు
వ్వెత్తుగ గర్జలెఁ దగ బ్ర♦వృద్ధ ఘనాగరుగంధధూపము
ద్వృత్తి నకాలమేఘమయి ♦ పెంపు నెగెకులకిచ్చు మోదముల్.

వ. అట్టి మహోత్సవ సమయంబున గొందఱు కుందరదనలా రాజ
లోకంబు నాలోకించి సన్మాన్యరాజన్య లోకంబునందా సౌజన్య
శేఖరుం గాంచి తదీయ విలాసవిశేషంబు లూహించి, మన సఖీ
రత్నంబు వయోరూపలావణ్య మహిమాతిశయంబులు మాటి
మాటికి వక్కాణించి చొక్కుచుండు నితండె కాబోలునని
తలంచి, ఆచకోరాక్షికి నీ రాకాసుధాకరాకారునకు నీడుజోడయ్యె
నని వితర్కించి, యువతీరత్నంబును బరిహాసంబు సేయుచు,
నాలోకించుచు, వదనేందుబింబంబుల మందహాసచంద్రిక లందందం

జలువాఱ తదీయ మందిరాభిముఖులై తమతమ మంద మరాళ
గమనంబులు సందడింప. 163

క. తోయ్యలు లయ్యెడ గొందఱు
సయ్యన నెయ్యమునఁ జేర ♦ జని వెనగొని రా
వయ్యారిని కుసుమితలత
నయ్యళినీ గణము గవియు ♦ నట్లు నరేంద్రా. 164

వ. ఇట్లు జేరంజని యందొక సుందరాంగి ముఖంబున మందహాసంబు
గదుర పరిహాసంబుగా నిట్లనియె. 165

గీ. ఓ కళావతిరో యిప్డు ♦ డొక్క దొడ్డ
రాజు నిను గూడి మిన్నంది ♦ రమ్యఫణితి
కువలయానందము గణింపఁ ♦ గోరియుండె
లోకమున నాత్మసాహిత్య ♦ రూఢి మెరయ. 166

వ. మఱియు. 167

గీ. ఇది వినుము కొమ్మకోరె నీ ♦ హృదయభవగు
ళుచ్ఛగంధ విభాప్తి వె ♦ లుచు ద్విరేభ
రాజరత్నంబు కాంచనో ♦ ద్భయత మెరయఁ
దలఁచి యొకటున్నదని పల్కె ♦ చెలియొకర్తు. 168

గీ. ఓలతాతన్వి నీ యందు ♦ నొక్క సౌఖ్య
ఫలము నొక రాజకీరంబు ♦ బడయఁదలచె
రాజయోగాసనమున నై ♦ ర్వతను రామ
కృష్ణ సదభిక్ష్యభజన చూ ♦ ట్కకిఁ బ్రియముగ. 169

వ. ఇట్లనుచు ననేక ప్రకారంబుల నక్కర వాణిని గిరడంబు లాడుచు,
యారాజాస్య లిఁక నాలస్యంబుసేయందగదని రయంబున నభ్యంగన
స్నాన మాచరించి, దడియార్చి, చిక్కకేర్చి మెఱుంగు ధూపంబు
లొదవఁజేసి, దువ్వి మడమల పయింబడి దుమికి, యాముజడ వేసి
వాలుఁగన్నులకుం గాటుకం గూర్చి, భ్రూమధ్యంబున గస్తూరి

రేఖందీర్చి, వన్నెలజిగను మేలుతాబందుగాను పయిం బిగియించి మెయిహారంగులం దురంగిలించుచుండు కుసుంబారంగు ఝుగీ చరంగుల చీరెంగట్టి బిబ్బ్యపు గబ్బిగుబ్బలం గినె రావట్టులందొట్టు కుట్టు జరీబుటేదారు సిలికంచెలం టోపిఁగి, సిద్ధంబగు ముద్దుచెక్కుల కాశ్మీర కర్పూర మకరికాపత్రంబులు చిత్రంబుగాదిద్ది, కూర్పరం బులదాక ముంజేతుల పాటీ రాగరుసారంబుల రేఖలుగా బూసి మఱియును. 170

సీ. చెలువైన వీర మ ♦ ద్దెలుగిల్కు మట్టెలు
గొనఖంబరిని కాయ ♦ లును మెఱుంగు
పిల్లాళ్లు మెఱుఁగు బా ♦ ర్లళ్ళు చిటికెన బొద్దు
కళుకుల బ్రోతలం ♦ దెలును పాము
జేబీలు గొలుసులు ♦ చికిలీ కడెంబులు
గజ్జలు పావడాల్ ♦ గరుడపచ్చ
లొదలిన గంటల ♦ యొడ్డాణ మిర్కు క
మ్మర్పటాల్ జాలుల ♦ మర్పగోవ

గీ. మెఱుఁగు టొడ్డాణమును జగా ♦ మేల్మిఁదావు
చుట్టు ముద్దుఁటుంగరములు ♦ జోడుబటువు
లును మనేలానవగ్రహాల్ ♦ పెనుతొలిమగ
రాబిరుదు పొంచి ముద్రికల్ ♦ రహిం చెలంగ. 171

సీ. నిద్దావిహారంగు వ ♦ న్నియ తళ్కువజ్రంబు
గరుజు పొంచీలుచే ♦ కట్టు సరిపె
ణీల్మురువ్వులును మేల్మి ♦ నిగ్గు పచలకీల్క
డెముల్లీవలావల ♦ కొమరుఁదావు
నీలాల గాజుల ♦ నెన్నుడి గల్గు కెం
పుల జిల్కు కంకణం ♦ బులు మెఱుంగు
జాళువా పట్టెలు ♦ జతగుల్కు మగరాలు
బాజుల రాపక్కి ♦ పచ్చలిడిన

గీ. కుందనంపు దండగడియముల్ ♦ గోవకెంపు
రవలు చెక్కిన యుంగరంజి ♦ ప్రతిమశిఖి
పనిమనేలాజగాబాజు ♦ బంగు లడరి
దళుక్కు సందిట దండలు ♦ తాయెతులును. 172

సీ. గాముల వెల్గు చౌ ♦ క్కపుటెట్టగంగుల
ముత్తిగరతనముల్ ♦ హత్తిమెల్మ
పోఁజక్కడపువన్నె ♦ భుజకీర్తు లలఁతి ప
చ్చలకుత్తిగంట్లతో ♦ ల్జాతి పేట
మగరా కళాసికే ♦ సొగసు తాజాపని
గల్లా పటాతేట ♦ గాటమైన
యాణిపట్టెడయు కడాని ♦ గుల్లును బేస
రపుకాశికపు గుత్తి ♦ రాళ్లకట్లు

గీ. గోధుమలకంటె దంటాల ♦ గుల్లు మోహ
నాల వరహాలపేర్లు చీ ♦ నా గొలుసులు
చంద్రహారంబులుం గిల్క ♦ సరులుపల్క
సరులు చిల్కల తాళీలు ♦ జాజి సరులు. 173

సీ. నక్షత్ర దామముల్ ♦ నవరత్న మాలికల్
తారహారములు ని ♦ ద్దాహెహారంగు
నెలవంక తాళీలు ♦ నెఱి బులాకీ వత
కములు తోరంపు ము ♦ త్తైములసొంపు
జాల్నించు కెంపురా ♦ చంపఖల్లీలు బే
సరి కమ్మినీలంపు ♦ టొరవుముత్తె
ములు తనాచీనత్తు ♦ తెలితేటమగరాజు
లాకీజగా యప ♦ రంజి పొంజు

గీ. గమ్మలును పచ్చనీలాల ♦ చిమ్మటాలు
బావిలీల్కెంపు బొగడలు ♦ రవి మణులు

జిలుఁగు బిందీలు పాపిట ♦ చేర్చు తెలుపు
బొలుపు దులికించు చేర్చుక్క ♦ బొట్టుతోడ. 174

సీ. తోరమౌ ముత్యాల ♦ పేరుల గిరికాని
జతగుల్కు నెలవంక ♦ బింకపద్మ
రాగసంఘటితమౌ ♦ రాగిడీ శశిపువ్వు
సంపగోలుసులు కెంపు ♦ సొంపునింపు
జేజే వజీరురా ♦ చెక్కడఁపుం బచ్చ
టీకైన గేదంగి ♦ రేకువిరుల
గ్రాలు ఖద్యోతంబు ♦ జాలునా వేణితో
బోలు మేల్మికడాసి ♦ డాలుకీలు
గీ. జడయు మొదలైన నవమణి ♦ స్థగితమైన
చొక్కమౌ తరహాదారు ♦ సొమ్ములమరు
లొక్కవారంపు తోషుగింతు ♦ లొదవవొడిగి
పెనసి నఖశిఖపర్యంత ♦ మునను జెలికి. 175

వ. ఇట్లు పంకేజవదన లా యెణాంకవదనకు సమస్తాలంకారంబు లలంకరించి, 176

గీ. అతివకును హారరత్న మ ♦ హావిశేష
భూషణలుదాల్చి యల శిఖా ♦ స్ఫూర్తి మెఱయ
పగఁ జెలఁగవచ్చు మరునకు ♦ బెగడుదగులఁ
దగ నొసల కుంకుమిడిరి ♦ నేత్రరుచి బొదల. 177

సీ. పస్నిట తేఁట సం ♦ పంగి పూఁదోఁట ర
త్నంపులేమోక కుం ♦ దనఁపు నరుశ
లాక కడాని చి ♦ త్రఁపుఁ ' మ్మ ముద్దుల
గుమ్మ చక్కఁదనాల ♦ కుప్ప కప్పు
టఁపుఁదిష్ట మరుని ని ♦ ద్దఁపుదంతి రతిచేతి
చామంతిబంతి బ ♦ చ్చవిలుకాని

చేకటారి మిటారి । కోకిలవాణి భ
వ్యశ్రోణి నవమంద । హాస కఠిన
గీ. ఘన కుచ విలాసభాస పం । కరుహనేత్ర
అతిమనోహరగాత్రి గు । ణాభిరామ
రామ యీ భామ భూమి మె । లంగుచున్న
మోహినీదేవియో యన । మురువుఁజూపె. 178

కళావతి యుమాపూజసేయుట

వ. ఇత్తెఱంగున నయ్యంగనా లలామంబు తన యంగ శృంగార భావంబున కుడ్యసంగతోత్తుంగ దర్పణంబుల నపాంగంబుల నవలోకించి యంతరంగంబునఁగల యభిలాషసిద్ధి జగన్మంగళప్రదాయి యగు సర్వమంగళ వలనగాని కాదని యూహించి, తదీయపాద కమలంబులు హృదయంబునఁ గీలించి యిట్లని స్తుతించె. 179

ఉ. వందనమే నొనర్తు హిమ । వద్ధరణీధర రాజపుత్రికిన్
చందురు శేఖరార్ధతను । సంగత కోమలనీల గాత్రి కా
నందకృదాత్మ పాదభజ । నాలసమానసదాస మండలా
మందశుభప్రధాత్రికిని స । మస్తవిభూతి వితాన ధాత్రికిన్. 180

సీ. వందనంబఖలదే । వనితంబినీయుల
కాంక కుంకుమ శోభి । తాంఘ్రియుగకు
వందనం బనిశ వి । శ్వచరాచరావ నా
ధ్యకౌనుకంపా క । టాక్షయుతికి
వందనం బుపనిష । ద్బృందోప వనపాళి
కాకేళికా నిల । కంఠికిపుడు
వందనంబోంకార । పరరత్న పంజరాం
తర నిరంతర ముదా । దరణశుకికి
గీ. యనుచునే ప్రొద్దునీకు వం । దన మొనర్తు
కరుణతో మించి యెనుట సా । క్షాత్కరించి

నాదు కోర్కెలు సమకూర్చి । నయ మొనర్చి
గావుమోతల్లి త్రిభువన । కల్పవల్లి. 181

మ. నిను బూజింపని వారికెంతును శుభా । న్వితత్వముం గల్గ నే
ర్చునె యెంతెంత తపంబు । జేసినను ముల్లోకంబులం భారతీ
వనజాగారలకైన నీసుమహిమం । వర్ణింపనౌనే జగ
జ్జనసీ పుణ్యఘనీ కృపామల సుధా । సారాగ్ర వీచీధునీ. 182

కం. వాణీరామలు చెలుగీ
ర్వాణీమణులాదిగముల । వనితలు నిను శా
ర్వాణీ నుతిసేయఁగ పిక
వాణీ మావంటి కీర । వాణుల వశమే. 183

వ. అని యిట్లనేక ప్రకారంబులఁ బ్రార్థించిన యాజగదంబ యా నితంబినీ రత్నంబు వినయంబునకు సంతసిల్లి దీని మనంబునం గల యభిలాష దీర్చి సంతోషం బొనర్చెదనని యుపశ్రుతి దేవతలం బిలిచి, నీవు మదీయరూపంబు దీపింప మిథిలాపాలక బాలిక పాలికిం బోయి తదీయాభిలాషంబు విశేషంబుగా నొనర్చి రమ్మని, పొమ్మనిన, యదియును, సాక్షాద్భారతీయనీ రూపంబున బ్రత్యక్షమై నిలిచినం, దదీయ పాదపద్మంబుల కభివందనంబు లామోదంబునం జేసి, ముకుళిత కరారవిందయై యెదుట నిలచినంగని యయ్యిందు వదన నీ డెందంబునం గల చందంబునకు నానందంబునొందితి నీ యిచ్చవచ్చిన వాని నేర్పరించి వరించెదుగాని రమ్మని కేలుకేలం గీలించి సఖజనంబులు చుట్టురాగ నారాజ మండలాహ్లాదకారిణి యగు నా కళావతిని తత్ప్రత్యాజ్ఞను స్వయంవర స్థాన సింహాసనస్థ రాజన్య మండల మధ్య మార్గంబునం బ్రవేశంబు చేయించిన నాలో లాక్షిం జూచి యవ్వసుంధరాపురందరులు విస్మయానందంబులు డెందంబున గ్రందు కొనుచుండ. 184

సీ. ఆ ముద్దు గుల్కు నె । మ్మోము నాలేనును
నగవునా నెరిగొప్పు । సొగసునాజు

గా నిగారంబు చ । క్కని చెక్కులందము
నాజిగిగుల్బు సో । యగంపుగుబ్బ
గుత్తుల టెక్కు నా ♦ బిత్తరి మాటలు
మురిపెంపు నా పెలపు । మోదికెంపు
నాజారుపైటయొ । యారమునావాలు
కన్నులం బెళ్కు నా । గానులేమి

గీ. యామిసిమిమేని నవకము । యాచొకాట
నుగునడకవగయాచెలు । వహహాం దలంచు
కొనిన యుల్లంబు ఝల్లు ఝ । ల్లనును దీని
సొగసునకు నీడులేదు ము । జ్జగములందు. 185

సీ. బాగు చక్కదనంబు ♦ వహవా చొకాటంబు
మేలుగుం జెక్కులు ♦ కౌను భళి భ
ళీముద్దు నెమ్మోము ♦ లేగుల్కు నగవహో
మురిపెంపు మాటల ♦ మురువుతేట
సేబాసు బలుజగా ♦ జిగిమేను మిసిమివ
ఝుమ్మారెపిరుందునుం ♦ డీరుబావు
రే కౌను హొయలయా ♦ రేరాకడయొ యార
మహహ మిటారిసో ♦ యగపుంబెళ్కు

గీ. బలురతుల వేడుకలనూని ♦ యలసి దీని
పొగురు గుబ్బలపై వ్రాలి ♦ బిగువు నిండ
కౌగిటం వసించు వానిదే ♦ గదరభాగ్య
మరయంగా మోడి వీడి యీ ♦ యతివంగూడి. 186

మాయాగౌరి కళావతికి రాజుల వేర్వేఱ గనబరచుట

వ. అని తర్కింపుచున్న సమయంబున నద్దేవి ఆ నరదేవ కుమార రత్నంబుతో పురస్థాన సింహాసనస్థుండైన రాజన్యునిం జూపి యిట్లనియె. 187

సీ. రఘువంశమున దాశ ♦ రథి యని యుదయించి
యజ్ఞంబుఁగాచి య ♦ హల్యఁ బ్రోచి
మిా మైథిలి వరించి ♦ రాము గర్వ మడంచి
రాజ్యంబు విడనాడి ♦ రమణిఁగూడి
తాను తమ్మునితో వన ♦ స్థలిఁ జేరి పితృాజ్ఞ
శరణుజొచ్చిన వాయ ♦ సమును గాచి
ఖరదూషణాది రా ♦ క్షసులను ఖండించి
వనితఁ గోల్పడి కబం ♦ ధుని వధించి
గీ. సూర్య సుతుఁగూడి వాసవ ♦ సూతిఁ జంపి
1వాయుసుతుచేత భూపుత్రి ♦ వార్తదెలిసి
2తరుచరులతోడ శరధి బం ♦ ధన మొనర్చి
రెగ్గిలగు జట్టులంకకు ♦ లగ్గవట్టి. 188
గ. వరభుజవిక్రమాక్రమిత ♦ వాసవ సంవద ఖండ శంక్తి కం
ధరపటుకంధరత్పట ద ♦ నగ్గల మార్గుణుఁడైనశంక్తి సం
హారహరిదశ్వవంశ కల ♦ శాంబుధి హారదపూర్ణ సోమునిఁ
బరమగుణాభిరాము భవ ♦ బంధ విరాముని రాము వింటివే 189
ఉ. అతని పూతవంశజున ♦ హార్నిశిజేయు భుజాబలైకని
ఘాత పటిష్ఠ నిష్ఠుర వి ♦ రోధి పరాక్రమ సైన్య జన్య వి
ఖ్యాతచరిత్రు బాంధవ హి ♦ తాంబుజ భాను నూచాగు శో
భాతరజాయమాను ఋతు ♦ పర్ణునిఁ గంటె కురంగలోచనా. 190
శా. వాతోద్ధూత తరంగమానస సరో ♦ భచ్ఛాతి ంజాగె ధూ
ళీతారుణ్య సుగంధ నీరసదయుం ♦ గ్రీడావగాహైక గ
త్వా తాత్పర్యముగలైనేని త్రయిలో ♦ ప్రస్తుతాచారు నా
కేతా ధీశ్వరు గోరు మిా చకితపం ♦ కేజాత పత్రేక్షణా. 191
గీ. అని యిటులఁ జెప్ప నతని వం ♦ శావతార
మంత యాలించి గాంచి య ♦ క్కాంత యతని

(1) వాతజుని (2) వనచరుల = పాఠాంతరములు.

కంజలి యొనర్చిన నెఱుంగి ♦ యవల వేఱు
వేం నిట్లని పల్కె నా ♦ కీరవాణి. 192

సీ. స్వర్గభోగాప్తిన ♦ నరభుం డీతఁడీ
రాజేంద్రుఁ జూచుమో రాజకన్య
సమవర్తి యగుచు పూ ♦ జ్యతగాంచు నీ దండ
ధరుని వీక్షించుమో ♦ తరళనయన
రత్నాకరముల ♦ పాలనఁ జేయు నీమహా
ప్రభుని గన్గొను మహా ♦ ప్రభు కుమారి
సర్వజ్ఞహితుఁడు శ ♦ శ్వచ్చింద్రుఁడీ రాజ
రాజునీక్షించుమో ♦ రాజవదన

గీ. అనుచు నృపవేషములుదాల్చి ♦ యచటనున్న
యింద్ర హరి పాశి ధనదాదు ♦ లెందఱేని
దేవతల నెంచి చెప్పుచు ♦ దేవ నితని
యెఱుగ వారికిఁ బ్రణమిల్లి ♦ యరుగుమనిన. 193

వ. అట్లుగావించి వారల నతిక్రమించి, అవలవసియించియున్న మండ
లేంద్రుల సమీపించియున్న సమ్మోంచుఁ బోణితో సద్విద్యాంగన
యిట్లనియె. 194

శా. దేవవ్రాత హితుల్ సమస్త పరిషం ♦ ధిగ్వ్రాత విక్షేప దీ
క్షావంతుల్ నయవంతు లూర్జితులు దృ ♦ ష్టశ్వేత కేతుల్ ధనుః
ప్రావీణ్యుల్ ఘన పుణ్యులిద్దఱును భా ♦ స్వచ్చంద్ర సాంద్రద్యుతుల్
ఠీవిన్నిల్చిరి కోమలీయెదుట గం ♦ టే చేది భూమీశులన్ 195

గీ. పద్మినీ కుముదిను లహ ♦ ర్పతి నిశాప
తుల కరముబట్టి యనుపమా ♦ ద్భుతవికాస
ములఁ జెలఁగు లాగు నీ నరేం ♦ ద్రులనుఁగూడి
యుండ మనసైన వరియింపు ♦ మో లతాంగి. 196

వ. అని చెప్పినవిని యూరకున్న రాజకుమారికను మనస్కారంబు
గామిఁ దెలసి 197

గీ. అద్రినిజమూర్త్య యుక్కార్య ♦ నన్యనృపుని
సన్నిధిని జేర్చియని మాన ♦ సంబునందు
గాలినుత్పన్నమైన భం ♦ గములబాలు
రాజహంసిని పద్మాంత ♦ రంబువోలె. 198

ఉ. బంధుర శాస్త్రసిద్ధమగు సద్గతులన్ దెలిసిన్ నటించి గ
ర్వాంధ విరోధ తూలహతి యందు ఖలీనలసన్మరున్మహా
గంధగతిం జరింపుచు జగంబుల వన్నెకు నెక్కుచుండు నీ
సైంధవ శేఖరున్ గనుము చారుమృగీచకితావలోకనా॥ 199

సీ. గాంధర్వ శారీర కలన నొందుటఁ జేసి
దైవత స్వరయోగ్య ♦ తనువహించె
శాస్త్రవిద్వద్విశి ♦ ష్టానీతిఁ బడఁ జేసి
దారాల సద్గతిం ♦ దనిసి మెలఁగె
అఖిలాశ్వ ముఖలక్ష ♦ ణాదృశుం డగుటచే
భూపాల సేవ్యాను ♦ భూతి మెరసె
వామపార్శ్వముల న ♦ స్ఫటికి నారయుటచే
తలవంచి బాహ్యావ ♦ ర్తనలు మానె

గీ. రహితమద్దోష పంచక ♦ ల్యాణ సహిత
సైంధవాన్వయ దీప్త వ ♦ జ్రంబు వీని
చరిత మిది వాంఛయూని వి ♦ స్ఫురిత ముకుర
తాళితాస్య కపోల శ్రీ ♦ భాలవాల. 200

వ. అని పలుకు పరిహాస చాటోక్తులకు దరహాసంబు మెఱయ నిషధ సూయాకుటిలమైన యక్కుటిలకుంతలను తత్ప్రాంత రాజ సన్నికటంబుఁ జేర్చి యద్దివ్యమానినీరత్నం బిట్టులనియె. 201

మ. నగరాట్కూట విటంక నిర్ఝర ఝరీ ♦ నాళీకపాళీరజో
గగనాంతాంకిత దేవదారు తరుపో ♦ కక్షీర విస్ఫార సా
రగ గండస్థల సాలసౌరభ సమీ ♦ రవ్రాతమున్ గోరితే
భగదత్తున్ వరియింపు మింపున సఖీ ♦ ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్ 202

మ. హిమవద్గోత్ర విహారకిన్నర వధూకిం ధూళినాకర్ణన
ప్రమదాత్మాగతశాతచేల వనమా లాలోల చేలాంచలో
ద్గమ సౌరభ్య సమీరచుంబాలయ సౌ ఖ్య క్రీడనందాడ నో
రమణీ వేడుకయై నవీన గోనుమీ లాలిత్యహేలాగతిన్ 203

గీ. అనిన పల్కులువిని తార కాధినాథు
నందున మనస్కరించని యబ్జవి వి
ధమున నున్నట్టి యామం దగమన నన్య
నృపుని సన్నిధిజేర్చి యా నెలఁతబలికె. 204

శా. బంధుప్రక్రియ నాత్మపక్షులను శో భావృద్ధులన్ జేసి గ
ర్వాంధవ్రాతము దోలు నీకువలయా త్యానందసంధాయి స
ద్బంధున్ జారుశుభానురాగు మహిమో త్కృష్టాత్మభావున్ జరా
సంధున్ జూడుము వేడుకైనమదిలో చంచత్సుభాలోచనా. 205

గీ. నావుఁ డాతనిఁ జూచి మ నస్కరింప
కన్య రాజన్యుఁ జేరఁగా నరిగె యువతి
కడలఁ జేరంగఁజనెడు గం గాఝరియును
దారినుండెడు కుధరంబు దాటునట్లు. 206

వ. ఇట్లరిగిన నవ్వధూరత్నంబునకు నద్దివిజాంగన నీలునుం జూపి
యిట్లనియె. 207

గీ. మదనుని జయించు నవలోక మాత్రచేత
కాపురము తారహేమదు ర్గములు దలఁప
నతులిత విభూతి కలదు కా స్యధిపతియగు
రాజమాళిని మనసైన రమణిఁ గనుము. 208

వ. అనిన విని యా కళావతి నీలుని వరింప రుచింపక కనుసన్న నతి
క్రమింపనుని చెప్పుచున్న యన్నిలింప వనిత సవిధప్రదేశవర్తియైన
దుర్యోధనుం జూపి యిట్లనియె. 209

శా. శ్రీకంఠప్రతిమాన దార్ఢ్యబలదోః ♦ క్రీడా ధనుర్గాఢ వి
ద్యాకౌశల్యుఁ డనేక ధర్మనయ శా ♦ స్త్రగ్రంథ సిద్ధార్థ మే
ధాశక్తిస్ఫురుఁ డుత్సవిజ్ఞ యనుధాం ♦ ధప్రీతిదుండైన య
స్తోకప్రాభవుఁ గౌరవేంద్రుఁ గనుమీ ♦ దుర్యోధనుఁ డైథిలీ 210

గీ. రాజ దంతావళాగ్ర యూ ♦ ర్థ్యము లిడి రుచిర
నఖర మహిమాప్తిఁ భూరిభా ♦ స్వఖిల దుర్గ
చారిగా నొప్పు రాజకం ♦ ఠీరవుండు
గోరుమీఁతని నవమృగీ ♦ చారునయన. 211

వ. అనిన నాలించి తదీయ గాంభీర్య తేజో వైభవంబులకు నాశ్చర్య మగ్న మానసయై, నదియునుంబోలె తలయూఁచుచు నయ్యింతి కరంబుబట్టి 212

కం. చాంపేయామోదమును స
హింసక సారంగకలిత ♦ శైలాగతినై
లింప తరువరమునకుఁ జను
సొంపున నేతెంచె ధర్మ ♦ జుని సన్నిధికిన్. 213

వ. ఇవ్విధంబున నిల్చియున్న నవ్విలాసినీరత్నంబుతో నన్వేలుపుఁగొంతి యిట్లనియె. 214

కళావతి ధర్మరాజును వరించుట

చం. నలుఁడను చక్రవర్తి తన ♦ నామముఁగోరి స్మరించువారికిన్
గలికలుషంబు లన్నొసఁ ♦ గా శపథించి స్వయంవరంబునన్
నలరుచు వేల్పులైన దమ ♦ యంతివరించెను వింటిగాదె పూ
ర్వులన గణించె మున్నగవు ♦ రూరవ చక్రధరుండ నార్యతన్. 215

కం. ఉశనస్సంభవ రాకా
శశిముఖ యను దేవయాన ♦ స్వాధిష్ట మహా
దశ వరియించె యయాతిని
ప్రశంసజేయ నతఁడితని ♦ వంశ్యుఁడు గాడే. 216

కం. పూరుకురు రాజ భరతులు
పౌరవులన కౌరవులన ♦ భారతులనగా
పేరుగనహించిరి వినఁదగు
వారిని మునువింటి గాదె ♦ వారల మహిమల్. 217

ఆ. వె. అట్టిచంద్రమాన్వ ¦ యంబున జన్మించి
ప్రబలినట్టి పాండు ¦ రాజునకును
తనయు లైదుగురు ప్ర ¦ ధానాత్ములందున
గలిగి రందు నగ్ర ¦ గణ్యుఁడితఁడు. 218

సీ. మహిమ మీరఁగ సుధ ♦ ర్మామధ్య పీఠికా
సీనుండయిన సునా ♦ సీరు పోల్కి
సనకాది మునిలోక ♦ సార్వభౌములతోడ
యజ్ఞంబు పైనున్న ♦ యజునిబోల్కి
క్షీర వారాశిలో మీఁ ♦ గిన శేష ప
ర్యంకంబుపైనున్న ♦ హరివిధమున
కైలాస భూధరా ♦ గ్రమున దీవ్యద్విష్ట
రంబున నున్న చం ♦ ద్రధరు లీల
గీ. భూవరేణ్యుల మధ్యన ♦ ద్భుత మహత్వ
చారుశోభావిభూతిచే ♦ మీర యెదుట
విష్టరంబందు నున్న య ♦ వ్విబుధ వంద్య
క్రేవగను కుందరదన పం ♦ కేజవదన. 219

సీ. ఈ రాజు వైరిని ¦ ర్వారణవారణ
వారంబునకును కం ¦ ఠీరవంబు
ఈ రాజు సంతతా ¦ శారదాశ్రితజన
కీరమండలికిని మం ¦ దార తరువు
ఈ రాజు బాంధవాం ¦ భోరాశికిని మోద
కారణంబైన నీ ¦ హార కరుఁడు

ఈ రాజు బవలుదిన । దారిద్ర్య ఘోరాంధ
కారంబునకు గ్రీష్మ । సారసాప్తుఁ
గీ. డనుచు లోకంబులెల్ల ద । న్నభినుతింప
నెగడె శాశ్వత కీర్తిన । నేక విబుధ
మాన్య మాంగళ్య సుగుణసం । పత్ప్రపూర్తి
సాధుపథవర్తి యీ । రాజ చక్రవర్తి. 220

సీ. సద్గుణంబులుగూడి । సంచరించుటచేత
ఘనత సర్వజ్ఞ శే । ఖరతఁ గాంచె
శాత్రవచక్ర శ । శ్వద్భీతి కరుఁడౌట
పంకజాతి విదూర । ఫణితిఁగాంచె
శుచిమీరి మిన్నంది । శోభనొందుటఁజేసి
ద్విజరాజ రూపిమై । దేఁజరిల్లె
కువలయానందభి । వర్ధనస్ఫూర్తి నౌట
సరస సంపత్కళా । గరిమఁగాంచె
గీ. రహిఁ జెలంగెడి చల్లని । రాజ యారె
జను లితండనఁగాఁదగె । సాధుధర్మ
జాతుఁడీతనిఁ గోరఁగా । జనుశుభాను
కీర్ణలావణ్య సదన పం । కేజవదన. 221

వ. అని బహుప్రకారంబుల నతని మహిమాతిశయంబుల నెఱింగించి భవదీయ రూపరేఖావిలాసంబునకుం దగిన వరుండితని నవశ్యంబు వరియింపుమన నంతలోన 222

కం. ఇటునటుఁ జూపి మగుంను
త్కట వేగముతోడ నిక్షు । ధనువుంగొని యా
కుటిలవికచా ప్రభువుల హృ
త్పుటముల గాడంగనేసె । పుష్పాస్త్రములన్ 223

వ. తత్సమయంబున బరవశయగుచు మగలఁ దెలివింగొని, మున్ను నారదవాక్యంబుల వినుటంజేసి యత్యంత ప్రేమానుబంధురుఁడైన

విభుడతండు గదాయని మనంబున నూహింపుచు, మోహ సంభ్రమంబు బెనఁగొనఁ దరహాసంబుగదుర కించిల్లజ్జావనత వదనయై పుష్పధామంబుచేఁబూని సంశయింపుచున్న యక్కన్నియ చేతులు బట్టి యన్నిర్జర వధూరత్నంబతని కంఠలగ్నంబుసేయుమని పల్కిన నయ్యువతి యాధర్మజుని కంఠపీఠంబున కుసుమధామంబు నిలిపి నమస్కరించి నిలిచిన, దత్సమీపంబున నున్న కృష్ణదేవునకు మ్రొక్కించి మరలించి, తదీయభవ్య మందిరప్రవేశంబుఁజేయించి యద్దివ్యాంగనాతిలకం బక్కన్నియ నాశీర్వదించి, తదీయాభివందనంబులు గైకొని యంతర్హితయయ్యె, నవ్వల రాజేంద్రలోకంబు రోషంబులఁ దమతమ విడిదియలంకుజనియెనని చెప్పిన యవ్వాలి వృత్తాంతంబులెట్లని జనమేజయుండు వైశంపాయను నడుగుటయు. 224

— * ఆ శ్వా శాం త ము * —

మ. నృపపూజాంచిత యుజ్జయాంకతను కాంక్షతి మ్యాన మీనాంక స
త్తపనీయాచల ధీరసత్కవినుతా ధారాయశస్సార కా
ధిపనీహార తుషార శైలరజితా ద్రిశ్రేష్ఠ సంతానపా
దపపాటీర శతారహార శరకుం దస్ఫూర్తి విభ్రాజితా 225

క. వితరణ రాధేయాయా
ర్జితసేవా ముదితకౌస లేయా సారాం
చిత బాహులేయ వినయా
న్వితమతి గాంగేయరూప విజితాత్రేయా. 226

— మాలినీ వృత్తము —

వెలిచెటి కులదీపా! విక్రమాం చద్దిలీపా!
నలిన నయనసేవా! నర్ఘ్యమేధానుభావా!
సలలిత గుణగేయా! సాధు విద్వద్విధేయా!
నలరిపు నిభకీర్తి! నవ్యమాంగళ్య కీర్తి! 227

## గద్యము

ఇది శ్రీ శివరామేశ్వరానుగ్రహపాత్ర భారద్వాజసగోత్ర
పవిత్ర కాళ్లకూరి సూరకవి పుత్ర కించిదాంధ్ర
కవితా విధేయ గౌరీకాంత నామధేయ
ప్రణీతంబైన ధర్మనందన విలాసం
బను మహాప్రబంధమున
ద్వితీయాశ్వాసము.
శ్రీ శివరామేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు — శుభమస్తు

# ధర్మనందన విలాసము

## తృతీయాశ్వాసము

కం. శ్రీ విద్వత్కవి జీవం
జీవ కళాశ్రేయ సకల ♦ చేతనరక్షా
వ్యావృత్తాశ్రేయ మహా
శ్రేయాంచిత పుణ్యకాయ ♦ శ్రీ గురురాయా. 1

వ. అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె, నట్లు స్వయంవర లబ్ధయైన గళావతిని గులాచారానుసారంబుగా విచారించి శ్రీనారాయణాజ్ఞ ప్రకారంబున సురాపగాకుమార ప్రముఖ నిఖిల కౌరవులు కృప ద్రోణాచార్యాదుల యనుమతి వడసి. 2

చ. తనదు పురోహితద్విజులు ♦ ధౌమ్యుఁడు మున్నగువారిఁ బంచిన
ట్లని జనకావనీశ్వరుని ♦ సన్నిధి కేగి నరేంద్రమాప్పృథా
తనయునకున్ భవత్సుత ను ♦ దారతఁ బెండిలి సేయఁగాఁ దలం
చి నళినాభునాజ్ఞ తను ♦ జేసి నదీతనయాది కౌరవుల్. 3

కం. మము బంచిన వచ్చితి మిదె
మిముగాంచితి మిష్టసిద్ధి ♦ మేలొదవెను ని
క్కముగ నిటు లొసంగితని సం
భ్రమమున మము బంపఁదగిన ♦ బహుమతు లొదవున్. 4

ఉ. నావుఁడు ధర్మరాజునకు ♦ నా సుత నియ్యఁగఁగంటి నేటితో
పావనమయ్యె మాత్కులము ♦ భాగ్యముగంటిమి నేను బంధులున్
దైవికమౌ యదృష్టముగ ♦ దా యుభయత్రకు మీరె పూజితు
ల్గావున నిర్ణయించి శుభ ♦ లగ్నము, పెండ్లికిఁ దర్లిరమ్మనన్. 5

## ధర్మరాజు వివాహమహోత్సవము

కం. అందఱు సంతోషించిరి
యంది బహూపథలవార ♦ లరుదెంచిన దీ
నందన ముఖులకుఁ దెల్పిన
చెందిన వేడుకల నతఁడు ♦ శ్రీహరితోడన్. 6

ఉ. గూడి వివాహలగ్న మను ǀ కూలులతో వివరించి నేఁడ చే
కూడెనటంచు మైథిలున § కున్ శుభలేఖ లిఖించిపంపి తో
డ్తోడనె పాండుభూవర సు ♦ తున్ గయిసేయఁదలంచి వేడ్కతో
నూడిగపుంజనుల్ దగు ప్ర ♦ యోజనముల్ సవరింపనేర్పనన్. 7

సీ. తళుకు కుందనఁపు క్రొం ǀ జిలుగైన నెరిఝరీ
పోషక్కుతో మద్య ǀ మునను గట్టి
పటకాగడీ కుసుం ♦ బాపాగ జుట్టి పై
సరిపీషుమల్లె పూ ǀ సరి తురాయి
పన్నీట చలువ గు ǀ ప్పటిఁ దాల్చి చెమటార్ప
దుస్తురుమాలు హ ♦ స్తమున జెవుల
మొసలివాయొంట్ల స ♦ ముల భుజకీర్తులు
బాజబందులు వ్రేళ్ళ ♦ బటువులుంచి
గీ. సరిగ పేషుబోంచీలు ప ♦ చ్చలమురుగులు
వీరకంకణముల కర ǀ సారసములు
నురుతరతనంపు పెర్లు వీ ♦ రాంగదములు
పదములధరించి మేదినీ ǀ పతి జెలంగె. 8

చం. కలపము తావి ఘుమ్మనఁ ǀ గా వరకెంపపరంజి నొండొరన్
గొలిపిన గారపంటిపిడి ǀ క్రొంజిగిలీనును సొగసూరిపై
గల నడికట్టునందుఁజిమి § కమ్మని వింటివజీరునాఁగ వె
న్నెల యెకిమీఁడునాగ నవ ǀ సీతలభర్త దనర్చె చూడ్కికిన్. 9

సీ. అన్నుమిన్నుల నవ్వు § వెన్నెలల్ పైఁబర్వ
పాండుభూవర తనూ ǀ భవతఁజూప

సుందరి దీప్తావ ళిందిందిరముగప్పి
ధర్మనందనత ప్రా ధాన్యపరుప
నాచార లాజాక్ష తాళిపైఁ బర్విన
నుదయేందువంశ సం పదను బోదల
వందనా మంగళా హారతిద్యుతిఁ బర్వ
పీతాంబరా ప్తతా భిఖ్యగాంచ

గీ. సమరపురినుంచి తనుఁజూడ నరుగుదెంచి
భూమినంటక నడుమంత్ర మున వసించు
వేల్పువేలఁదులు నా మ్రోల పెక్కు బల్ల
కట్లపై నాడఁగా నాట కత్తె జతలు. 10

శా. భేరీడాన్నినదంబు నవ్వెనుక గం భీరారవాక్రామితాం
భోరాశిస్ఫుట వీరకాహళరవం బుందోడుతో భట్లకై
వారంబుల్ తరువాత బ్రాహ్మణవధూ స్వస్త్యుక్తులన్ మీర సం
భారీనెక్కి నృపాలకుండుఁ దనుసం బారీలు వేగూడిరాన్. 11

మ. బిరుసుల్ గొమ్ములు శారజువ్వలు మతా బీల్బెక్కువాయీలు కా
కరపూవత్తులు చక్రబాణములు లంకావుర్లు బుడ్లాదిగా
మిరుమిట్లున్ స్వజనావలోకమునకున్ మిన్మన్నుదంతంబుయున్
గరదీపంబులచేత బట్టపవలై గాన్పింపఁగా నత్తరిన్. 12

సీ. జగము హారల కెరుం గఁగ దెల్పుగతి గుభుల్
గుభులంచు విజయదుం దుభులు మ్రోయ
దివియను మల్లెమం దిర మేలుకట్ల పో
లిక నున్నత ధ్వజాం శుకము లలర
చేరవచ్చిన కల్ప కారూఢి సటసట
కల్పిత సుమఫలా గములు వెలుఁగ
వేల్పులుగురియు క్రొ వ్విరులు నా పుణ్యాంగ
నలు సుమలాజాక్ష తలను గురియ

గీ. భట్లు గొనియాడ విక్రమా । ర్భటులు దలఁచి
స్వస్తిఁజెప్పంగ ద్విజులు ప్ర । శస్తిమీర
ధవళములు పాడ సతులు బాం । ధవులతోడఁ
దర్లె వైభవ సురరాజు । ధర్మరాజు. 13

సీ. వెలిగుబ్బగొడుగు ముం । గల పట్టుతోసుతో
నాలవట్టములు జం । డాలు నడుమ
జలమతీగుత్తాలు । జోడు దారుగ సూర్య
భానులు పెక్కురు । బాజునత్త
చనవర్ల యెటిగెల । సత్తటనట వార
మునుమున్న సేవకుల్ । గొలిచనంగ
పన్నీటి నింపుపాం । బనఁటులతోడ శా
లూల్లభంబులక్రింద । నువిదలు నన
గీ. మెఱుగుటీకెల గమి మిరు । మిట్లుగొలుప
వీరయోధులు చౌడోలు । వెంటఁగొలువ
దివి భువులవారి లోచనో । త్సవముఁగాఁగ
పడిది పెళ్లి కుమారుండు । వెడలనడచె. 14

వ. ఇట్లు పసపు పారాణి నెసఁగుచు ద్వారంబుల కిరుగడల పసిండి నిండుగుండలు రావి మావి మావి చిగురుగొమ్మలుంచి ఆవలీవల చెఱుకుగడల నరఁటిబోదెలు మొదలుగాఁగల మంగళ ద్రవ్యంబులు బొసంగంబట్టి, చీనాంబరంబుల మేలుకట్లును బచ్చతోరణంబులు గట్టి రాజిల్లు సప్పురరాజతోరంబు దారితారుచు నేతెంచు నప్పుడు మేడిమాడుగుల పైడిగోడల చాటుననుండి పూఁబోడులు వేడుకలతోడ కేలుదమ్ము లమ్ములనాచి దీవనబ్రాలు జినుకుచు దమలో నిట్లనిరి. 15

చం. వినుటయెకాని మున్ను కురు । వీరవరేణ్యుని కన్నులారఁగా
గనుటయులేదు నేఁడు శుభ । గంబగు భాగ్యవశంబుచేత గ

న్కొనగలిగెన్ నృపాలసుత ♦ కుం దగు నీ కురురాజవంశ వ
ర్థనుఁ డితఁడీడు చూడ మిథి ♦ లాపతిసూతికి రూపురేఖలన్. 16

కం. నగు మొగము సొగసు తొగరా
నగు తొగరాధరకుశోక ♦ సదరుచి భళిరే
జిగిబిగి మైసోయగ మె
న్నఁగనగునే పన్నగేంద్రు ♦ నకు ముకురాస్యన్. 17

సీ. బవిరిగడ్డవు బాగు ♦ బాగు మీసముతీరు
ఆరెకన్బొమల యొ ♦ యార మహహ
వాలుగన్నులు వహా ♦ వ్వా మోవి కెంపవు
నవు భళీ దీర్ఘ బా ♦ హువుల సొగసు
వక్షస్థలంబు సే ♦ బాసు నెన్నఁడు మంద
మెక్కుడకయిచంద ♦ మేమి జెప్ప
జంఘాయుగళి తమా ♦ షా పాదపద్మద్వ
యంబు లాగేమంచు ♦ మమ్మ చిన్ని

గీ. నగుమొగము మేలుమేలు కం ♦ దర్పసుంద
రాంగు సీతనిఁ బెండ్లాడు ♦ మంగళాంగి
భాగ్యసంపద నేమని ♦ బలుకవచ్చు
ననుచు నన్యోన్యమును జెప్పు ♦ కొనుచు మఱియు. 18

గీ. ఒక హిడింబి కిమ్మీరుల ♦ సుకరప్రకర
పరచినాఁడు దోర్బలమున ♦ మెఱసినాఁడు
దేవతానిభమూర్తి యు ♦ ధిష్ఠిరాత్మ
సోదరుం డొకఁడుండె వృ ♦ కోదరుండు. 19

కం. నరుఁ గంటిరె నారాయణు
సరసన్ సరసాభ్రనీల ♦ సమవిగ్రహు నం
బురుహాయతలోచను భా
స్కరతేజుని వలపటన్ ని ♦ శాకరవదనా. 20

కం. కదలీ యురువురలో నె
క్కువతక్కువ గానరాదు ♦ కోమలతనురూ
ప విశేష వేషములనో
నవలామానికములార! ♦ నాకం జూడఁగ. 21

ఉ. చందనగంధిగన్నులను ♦ జల్లఁగఁ జూడగదమ్మ పెళ్ళివా
రండ్రఱకన్న ముందర నె ♦ య్యారము మీరఁగఁ గోపసుందరీ
సుందరుఁ డిందిరాహృదయు ♦ చోరుఁడు వారలలోన పూర్ణిమా
చందురుఁడోయనంగ సర ♦ సత్వముజూపెఁడు పెండ్లిపెద్దయై. 22

సీ. యమునపై తాండవం ♦ బాడిన పదముల
గండపెండెరము న ♦ ల్లడలుకొనఁగ
నాత్తరతాపరా ♦ యుతహస్తములను ముం
గాముకుగుల్ భుజాం ♦ గదములమర
వైజయంతికి నిరు ♦ బాజుల వలెవాటు
వైచిన పసిఁడి దు ♦ వ్వలువఁ జెలఁగ
పట్టుబొందునగట్టి ♦ చుట్టిన సంపంగి
మొగ్గలచేసిగ ♦ మురువుగులుక

గీ. చేరకన్నుల కరుణ ♦ ముక్కారుఁ గురియ
మందహాస్యామృతమున మో ♦ మందమార
కులుకు జెలువాఱ గనువారి ♦ కెలమిమీర
సత్వసంపూర్తి గోపాల ♦ చక్రవర్తి. 23

సీ. అంభోధిలోన మీ ♦ నాకృతిజొచ్చి ధా
తకు శ్రుతులిచ్చె నీ ♦ తండ్రిగాఁడె
కమఠమై మంధరా ♦ గము మోసి సురదేవ
తలకు నొసంగె నీ ♦ తండ్రిగాఁడె
వననిధి మగ్నమే ♦ దిని నుద్ధరించె భూ
దారవేషమున నీ ♦ తండ్రిగాఁడె

ప్రహ్లాదుఁ బ్రోవ గం ♦ బమునందు నారసిం
హుండయ్యె నాది నీ ♦ తంపుగాఁడె

గీ. ధర త్రివిక్రముఁడయ్యె నీ ♦ తంపుగాఁడె
ధరణినాథుల గెలిచె నీ ♦ తంపుగాఁడె
దాశరథియయ్యె పిదప నీ ♦ తంపుగాఁడె
తాను బలరాముఁడయ్యె ని ♦ తంపుగాఁడె. 24

ఉ. చిక్కని గుబ్బచన్నులెద ♦ జిక్కఁగ కౌఁగిట గారవించియున్
జెక్కులు ముద్దువెట్టుకొని ♦ చేరి చురుక్కన మోవినొక్కి దా
చక్కిలిగింతలన్ సురత ♦ సౌఖ్యపయోధిని నోలలాడు నే
చక్కెరబొమ్మ దానిఁదగు ♦ జన్మఫలంబు ధరాతలంబునన్. 25

వ. మఱియు నొక కన్యకామణి యిట్లనియె. 26

చం. కలసియు మేనుమేనొకటి ♦ గా సరిమోమున మోముఁజేర్చి చ
న్నుల నురమాని హాతెఱలు ♦ నొక్కి పరస్పరమోవి తేనెలన్
గ్రోల యలుకల్వహించి వల ♦ పుల్ గొలిపించెను నిట్టికాంతులో
నలరుల పాన్పునన్ బొదలు ♦ నంగనదే గద భోగభాగ్యముల్. 27

వ. మఱియు నొక శుకవాణి యాజగన్మోహనునిం గని యిట్లనియె. 28

ఉ. ఎందుక యోనయస్య నగ ♦ లెందుకు పుట్టములెందుకెందు కీ
చందురు కాలిపావడలు ♦ చల్లని తావులు జల్లు పువ్వుపా
న్పెందుకు వీని సందిట వ ♦ హింపక యుండిన సౌఖ్యమేగతిన్
జెందును మందయానలకు ♦ చెప్పరె చూపరె భూతలంబునన్. 29

వ. మఱియు నొక్క చక్కెరబొమ్మ యిట్లనియె. 30

ఉ. పిల్లనగ్రోలివట్టి వల ♦ పించును వీణెయు మీటి పాడి రా
గిల్లఁగఁ జేయు నొక్కపుడు ♦ కేరుచు దాగుడుమూతలాడి రం
జిల్ల నొనర్చు పద్యములఁ ♦ జెప్పు పదంబులు నేర్చు గోపికా
పల్లవపాణులన్ హరికృ ♦ పారస మేమనవచ్చు కోమలీ. 31

వ. మఱియు నొక్క చెలి చెలికత్తెతో నిట్లనియె. 32

చ. కొలకులఁ బజ్జ సజ్జగఁ బొ ♦ గొజ్జఁగి పూఁబొదరిండ్ల మావితో
పుల సురపొన్నగున్నలను ♦ బూసిన మల్లెల నల్లిబిల్లిగా
గెలగొను ద్రాక్షపందిరుల ♦ క్రింద నహో రతికేళి నీహరిన్
నళినదళాక్షునిన్ గలయు ♦ నారుల నెన్నఁదరంబె కామినీ. 33

వ. మఱియు నొక శుకవాణి యిట్లనియె. 34

ఉ. శ్రీకరమైన మోము సర ♦ సీజదళంబుల గేరుకన్నులున్
బ్రాకటమైన వక్షమును ♦ బంగరురంగు జెలంగు శాలు శో
భాకరమైన హస్తములు స ♦ దా హృదయాబ్జమునుం గల్గు నిట్టి సు
శ్లోకుని గన్న నందుని య ♦ శోద పురాతనపుణ్యమెట్టిదో. 35

మ. జలజాతాసన ముఖ్యదేవతల వా ♦ చాలోచనేహామనో
బల సంపత్తి వచింపఁ జూడఁదలఁపన్ ♦ భావింపఁగా రాక ది
క్కుల నిండారి సమస్తజీవభయ యు ♦ క్తుండైన దేవుండు వీ
రలలో తానొకఁడై వెలుంగుట విచి ♦ త్రంబమ్మ ముమ్మాటికిన్. 36

మ. జలజాతాసనకంటె నీలజలద ♦ శ్యాముండు లోకత్రయా
నిలయుం డాత్మసహాయుఁ డస్మదభిమా ♦ నతుండు పుత్రప్రమో
దలసత్సంపదఁ జేసెఁ గాఁపు ప్రాపు దరిదా ♦ పై యుండ నీ పాండవే
యులకెల్లన్ శోభనార్థ కరణో ♦ ద్యోగంబు పాటిల్లదే. 37

వ. అని యివ్విధంబున జవ్వనులు చెప్పుకొనుచు జూచుచుండ, నా
ఖండల, దండధర, వరుణవైశ్రవణ ప్రముఖులు పుండరీకాక్షు
నానతి పెండ్లికుమారునితోడ వేడుకనేతేర, పురోభాగంబున
చారులుబరాబరిసేయ, దివినంటియున్న పందిరిక్రిందకుం జని చందు
వాల మేలుకట్లు నెడనెడలం గ్రుచ్చి కట్టిన పచ్చ తోరణంబుల
దారి నడిచి, పైడిగోడలు నెలరాలకంబాలబాలుచిత్ర పాంచాలి
కల నీలుసగరు ధూపంబులతో మణిమయంబైన పీఠంబుల జాగు
మీరు కల్యాణవేదికా దుంబర పీఠంబుమీద ధౌమ్యాది పురో
హిత ప్రముఖ మహీదేవ స్వస్తివాచక సహితుండై నరదేవుండుఁ
గూర్చుండిన శ్రీకృష్ణదేవ దేవవ్రతాదులు విదేహ దేశాధీశ్వర

ప్రత్యుత్థానులై చిత్రకంబళపరిస్థిత చీనాంబర పర్యంకాసనంబులం
గూర్చుండిరంత మిథిలాకాంతుండు దనకుం గూర్చువారిసలన
గులదేవత నిలిపి తదీయార్చావిధి సలిపి తత్సమీపంబునందు,
ముందుగా గౌరతపస్సమేతయైన దన కూతుఁ వృద్ధసువాసినీ
జాతంబుచేత రాబనిచిన— 38

## జనకుఁడు సాలంకృత కన్యాదానము సేయుట

కం. వచ్చె మిథిలేంద్రతనయర
ణచ్చరదంగద ఝణంఝ ♦ ణంధని మణిసం
పచ్చతురకంకణధ్వని
రచ్చం గూర్చున్నవారి ♦ రంజిలఁజేయన్. 39

కం. క్రేగంటిచూపు లిర్వురు
లోఁగల రాగమ్ములంత ♦ లో మెలకొను పై
తీగెలు సాగఁగఁ దమతమ
లాగులు బాగులును తలచి ♦ రాత్మలలోనన్. 40

వ. అంతలోన. 41

చం. కలువలఁ గని రేకమొల ♦ కట్టిన పైడిశలాక సోయగం
బుల తెలిపోక మానిఁపుప్రోక ♦ జగాజిగిరూక తక్కుజొ
క్కుల తనివోక దీని కుచ ♦ కోకములక్కున జిక్కి జోకతో
గలసి మెలంగుదాఁక నల ♦ కమ్మని వింటివజీరుఁ డోగు నే. 42

వ. అనునంతలోన. 43

సీ. కప్పుకొప్పున ఘనలక్ష్మిఁ | గాంచి వదన
పద్మమున పూర్ణరాజ వై | భవము నొంది
కలసి కుచపాళి చక్రవ | ర్తుల గతిగని
నడుమునను మిన్నుముట్టె భూ | నాథ దృష్టి. 44

గీ. తోడ నలకాభిరూప సం | తుష్టిచరణ
కరమహా పద్మపద్మ ప్ర | కాశపుష్టి

కనుట ముఖరాజరాజ భా । గ్యప్రపూర్తి
కే శ్రాదవె నాభిచంచలా । లోకములకు. 45

సీ. తరువాత ధౌమ్యాది ♦ ధరణీసురోత్తముల్
వేడ్కనా మంబర ♦ పీఠమందు
నునిచి వధూవరు ♦ లనుమంగళార్థక
వస్తువుల్ దెప్పించి ♦ స్వస్తిపూర్వ
కముగ విఘ్నేశుసం ♦ కల్పోక్తముగను బూ
జించి పుణ్యాహంబు ♦ జేసి చూత
పల్లవాంకురముల ♦ పాణికంకణములు
గట్టించి పుణ్యోద ♦ కములచేత
గీ. మంగళస్నాన మొనరించి ♦ రంగనలు శు
భాంగులగు వారలకు సమ ♦ యంబునందు
యొసఁగె మధుపర్కము సదేహ ♦ వసుమతీశుఁ
డర్థి దంపతులకును కృ ♦ పాజ్ఞచేత. 46

కం. సాలంకృతముగ జనక
క్ష్మాలల నేశుండు కన్య ♦ కాదానము శా
స్త్రాలంఘనముగఁ జేసెను
మేలుగ భరతాన్వయాబ్ధి ♦ మిహిరాంశుసకృన్. 47

ఉ. మంగళసూత్రమా నృపకు । మారుఁడు గట్టెను బ్రేమమీరఁగా
సంగన కంఠదేశమున ♦ సంతట దెచ్చిన క్రొత్తముత్తెముల్
బంగరు పళ్ళెరంబులను ♦ పాణియుగంబుల బట్టియొత్తి స
ర్వాంగకలగ్నమై తనర ♦ బాడి రొగిన్ తలఁబ్రాలులీలతోన్. 48

గీ. దంపతుల కర్థి వస్త్రబం ♦ ధంబు మున్ను
గానొనర్చి యాశీర్వచో ♦ క్షతలు జిలికి
క్రమముదప్పకయుండ పా । దములు ద్రొక్క
లాడజేసి రన్యోన్య శు ♦ భావహముగ. 49

వ. తదనంతరంబ సాత్త్వగ్నిహోత్రంబునందు లాజహోమంబు జేయించి, మూఁడవనాఁడు వేఁడుకతోఁడ సదస్యాశీర్వచనంబులు జేయించి నాలవనాఁడు నాకబలిజేయించిరా కళ్యాణోత్సవ దినంబులలోను. 50

కం. సతులకు తిసుతవతి సం
తత సౌభాగ్యవతి తన్ను దర్శించిన దం
పతులకు మేలిచ్చు శుభ
స్థితియని చేసిరి యరుంధతీ దర్శనముల్. 51

వ. అంత విదేహ మహీకాంతుండు నిజసంతతి వివాహంబునకు వచ్చిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రప్రముఖులకు నటనటీ గాయక ప్రముఖులకు నామెత పెట్టించిన. 52

సీ. కూరలు తృప్తిచే కూరెను మాకని
పచ్చళ్లు దెమ్మని ప్రాకువారు
భక్ష్యముల్ గొంటి మీ పాటి పాయసముఁ ది
మ్మనములు దెమ్మని పలుకువారు
పచ్చళ్లు రుచిగానఁబడియెను మా కింక
పులుసు చారిమ్మని పలుకువారు
పులుసుచారులు తృప్తి బొందితిమిఁక మాకు
భక్ష్యముల్ దెమ్మని బలుకువారు

గీ. పాయసము తిమ్మనములుండె ఫలరసములు
పెరుగు పాల్నెయ్యి తెమ్మని పిలుచువారు
నగుచు బ్రాహ్మణముఖ్యు లాద్యంతయుక్త
భుక్తి కెవ్వననార్చి ర ప్పుడు విభుండు. 53

మ. నను కారుణ్యముతోడఁ జూచి విబుధుల్ నావండి వడ్డించు భో
జనశాకాదులు పాక మిష్టరుచి మిశ్రంబైన కాఘుంపనుం
డిన జల్లారిన వెచ్చహెచ్చయిన నీ నేరంబు గాపాడినా
మన నాలించి భుజించుఁడోపిక మిముల్ ప్రార్థింతు నుష్మాంటికిన్. 54

గీ. అనుచు పంకులుఁ దిరుగ నా ♦ ద్యంత యు కి
భుక్తి కెవ్వన నార్చిరి ♦ భూసురాళి
తృప్తిగాంచి నమః పార్వ ♦ తీపతే య
టంచు నొక్కట గోవింద ♦ యనుచు నొకట. 55

వ. తదనంతరంబ కామధేను కల్పవృక్షంబులు సాక్షాత్కరించు చందంబున, భక్ష్య, భోజ్య, లేహ్య చోష్య పానీయములచే సుభిక్షపడి లేచి హస్తప్రక్షాళనాదికంబులు దీర్చి కూర్చున్న బ్రాహ్మణ క్షత్రియామలకు దక్షిణ తాంబూలంబులం దృప్తిమొనర్చి దతను జ్ఞాతుండై నిజనికేతంబునకు తన కూతు నల్లుని రావించి. 56

కం. అరణంబు లేర్చి యిచ్చిరి
కరిహయ గోధన సహస్ర ♦ క గ్రామములా
భరణములు దాసదాసీ
పరిజన మశేరధములిచ్చి ♦ పరమప్రీతిన్. 57

వ. అనకంపు దానును దన భార్యయుఁ బాల నేతుల క్షేతులం దడిపి తన గూతుం బృథావాసుదేవ ధర్మజదేవవతీ జామాతలకు నప్ప గించునెడ నానందబాష్పంబు లొలుకంగ గద్గద కంఠంబుతో నిట్లనియె. 58

ఆ. వె. మోహమలర యింక ♦ మీద నె ంము పాల
మంచిదైన నీల ♦ మంచిదైన
గోలదైన దీని ♦ కూర్మి మీరందఱు
స్నేహమునను రక్ష ♦ సేయవలయు. 59

ఆ. వె. బాలచిన్ననాటఁ ♦ గోల గోలలతోడ
నాడుచుండు ప్రాజ్ఞ ♦ విడిఁ దెలిసి
తిరుగలేదు తేఁట ♦ తెల్లంబుగా బుద్ధి
తెలియుదాక దిద్ద ♦ వలయుదీని. 60

వ. అని వేర్వేఱ నప్పగింతలుఁ జేసి తత్సఖీరత్నంబుతో నేకాంతంబు
నకుఁ దన కూతురురావించి వృద్ధకామినులం గూర్చి దీనికిఁ దగిన
హితవాక్యంబు లెఱిఁగింపు మన తజ్జనని [1]మున్నుగాఁ దాని కిట్ల
నియె. 61

కం. ఇలువరుస పతికి హిత కృతి
కలికి వినయ శౌర్య ధైర్య ♦ గాంభీర్య దయా
దులు విడువఁ జనదు సతులకు
కలకాలము మంగళాంగి ♦ కలఁగొన్నైనన్. 62

ఉ. బావలపట్ల బాంధవుల ♦ పట్ల మఱందులపట్ల ధారుణీ
దేవతకోటిపట్ల హిత ♦ దేశికమంత్రి పురోహితాశ్రితా
ర్యావళిపట్ల భృత్యనివ ♦ హంబులపట్ల నయోచితాత్మయు
నై విభునాజ్ఞ మామలకు ♦ నత్తల కింపొనరింపఁగాఁ దగున్. 63

కం. అత్తింట నీవు యెమరకు
చిత్తమెఱిఁగి నీవు జనుల ♦ చే కులమునకున్
అత్తకు మామకు హితవుగ
పుత్తడి చిటిబొమ్మ మాకు ♦ పూజ్యత నెమ్మన్. 64

వ. అనవుఁడు వృద్ధకామినులగు చెలికత్తెలిట్లనిరి. 65

కం. ఏపట్లనైన పతి కెగ్గు
నై పలుకక త[illegible] ♦ లాలసలోలా
వ్యాపారం [illegible]
యే పాతివ్రత్య ధర్మ ♦ మిది విధువదనా. 66

కం. పతిహితము సతుల కఘసం
తతిని హరియు నిఖిలవాంఛి ♦ త సంకృతియు మహా
ద్భుత సుకృత గతియుసుఖదా
ప్రతియు సఖీ చారు సరస ♦ పంకేజముఖీ. 67

(1) మొదటగా యని యర్థము.

సీ. మగనిమా టడుగుదా ♦ టఁగరాదు సుమ్మీల
గుణియైన కాకున్న ♦ క్రూరుఁడైన
ధవుమాట జవదాటఁ ♦ దగదు రూపియునైన
కోపియైన మహా కు ♦ రూపియైన
పతిమాటలెచట దప్పఁగరాదు ♦ గమ్మైన
చెమ్మైన బమ్మైనఁ ♦ జముఁడునైన
వగుమాట మీఱుట ♦ వలదు రోగియునైన
రోగియైన పరాను ♦ రాగియైన
గీ. గానదేవుఁడు గురుఁడే ♦ మగఁడయు నెడయు
ధనము మనమును జీవబాం ♦ ధవుఁడు ధవుఁడే
అట్టి పతి మీఱరాదింత ♦ యనఁగ మగని
కాయు సంబంధి సరస చాం ♦ పేయగంధి. 68

చం. కువలయపత్రనేత్రి తన ♦ కూర్మివిభుండు విదేశసేవకున్
వివిధవిలాసవైఖరులు ♦ వీడియు జీవన పోషణార్థ భు
క్తవిధియొనర్చు కార్శ్యలతన ♦ ధర్మ్యయనంబు నరించి జీవబాం
ధవు ధవుఁగూడి వెండిసుఖ ♦ తత్పరతం జనుఁదాన్పు సాధ్వికిన్. 69

గీ. పనుల వినయోక్తి యుపచరిం ♦ ప భయయుక్తి
కుడుపుతఱిభక్తి శయనింపు ♦ నెడల రక్తి
సత్క్రియాసక్తి క్షమయందు ♦ చాలశక్తి
గలది కులవర్ధని యటంద్రు ♦ కమలగంధి. 70

సీ. పరుల వీక్షించుట ♦ బహుభాషిణియునౌట
పొరుగిళ్ళ కరుగుట ♦ తిరిగికనుట
పతికి మార్వాలుకుట ♦ పకపకనవ్వుట
పతిభక్తి విడచుట ♦ భయముచెడుట
పరునితో నలుగుట ♦ ధరవంగ నడుచుట
పవలు నిద్రించుట ♦ పాటుచెడుట

మునిమాపు తలఁద్రిప్పి ♦ ముసుచుట గుసుచుట
ఘనబుద్ధి నెడలుట । కరుణ విడుట

ఆ. వె. మానినులకుఁ దగదు ♦ మఱియొక్కటాలింపు
సకలభోగభాగ్య ♦ సౌఖ్యసంపదవు
లుండెనేని సతుల ♦ కొకటిఁ దప్పఁగరాదు
వరునియాజ్ఞ పృథ్వి । పరమసాధ్వి. 71

ఆ. వె. తల్లిదండ్రు లన్న ♦ దమ్ములు ముదమొంద
నుభయవంశకీర్తి ♦ హెచ్చుమొదవ
కుండఁ ఘనతమీఱ । నుండుట తగియుండు
ఖంజరీట నయన ♦ గరిమఁజూడ. 72

వ. అని బహుప్రకారంబులం బుద్ధులందెలుపు వృద్ధసతీజనంబులకు ప్రొక్కి తల్లికి నమస్కరించి, పెనిమిటి యింటఁ ఘనమైనపుట్టింటి యాస వొలతులకు బలువగుటంజేసి చెలులం జూచి బాష్పగళిత నేత్రయగుచు తలవంచిన "యిట్లు విచారింపఁదగునా? ఏమిందులో నిన్ను బాయంగలవార మెవ్వారమందు యింటు నిన్నుంగూడి యుందు మందన్యు లెవ్వారనుచు" యూరార్చి చెలులుచుట్టు రాఁగ తజ్జననియగు జనకపురంధ్రీ రత్నంబా కన్యారత్నం బానంద బాష్పంబు లొలుక గద్గదస్వరంబుతోఁప వందనాభిప్రాయంబుగా రక్షసేయవలయుననుచు పృథాదేవి కరంబులో కరంబులుంచి యప్పగించె తదనంతరంబ. 73

ఉ. కోరికమీఱ నల్లునికిఁ ♦ గూతుకు బ్రీతిగ కట్నకానుకల్
కూరిమి నిచ్చిపంపె జన ♦ కుండిరువాగులు గూడి పెండ్లికిన్
జేరిన పిన్నపెద్దలకు । చేతులకొద్ది యభీష్టవస్తువుల్
భూరిగనిచ్చిపంపిరి నృ । పుల్ తను సద్ధినుతింప భూవరా. 74

వ. ఇట్లు కానుకలంది అద్ధరా సురోత్తములు పరమాత్ముండయిన శ్రీకృష్ణదేవుని స్తుతించి. 75

## ముక్తపదగ్రస్తం

సీ. శ్రీవధూపేత యా । శ్రిత పారిజాత దే
వారిజశ్యాత । దివ్యాస్త్రభాత
జాతరూపదుకూల । సత్యానుకూల శీ
లాంశుభృల్లోల । చిన్మార్గఖేల
ఖేలసత్సత్రయాం । కిత సుచారిత్ర నీ
లాంబుభృచ్చిత్ర ని । లాభగాత్ర
గాత్ర శృంగార రే । ఖామనస్సుకుమార గో
త్రావనోదార గో । త్రాధికార
గీ. కారణాధార శ్రీకర ♦ గర్వదూర
దూరితాశేషబంధుర ♦ దుర్విచార
చారణాధార గోచర ♦ సారహార
హారకీర్తి ప్రభాహారి ♦ దంతవార. 76

## సమలఘుసీసము

సీ. కరివరద విశద నవపర ♦ సీరుహావళీయుత
ధరణీ ధగనవరశయన ♦ గరుడగమన
దృఢకదన మధుమదన ♦ రుధిరభుగధికరధిక
నిబిడకధి కధిపహన ♦ విబుధసదన
అరికరణ సుదర్శన ♦ సనసతరణయు మహాత
నిరుపమితగుణ సదన ♦ నిగమభరణ
కువిహరణ భవతరణ ♦ భువనభవ పటుచరిత
తరు తిమిరహరణాలస ♦ దరుణకిరణ
గీ. విధిమునిజన పరికర ♦ హృదయ శుభద
కనదమృత మయాపకిరణ ♦ కలిత సరస
వివిధ సకుల సనలపయుత ♦ యువతి నివహ
బహుళ సుమశర సతహిత ♦ ఫలవితరణ. 77

వ. అని మఱియు నిట్లనియె. 78

మ. హరినారాయణ కృష్ణ కేశవ వికుంఠావాస గోవింద శ్రీ
ధర దామోదర చక్రపాణి పరమాత్మా పుండరీకాక్ష శం
కర గోపాలక గోపికా రమణ లోకత్రాణ పారీణ మం
ధర శైలోద్ధర మాధవాచ్యుత ముకుందా వృష్ణివంశోదయా. 97

సీ. వసుమతీ భారంబు వాప దేవకిగర్భ
మున వసుదేవనందనత గాంచి
వ్రేపల్లెలో నంద గోపాలు నింటను
బెరుగుచుఁ బూతనన్ బిలుకుమార్చి
శకటతృణావర్తులకు మోసము ఘటించి
మద్దిమ్రానుం గూల్చి కొద్దిపరిచి
గోప కన్యకలలో కువఁ జేసి వసియించి
పాలు పెరుగును వెన్న గ్రోలి మెసఁగి

గీ. గోవులను గాయ దిరిగి బృందావనమున
గోపరక్షణార్థము కొండ గొడుగుఁ జేసి
కంసముఖుల నణఁచి ద్వారకను వసించి
పాండవులఁ బ్రోవవచ్చిన పరమపురుష. 80

ఆ. వె. నీవు నిలుచుచోట నిత్యకల్యాణంబు
పచ్చతోరణంబు ప్రజకు నిచ్చ
నీదు దర్శనంబు నిఖిల లోకానంద
పూరకంబు సకల కారకంబు. 81

ఉ. కావున నీదు దర్శనము గంటిమి మంటిమి నేటితోడ సౌ
ఖ్యావహవృత్తినుండెద మనంతము గాఁగ నిజాలయంబులన్
దేవరయానతిన్ నిజసతీసుత బాంధవ మిత్రభృత్య సం
భావనయుక్తి నుండెదము పాపవిమోచన పద్మలోచనా. 82

ధర్మరాజు కలావతితో యింద్రప్రస్థంబు చేరుట

వ. ఇట్లు వివాహమహోత్సవంబునకు వచ్చిన ధరాదేవ, నరదేవా
దులు హరినారాయణ మిథిలాధినాథులచేత ననుజ్ఞాతులై నిజ

నివాసంబులకుం జనిరి. కురుపాండవులు పుండరీకాక్షుం బురస్కరించుకొని వధూవరులతో మంగళరతోరణాలంకృతంబును, మదమాతంగ దానోదక పంకిలంబును, బహుపతాకాభిరామంబును బహువితానవద్య వాద్యమాన ఘూర్ణమానంబైన యింద్రప్రస్థ పురంబునందు ప్రవేశించి ధర్మనందనుండు— 83

గీ. తల్లులకు వృద్ధకాంతామ ♦ తల్లులకును
క్రమములో ♦ మ్రొక్కి దీవనలాంచి నిజవ
ధూసమేతముగ పరమసం ♦ తోషమునను
సుఖతరంబుగ నుండె భూ ♦ సురవరేణ్యా. 84

కం. తరువాత పెద్దలందఱు
సరసంబై తగు ముహూర్త ♦ సమయమున వధూ
వరులకును శోభనోత్సవ
మరుమగ సేయంగదలంచి ♦ యానతిసేయన్. 85

చం. నగసున కల్కి మ్రుగ్గులిడి ♦ చూట్కికి వేడుకసేయు మేడలో
పసిడిపు కోళ్ళ పట్టియల ♦ బాగగు పందిరిపట్టెమం చమున్
అగణిత భోగవస్తుచయ ♦ మర్థి నమర్చి గృహప్రవేశమున్
దగ ఘనరించిరా ధరణి ♦ నాథుని ముందుగ వెన్క కోమలిన్. 86

దంపతుల అన్యోన్యానురాగ సల్లాపములు

ఉ. అప్పుడెడ లేని మోహమున ♦ నమ్ముకురానన చేరదీసి చే
కపురపు వీడియంబిడి సిగన్ మెడఁ గ్రొవ్విరిదండలుంచి ని
ద్దపు మెరుగారుచెక్కులకు ♦ దారిచి కేల్కొని ముద్దులంతలో
నృపకుల సార్వభౌముఁ డొన ♦ రించె ననేక మనోవినోదముల్. 87

సీ. నిగనిగలాడు నో సి యుగపు నుంగెక్కుల
వేడుకతోడ ము ♦ ద్దాడవలదె1
పగడంబుచాయల ♦ నగు జగాజిగివారు
గోనబైనవాతెఱ సి గ్రోలవలదె2

1, 2 'నియా' యని పాఠాంతరము.

పసిడిచాయల మిస ♦ మిస లెసఁగెడి మేను
లీలతోడుత ♦ కౌఁగలింపవలదె?
తగఁగుల్కు బిగిగుల్కు ♦ సొగసైన గబ్బిగు
బ్బల బలు కూర్మితో ♦ బట్టవలదె?

గీ. ఇంత యిటువేడినను కేళి ♀ కియ్యకొనక
కంతు పూదూపులకు నప్ప ♀ గింతఁజేసి
స్వాంతమున నక్కటికమూను ♀ మింత పంత
గింతురా కుందరదన ♀ పంకేజవదన. 88

మ. నను నీవానిగ నేలుకో మదనబా ♦ ణవ్యాప్త సంతాపమా
ర్ప నుపాయంబు సుధాధరంబు నకుకం ♦ పట్రగోలగా నిచ్చినా
మని లాలించియు కౌఁగలించి సుఖసాం ♦ ద్రాజ్యంబు పాలించుకో
విను లజ్జాభర మేలుకోగనుము నా ♦ విస్ఫార క్రీగన్నులన్. 89

మకరికల్ వ్రాతు నీ ♦ ముకర కపోల నీ
దులకీమనమ్మ మ ♦ న్మథునితోఁడు
పూదండలుంచెద ♦ పొలతి నీకీజడ
సరస కేతెమ్మ వ ♦ సంతుతోఁడు
తిలకంబుదీర్చెద వెలఁది నీ ♦ మొగమిమ్మ
దప్పించుకోకు చం ♦ ద్రమునితోఁడు
గంధసారము చను ♦ గవనందెదను రమ్మ
కమలాక్షి వలిమొట్టు ♦ గాడ్పుతోఁడు

గీ. సిగ్గు విడనాడవేటికే ♦ చిగురుఁబోడి
పలుకు లాలించవేటికే ♦ జలజగంధి
కౌఁగలియ్య విదేటికే ♦ కంబుకంఠి
వీడియం బందవేటికే ♦ విద్రుమోష్ఠి. 90

చ. అని బ్రతిమాలి మోహభర ♦ మానగలేక నరేంద్రచంద్రుఁ డా
య్యన దనకేలుసాచి ముకురా ♦ నన కేల్గొన చేరబిల్చి పా

3, 4 'నికువె' యని పాఠాంతరము.

న్నన నెలకొల్పి మెల్లన క । పోలములంటుచు మోవితేనియల్
గ్రోలుచు కవుంగలించె మఱి । లోఁగినమీఁదట నేమిసేయునో? 91

కం. సతికైదు ముళ్ళు గలవఁట
పతివిప్రుఁడు రెండుముళ్ళు । బలవంతముగన్
హితవున నొకముడి వీడును
సతి దక్కిన రెండుముళ్ళు । చయ్యనవీడున్. 92

చం. అని సరసోక్తులాడుచు ల । తాంగి కనుంగవలన్ నరాంగమం
దును గళమందు జెక్కులను తోరపుచన్నుల హస్తయుగ్మమం
దొనరఁగ నొల్మి ముద్దుల స । ముద్రలతోన్ దగబెట్టి మేల్కొలన్
దనరు పదార్లు గుర్తెఱిఁగి తన్విని । దా రమియించు చేసెన్. 93

కం. ధవళాక్షి నీవు నేనుం
దవిలి మనోజాతదేవ । తా ప్రీతిగ ను
త్సవ మొనరించఁగవలె నీ
వి విడచి నే చెప్పినట్లు । వినవే యింకన్. 94

ఆ. వె. అనుచు నవ్విధమున । సన్వా...వరులంత
యింత యనఁగరాని । కంతురాజ్య
భోగవార్ధిఁ దేలి । రాగమ్ము మదినూర
దినదినంబు కోర్కె । కొనలుసాగ. 95

సీ. క్రీడాచలంబుల । చేరుకతోఁ గొంత
మేడమిద్దెలలోన । గూడి కొంత
పూఁదోటలకు నేగి । పూలుగోయుచు కొంత
కొలఁకులలో నీదు । గొనుచు గొంత
సొగటాలపాఁజూ । చుచు నాడుచును గొంత
చాటునాట్యప్రసం । గసల గొంత
పాలయుల్కాపాని త । ప్పలు పట్టుచును గొంత
గడగడ । నెసేయగనుచు గొంత

గీ. పొద్దు జనువోకపుచ్చుచు ♦ భూవరుండు
నూతనకళాను మూర్తాను ♦ భూతి మెరసి
స్వాంతమునకును బలుకున ♦ సాటిలేని
యంగ భవభోగ సామ్రాజ్య ♦ మనుభవించె. 96

కం. బహుదినములిట్లు సతితో
మహిపతి కేళీవినోద ♦ మతి జరియింపఁ
నహిమకరముఖ కంతట
విహితంబై గర్భభర ♦ విధ మగుపడియెఁ. 97

సీ. అలయిక బలువయ్యె ♦ నెలకొనె నోకిలిం
తలు చనుముక్కులు ♦ నలుపుగ్రమ్మె
చెక్కులు తెలుపెక్కె ♦ గ్రిక్కిరిసెను నగల్
గానుదీఁగె యొకింత ♦ గానవయ్యె
కనుకెక్కనయ్యెను ♦ దినుకూడు కూరల
సహ్యమయ్యెను మన్ను ♦ సహ్యమయ్యె
చిత్తము రంజిల్లె ♦ క్రొత్తరుచుల్ గోరె
నాలుక బరువయ్యె ♦ జాలు మేన
గీ. నంతఁ గనుగొని యా మహీ ♦ కాంతుఁడు దన
పొలతికి నొసఁగె సీమంత ♦ పుంసవంబు
లార్యసమ్మతి జేకొని ♦ యతిరయమున
చనియె నవమాసములు పూర్ణ ♦ చంద్రముఖికి. 98

## ధర్మరాజునకు విదేహ రాజు జననము

కం. కనియె సుముహూర్త సమయం
బునపుత్రునిఁ గులపవిత్రుఁ బుణ్యచరిత్రుఁ
దను రూపాంచిత కైరవ
వనమిత్రుఁ బోషితాగ్ర ♦ వర్ణు సుమిత్రుఁ. 99

వ. తదనంతరంబా ధర్మనందనుండు కుమారోదయంబున కత్యంత
సంభ్రమానందమంది, వసుంధరా సుధాంధులకు గోభూ హిర
ణ్యాది దానంబులిచ్చి జాతకర్మంబు నిర్వర్తించి 100

గీ. నామకరణంబు జేసె భూనాయకుండు
ఘనముదంబున వైదేహ గర్భజునకు
ధీరసమ్మతమునను వైదేహుడనుచు
భూతిజాతంబు సంతోషమున భజింప. 101

వ. తదనంతరంబ. 102

చ. దినదినమా తనూభవుడు తేటగ వృద్ధిబొందుచుండగా
తనపతి ద్రౌపదీ సతియు దానును దమ్ములు తలులాప్తులున్
దనయులుగొల్వ సర్వవసుధాస్థలి యేలె సుఖోపవిష్టుడై
ఘనుడగు ధర్మరాజు తన కైవశమై ధరరాజులుండగన్. 103

మ. క్షితిదేవుల్ శుభమాచరింప నృపతుల్ సేవింప విట్శూద్రసం
తతి మోదింప మహాకవీంద్రులు ప్రబంధమ్ముల్ రచింపన్ సదా
శ్రితులై గాయకసూతమాగధులు వర్ణింపన్ నటింపన్ మహో
చ్ఛృత నేలెన్ సుఖముండి ధర్మజుడీలా చక్రం బవక్రంబుగన్. 104

వ. అని చెప్పిన జనమేజయుండు వైశంపాయనునభివందించుటయును.

ఆశ్వాసాంతము

మ. విమలాదిత్య సమానతేజస సలోకీరాజ సంసద్ఘనో
త్తమ చిత్తోల్లసితప్రధాన గుణసంధానా సదాదాన సం
భ్రమితారాతి వితానదోర్బల సముద్రక్షోభ్య మానార్య శ్రీ
కమలాక్షాంఘ్రి సరోజగాత్మ హృదయా కందాళ గోత్రోద్భవా.

కం. వెలిచెటి కామయకుల మం
గళధాత్రీ వెంకమాంబ కాగర్భపయో
జలనిధి పూర్ణాత్రేయా
విలసద్గుణ గురువరాయ విద్వద్గేయా. 109

## మాలినీవృత్తము

కవిజనసురభూజా ! గాఢ ధైర్యాద్రిరాజా !
కువలయహితరూపా ! కుంఠితారిప్రతాపా !
సవినయజనపోషా ! సత్యభాషాభిలాషా !
ప్రవిమలగుణపూతా ! పాపరాయానుజాతా ! 108

## గద్యము

ఇది శ్రీ శివరామేశ్వరానుగ్రహపాత్ర భారద్వాజసగోత్ర
పవిత్ర కాశ్లకూరి సూరయకవి పుత్ర కించిదాంధ్ర
రచనావిధేయ గోపీకాంత నామధేయ
ప్రణీతంబైన ధర్మనందన విలాసంబను
మహాప్రబంధమున సర్వంబును,
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శివరామేశ్వరార్పణమస్తు.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 11 | యూఫాంత | యూధ |
| 17 | 6 | 20 | 70 |
| 17 | 22 | రోహిణీ | రేవతీ |
| ,, | 26 | 7 | 75 |
| 18 | 6 | నైతు | నైదు |
| 20 | 16 | 38 | 83 |
| 28 | 15 | కల | కలు |
| 30 | 9 | లాలికా | లావికా |
| 30 | 18 | సనుచు | ననుచు |
| 31 | 23 | జెలలు | జెలులు |
| 32 | 4 | నిచ్చల | నిచ్చలు |
| 32 | 19 | వై | వైరి |
| 33 | 11 | ద్వేషి | విద్వేషి |
| | 23 | గుణరర | గుణర |
| 35 | 78 | దాయక | దాయ |
| 37 | 8 | కునుగాని | కోరుగాని |
| 40 | 21 | నీకువుర | నీరివుర |
| 41 | 5 | ఖరమృష్టిఘృట– | ఖరఘృష్టి స్ఫుట |
| 42 | 27 | యుక్త్విష | యుక్త్మీర |
| 44 | 11 | ధృష్ణత్త | ధృష్ణమస |
| 47 | 26 | దూటి | మాటి |
| 51 | 21 | ధారర | ధాధర |
| 54 | 7 | కర్మ | కర్ణ |
| 55 | 7 | జేసె | జేసి |
| 55 | 20 | మించి | వించి |
| 60 | 5 | సాపు | సాప్తు |
| 63 | 8 | సుతతి | సుదతి |
| 67 | 3 | న | నన |

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 68 | 18 | టురుక్కి | టిదువ్మి |
| 73 | 1 | | యుపాలం చించి |
| 75 | 20 | బనంత | బనంతా |
| 76 | 25 | బెంకట | బెంకణ |
| 78 | 21 | జేర్పి | దేర్పి |
| 81 | 24 | చిక్కొర్చి | చిక్కేర్చి |
| 82 | 1 | గాను | లేగాను |
| 83 | 12 | రపుకాశికపుగుత్తిరాళ్లకట్లు- (పాఠభేదము) రపుకాశికుత్తికంట్లు పవడాలు | |
| 84 | 22 | నను | నును |
| 85 | 16 | ధాత్రికివి | ధాత్రికి |
| 88 | 15 | హరద | శారద |
| 92 | 5 | యూర్ధ్వములిడి | మూర్ధమణి |
| 95 | 13 | శాంతము | సాంతము |
| 98 | 13 | పీషు | ఫేషు |
| 106 | 22 | బాడి | నాడి |
| 108 | 8 | దత | తద |
| 109 | 12 | నత్త | వత్త్రం |
| 112 | 5 | లాంఛు | తాంఛు |
| 115–13,14 | | కపోలనీదుల– కీమ | కపోల సీమలలేమ |
| | | మేలుకో | మేలకో |
| ,, | 24 | మొష్షి | మోష్టి |
| 116 | 9 | లఙ | లల్ |
| | 21 | ప్రసంగ | ప్రశంస |

